శ్రీ రామాయనమః

# సీతాదేవి చరిత్రము



విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



శ్రీ రామాయనమః

# ఆర్యచరిత్ర రత్నావళి

# శ్రీ సీతాదేవి చరిత్రము

(మొత్తము మూడుభాగములు)

వావిలికొలను సుబ్బారాయ
విరచితము

ఐదవ కూర్పు ౧౦౦౦

శ్రీకోదండ రామ సేవక ధర్మసమాజము
దొసకుటి - అంగలకుదురు,
(వయా) తెనాలి.



శ్రీ ప ద్మా వ తీ దే వి

దాతారం సర్వసంపదామ్

ఆపదా మపహర్తారం



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్

కం. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నునితాం
తాపార భూపదయయును
దాపసమందారనాకుదయసేయఁగదే.

శ్రీరామాయనమః

# ఆర్యచరిత్ర రత్నావళి

ఆఱవ రత్నము

# శ్రీ సీతాదేవి చరిత్రము

## ప్రథమ భాగము

రుక్మిణి : అప్పా! చంద్రమతి చరిత్రము, శకుంతలా చరిత్రము, దమయంతీ చరిత్రము, సావిత్రీ చరిత్రము చెప్పితివిగాని యింకను సీతాదేవి చరిత్రము చెప్పలేదేల ?

తండ్రి : చెప్పెదను. శ్రీరామచరిత్రములోనే సీతాదేవి చరిత్రము కలిపి చెప్పఁ దలఁచి యుంటిని. మీ రడిగితిరి కావున వేఱుగనే చెప్పెదను.

రుక్మిణి : సీతాదేవి చరిత్రము చెప్పు మనిన నీకు కన్నుల నీరు గాఱుచున్న దేల? సంతోషము చేతనా? దుఃఖము చేతనా?

తండ్రి : రెంటిచేతను. అటువంటి పరమపతివ్రత చరిత్రము కీర్తించు నదృష్టము గలిగెనని సంతోషము. ఆమెకుఁ గలిగిన కష్టములు దలంచిన దుఃఖము.

రుక్మిణి : చంద్రమతి మొదలైనవారు పతివ్రతలు గారా? వారు దుఃఖముల ననుభవింపలేదా? సీతాదేవి విషయమున నెక్కువ సంతోషము ఎక్కువ పరితాపము పడెదవేల. ఆమెను దలఁచి మ్రొక్కుచున్నావే. ఆమెయం దేమి విశేషము?

తండ్రి : పతివ్రతలుగా నుండు నే స్త్రీలైనను నా నమస్కారమునకు యోగ్యురాండ్రే. అట్టివారిని దలఁచిన మనపాపములు పోవును. పతివ్రతలుండు దేశమున దుర్భిక్షము, మారి లోనగు వ్యాధులు గాని, బాలమరణములు గాని యుండవు. అట్టి పుణ్యస్త్రీలు తమ పెనిమిటులనేగాక తోడివారి నందఱ రక్షింపఁ జాలియుందురు. అట్టివారికి దేవతలును నమస్కరింతురన మనుష్యులు నమస్కరించు

టేమివింత? ఉత్తమ స్త్రీల చేతనే వంశాచారములు చక్కఁగ నడచును. ఉత్తమ స్త్రీల చేతనే వర్ణసంకరము కలుగ కుండును. ఉత్తమ స్త్రీల చేతనే దేవతాతిథి పూజలు వ్రతములుకొనసాగును. దుష్ట స్త్రీల వలనఁ గలుగు కీడు ద్విపద భగవద్గీత యందు మీరు చదివితిరిగదా, శీలము లేని స్త్రీ చేతి భోజనము నీళ్లు ఎట్లు వారి పాపము మనకుఁ గలిగించి తేజోనాశము గావించునో, అట్లే పుణ్యస్త్రీల చేతి నీళ్లు భోజనము దేవతాతీర్థ ప్రసాదమువలె మన పాపములను బోఁగొట్టి పుణ్యము కలిగించి తేజోభివృద్ధి గావించును. ఇంతయేల? ఇప్పుడు సదాచార సంపన్నలు దేవ పితృ గురు భక్తిగలవారలు నగు స్త్రీలుండు గృహము లెట్లున్నవో యిచ్చావిహార స్వభావలు, దురాచార దూషితలు దేవ పితృ గురుభక్తిహీనలు కాముకలు గల కొంపలెట్లున్నవో మీరు చూచుట లేదా? స్త్రీ దుష్టురాలైనఁ బురుషుఁడు చక్కదిద్దుట దుస్సాధ్యము గాని మగఁడు పతితుఁడైనను వాని భార్య పతివ్రత యగునేని వాని నభయలోకములను రక్షింపఁగలదు. ఇప్పటికిని మన దేశమున పూర్వాచారములు పుణ్యవ్రతములుచెడకుండుటకుఁ బుణ్యస్త్రీలే కారణము. అట్టివారికిఁ గూడ తాఁజెడ్డ క్రోతి వనమెల్లఁ జెఱచినట్టు మతిమాలిన కొందఱు పురుషులు బ్యాలమునుండి దురాచారములు నేర్పి కామవశలఁ జేయుచున్నారు. ఇప్పటి యుత్తమ స్త్రీలే నాకు వంద్యలగుచుండ పూర్వ మహా పతివ్రతలమాట చెప్ప నేల! సీతాదేవి చరిత్రము విన్న తరువాత నామెయందలి విశేషము మీకే తెలియఁగలదు. ఆమెయం దేవిశేషము లేనిదే వాల్మీకిమహర్షి యామె ప్రభావము లోకమునకుఁ దెలుప "సీతాదేవి మహాచరిత్రమును" పలికెదనని శ్రీరామాయణ కావ్యమును జెప్పెనా? ఆమెయం దే ప్రభావములేనిదే యామె చరిత్రము 'నాకును శ్రేయస్కర' మని శ్రీరాముడు చెప్పెనా? ఆమెయం దే మహిమలేనిదే లోకమంతయు నామెనుఁ బూజించుచున్నదా? కావున సీతాదేవియందు గొప్ప మహిమ గలదు. అది యామె చరిత్రమును శ్రద్ధతో వినినఁ దెలియును. లోకమున బురుషులకు యోగ్యచర్య యెట్టిదో తెలుపఁ బుట్టిన మహాత్ముఁడు శ్రీరాముఁడు కష్టములందును సుఖములందును స్త్రీకి నెట్టిచర్యయోగ్యమో దెలుపఁ బుట్టిన మహాత్మురాలు సీతాదేవి. రావణుఁడు లోకములోని స్త్రీలను జెఱచి



బాధ పెట్టగాఁ వారినిఁ జెఱనుండి విడిపించుటకును, ఎట్టి చర్యచే నబలలు దుష్టపురుషులకు వశలుగాక తమ్ముఁ దాము గాపాడు కొనఁగలరో తెలుపుటకు సీతాదేవి యవతరించెను. మగఁ డైశ్వర్యయుక్తుఁడై యున్నప్పుడు వినయ విధేయతలతో నణఁగి మణఁగి యాకుచాటు పిందెవలె నుండుట స్త్రీ కెట్లు స్వభావమో యట్లే మగడు దరిద్రుడై నపు డతని నిందించుట, వదలిపెట్టి తెగిన గాలిపటమువలెఁ బోవుఁటయు స్వభావము. అట్టి స్త్రీ లుభయలోకముల భ్రష్టలగుటయు నిశ్చయము. కావునఁ గష్టదశయందును స్త్రీ చర్య యెట్టిదై యుండవలయునో దానిని సీతాదేవి తానాచరించి లోకమునకుఁ జూపెను. దుఃఖపడు వారి దుఃఖము నివారించుటకును, లోకమును సన్మార్గమునఁ బ్రవర్తింపఁ జేయుటకును దాను సమస్త దుఃఖము లనుభవించు టెట్టి గొప్పతనమో మీరే యాలోచింపుడు. ఆమె చర్య వలనను మాటల వలనను మనము సదాచారము నేర్చుకొనవలయును గనుక మీరు మిక్కిలి హెచ్చరికతో వినయందందు మాటలయందుఁ గల విశేషమును గూడ గ్రహింప వలయును. ఊరక చరిత్రము మాత్రము చదివిన విశేషఫలము కలుగదు. కావున శ్రద్ధాభక్తులతో భక్తరక్షణ దీక్ష వహించిన శ్రీసీత చరిత్రమును వినుఁడు.

## శ్రీ సీతాదేవి చరిత్రము

శ్రీమంతమైన యార్యావర్తమున మిథిలయను నగరము గలదు. దానిని జనకుఁడను రాజు పాలించుచుండెను. ఆయన మహాపుణ్యాత్ముఁడు. సదాచార సంపన్నుఁడు. ఇంద్రియ నిగ్రహము కలవాఁడు. రాజయోగి. ఆ భూపాలుఁ డొకనాఁడు యజ్ఞమునిమిత్తము పవిత్రమైన పొలమును దున్నించుచుండ యజ్ఞఫలము సాకారమై ప్రత్యక్షమైనట్లు నాఁగటి చాలునందొక బంగారుబొమ్మ వంటి బాలిక దొరకెను. అప్పటికి బిడ్డలు లేనివాఁడు గావున ఆరా జాబిడ్డ నెత్తుకొని యింటికి పోయి భార్యకిచ్చి తన కన్న కూఁతువలెనే మిక్కిలి గారాబముతోఁ బెంచుచు సీతయందు దొరకెను గనుక నామెకు సీతయని పేరు పెట్టెను. (సీత యనఁగా నాఁగేటి చాలు) ఇట్లు దినదిన ప్రవర్ధమానయైన బాలికకుఁ గన్యాత్వము ప్రాప్తింపఁగా వివాహ యోగ్య దధ వచ్చెనని జనకుఁ డెఱిఁగి యా సర్వాంగసుందరి యమానుషవిధముగా జనించెను గావున నామెను

నమానుష తేజోయుక్తుఁడగు వానికీయవలయునని యాలోచించి తన యొద్ద నున్న శివధనుస్సు నెవఁ డెక్కు పెట్టునో యతని కీ కన్యక నిచ్చి వివాహ మొదర్చెదనని స్వయంవరము చాటించెను.

రుక్మిణి : శివధనుస్సు నెక్కు పెట్టినవానికే సీత నీయవలయునని యెట్లు జనకునకుఁ దోఁచెను ?

తండ్రి : జనకరాజు క్షత్రియుఁడు కావునను, తక్కువ కులము గుణము గలవానికిఁ గన్య నీయరాదు గనుకను, దనయల్లుఁడు బలపరాక్రమసంపన్నుఁడుగా నుండవలయునని కోరుట స్వభావమే కదా? సీతాదేవి లోకము వారివలె జనించినది. కాదు కావున నామె మహామహిమ గల దివ్యస్త్రీగా నుండవలయును. అట్టి దేవతా స్త్రీని సామాన్య మనుష్యున కిచ్చి వివాహము చేయరాదు గదా? శివుని ధనుస్సును శివు నంతటివాఁడుగాని యెక్కు పెట్టలేఁడు. అట్టి వాఁడు సామాన్య పురుషుఁడుగా నుండఁజాలడు. కావున నట్టివాని కీయ వలయునని నిశ్చయించుకొనెను. ఈ విషయమై యొక పుక్కిటి పురాణము గలదు. శివధనుస్సు నొక మందిరమున మందసమున నునిచి జనకుఁడు ప్రతి దినము దానిని బూజించుచుండెను. ఒక నాఁడు సీతాదేవి చెలికత్తెలతో నా మందిరమున చల్లుడు పిచ్చె లాడుచుండ నొకకాయ ఆ మందసము క్రిందికిఁ బోయెను. చెల్లికత్తె లేమి చేసినను ఆ కాయ రాలేదు. అప్పుడు సీతాదేవి కూర్చుండినట్లే కూర్చుండి యెడమ చేతితో నా పెట్టె నావలి కీడ్చి తన కాయను దీసికొనెను. ఈ పెట్టు మూఁడునూర్లమంది బలశాలు లీడ్చినను గదలునది కాదు. అట్టిదాని నామె యెడయచేతితో సునాయాసముగ నీడ్చెను. కావున నట్టి బలిష్ఠురాలిని సామాన్య దుర్బల పురుషుల కీయరాదని యెంచి యా విల్లెక్కు పెట్టినవానికి నిచ్చెదనని జనకుఁడు ప్రతిజ్ఞ చేసెను.

సీతాదేవి త్రిలోకైక సుందరి. కావున నామెను వివాహ మాడఁ గోరిన వారై రాజకుమారు లనేకులు వచ్చి విల్లెత్తను లేక సిగ్గుపడి తలలు వంచుకొని వచ్చిన త్రోవఁ బట్టుకొని పోయిరి. రాజకుమారు లన నేల? దేవదానవ యక్ష రాక్షసాధిపతులును బరాభవమంది పోయినవారే.



ఇట్లు కొంతకాల మరగు విశ్వామిత్రుఁడు దశరథరాజ కుమారులైన శ్రీరామలక్ష్మణులను బాలకులను దోడ్కొని మిథిలానగరమునకు వచ్చెను. జనకుఁ డాయన రాకకు సంతోషించి యనేకవిధములఁ బూజించి మునీంద్రా! యెవ్వ రీ రాజకుమారులు? ఏల మీతోఁడ బాదచారులై మనుజులు మిట్టాడని యడవులఁ బడి యరుదెంచిరి? అనిన విశ్వామిత్రు డిఁట్లనియె.

## సీతాదేవి కల్యాణము

వీ రయోధ్యాపురాధీశుఁడైన దశరథుని కుమారులు. ఈయన జ్యేష్ఠుఁడు శ్రీరాముఁడు. ఇతని తమ్ముడు లక్ష్మణుఁ డితఁడు. వీరు నా యజ్ఞమును నిర్విఘ్నముగ సాగించి రాక్షసులఁ ద్రుంచిరి. మఱియుఁ దాటకను వధించిరి. ఈ రాముని దర్శనముచే నహల్య శాపముక్త యయ్యెను. నీ యొద్దనున్న కాలకంఠు కోదండమును జూడ నిచ్చటికి వచ్చిరి అనిన జనకుం డిట్లనియె.



శ్రీరాముఁడు శివుని విల్లు విఱుచుట

మునివరా! యీ చాపము వృత్తాంతము నీ వెఱుఁగనిది కాదు. దీని నెక్కుపెట్టిన వానికి నా కన్య సీతనిచ్చి వివాహ మొనర్తునని ప్రతిన వచించినాఁడను. కావున ఈన నృపనందనులలో నెవఁడైన పినాకధరు ధనుస్సు నెక్కుపెట్టిన నతనికి నా కూతునిచ్చి పెండ్లి యొనర్చెదను. నా సుత వీర్యశుల్కసుమా యనిన మునీంద్రుఁడును ధనువు నిచటికి దెప్పింపుమనెను. వైదేహుండును మంత్రుల కాజ్ఞాపించెను. వారు మున్నూరుగురు వీరపురుషులచే నమ్మందసము లాగించి తెచ్చి కొలువలో నిలిపిరి. అప్పుడు కౌశికుఁడు రామచంద్రా! యా వింటిని జూడమా యనెను. శ్రీరాముఁడును బట్టి యెత్తి చూచి గురువరా! చూచితిని. ముదలయేని వెలికిఁ దీసి యెక్కు పెట్టెద ననిన నా ఋషి పుంగవుఁ డట్లే కానిమ్మనెను. శ్రీరాముఁడును మదపుటేనుఁగు చెఱకు కాఁడను బోలె దానిని దీసి యెక్కిడఁగానే యది ఫెళఫెళమను ధ్వనితో రెండు



శ్రీ సీతా కళ్యాణము



తుంటలయ్యెను. జనక మహారాజు సంతోషించి యానద్వ ృత్తాంతము దశరథునకు దూతలచేఁ జెప్పి పంపి యాయనను రప్పించి శ్రీరామునకు సీతను, లక్ష్మణునకుఁ దన రెండవ కూఁతురైన యూర్మిళను, భరతునకుఁ దన తమ్ముని కూఁతురు మాండవిని, నామె చెల్లెలిని శ్రుతకీర్తిని శత్రుఘ్నునకు నిచ్చి బిడ్డల నత్తవారింటికిఁ బంపెను.

## సీతారాముల యనుకూల దాంపత్యము

వివాహమైన తరువాతఁ బండ్రెండు సంవత్సరములు సీతాదేవి భర్తతోఁ గూడి యయోధ్యయందు సుఖముండెను. ఆ భార్యాభర్తల యనురాగమును నే నేమని వర్ణింతును? సీతాదేవి తనమనస్సంతయు శ్రీరామునందే సర్వదా నిలిపి యాయననే ధ్యానించుచుండెను. శ్రీరాముఁడునుఁ దన మనస్సంతయు సీతయందే నిలిపి యామెయందే బద్ధానురాగుఁడై యుండెను. రూపమునను సద్గుణములను దనకు సరిపోలునది యనియు అంతకంటెను ఎక్కువగ తనతండ్రి కుదిర్చి యిచ్చిన భార్యయనియు సీతను శ్రీరాముఁడు మిక్కిలి కామించెను. ఆ కారణముచే సీత కేమాత్రము మనస్సు నొవ్వ చేసిననుఁ దన తండ్రి నగౌరవించి నట్టని శ్రీరాముఁడు తలచుచు నామె హృదయములోని యభిప్రాయము హృదయములో నుండఁగనే యాకార్యము నెఱవేర్చుచుండెను. తనయందుఁ దనభర్తకు నెంత ప్రేమ యున్నదో యది యాయనకంటెఁ దానెక్కువగ నెఱిగి యంతకు ద్విగుణముగ నాయన విషయమై సీత ప్రవర్తించు చుండెను. వారి మనస్సుల పరస్పరము కలయిక యొకదానిలో నొకటి కరఁగినట్లని చెప్పరాదు. ప్రతి బింబితము లనరాదు. వ్రాసినట్లును గాదు. మలచినట్లును గాదు. వజ్రలేపమున నతికించి నట్లును గాదు. తొలిచి పాఁతినట్లును గాదు. వలపు వేలుపు నా రసమునఁ గ్రుచ్చి యన్యోన్యచింత యను తంతెచే దిట్టముగఁ గుట్టకట్టి బిగించినట్టని చెప్పిన చెప్పవచ్చునేమో! ఈ విధముగ రాజసుతుఁడు రాజితకాముఁ డగు రాముఁ డుత్తమ రాజకన్యయు ననంతకామయు నభిరామయు నగు సీతతో విష్ణువు లక్ష్మీదేవితోఁ గూడి యుండినట్టు రాగమునఁ గలసి యుండెను.

ఇట్లుండ నొకనాఁడు దశరథుఁడు తాను వృద్ధగుట యాలోచించి తన జ్యేష్ఠసుతుడైన శ్రీరామునకు యౌవ రాజ్య పట్టాభిషేకము చేయ నిశ్చయించుకొని యా మఱుదినమందే ముహూర్త మేర్పఱిచి యా రాత్రి తన ప్రియభార్యయగు

కైక యింటికిఁ బోయెను. కైకయును మంథర యను దాసి చెప్పిన దుష్టబుద్ధులచే మతిచెడి కోపగృహమున పరుండియుండ నచటికి దశరథుఁడు పోయి యాపెను. బహువిధముల నూరార్చి ప్రియురాలా! నీ వేమి కోరిన నిచ్చెదను. సుందరీ! ఏల నాపైఁ గోపగించెదవు? అని వేఁడుకొనెను. కైకేయియు దుష్టురాలు గావునఁ దనమగఁడు కామపాశబద్ధుడై తన వలలోఁ దగులుకొని నాఁడని యెఱిగి శ్రీరాముని బదునాలుగు సంవత్సరములు దండకాటవికిఁ బంపవలయును. నా కుమారుఁడగు భరతునకు రాజ్యమీయ వలయునని కోరెను. దశరథుఁడు సత్యము నతిక్రమింపలేక భార్యకుఁ జిక్కువడెను. కైకేయి యుదయముననే శ్రీరాముని బిలిపించి నీ తండ్రి నాకు రెండు వరము లిచ్చి యున్నాడు. అందొకటి నీవు దండకారణ్యములోఁ బదునాలుగేఁడులుజడలు నార చీరలు కృష్ణాజినము ధరించి మునివలె నుండుట. రెండవది నా కొడుకు భరతుఁ డయోధ్యకు రాజగుట. కావున నీ తండ్రి సత్యమును నీవు కాపాడఁ దలఁచెద వేని నీ విప్పుడ యరణ్యమునకుఁ బొమ్మనినఁ బితృవాక్యము పరిపాలింప శ్రీరాముఁ డడవికిఁ బోవ నిశ్చయించు కొని తల్లియింటికిఁ బోయి యామెచే ననుజ్ఞఁగొని సీతాదేవి గృహమునకు వచ్చెను.

## శ్రీరాముఁడు సీతాదేవి యింటికి వచ్చుట

రాజనీతియందు పండితురాలగు సీతాదేవియుఁ బట్టాభిషిక్తుఁడై తన భర్తమందిరమునకు విచ్చేయఁగాఁ జేయవలసిన కృత్యము లన్నియు నెఱిఁగియున్న దగుటచేత వలసిన గంధాది మంగళపదార్థము లన్నియు సిద్ధముగ నుంచుకొని తాను నలంకరించుకొని ప్రాణనాథు శుభంబుఁ గోరి దేవపూజ తాను స్వయముగఁ గావించి యెంతో సంతోషముతో నెదురు చూచుచుండెను. గాని తన భర్త కిట్టి విపరీత దశ వచ్చినవర్తా విన్నది కాదు. ఇట్లు క్షణక్షణము ప్రాణేశ్వరు రాకకై వేచి ద్వారము నొద్దకు వచ్చుచు బోవుచుఁ గిటికీల నుండి చూచుచు మరలుచు నుండు తఱి శ్రీరాముఁడును దనకుఁ గలిగిన కష్టదశకై పరితపించుచు మోము వ్రాల్చి పాదచారియై లక్ష్మణుఁ డొక్కఁ డతోడుగఁ దన సౌధమునకు వచ్చి సిగ్గున సీతను జూచి శోక మాఁపలేక కన్నీరు గాఱ దుఃఖంబు బయలు పఱిచెను. దయితుఁడు రాఁగనే సీతయు దిగ్గన లేచి వెలవెలఁ బాఱుమోమును చెమ్మటలు గాఱు మేనును దుఃఖముచే వ్రాల్చిన శిరమును గల నాథునిఁ జూచి మనము వెరవెరఁ బోవఁ బెనిమిటిని సమీపించి యిట్లనియె.



ప్రాణేశ్వరా! యిట్టి శుభసమయముననెంతో సంతోషముతో నుండుట మాని శోకముచేఁ గుంది యుండనేల? గురువు దేవతగాఁ గలిగి శుభాకరమైన పుష్యము నేఁడ యని బ్రాహ్మణులు చెప్పిరి. పట్టాభిషేక మహోత్సవ సమయముతోఁ గూడియు దుఃఖింపనేల? విశాలమును మనోహరమును శత శలాకమును జలఫేనతుల్యము నగు శ్వేతచ్ఛత్రము నీడ నీవు రామికి నేమి కారణము? నీ ముంగల నీల మేఘాద్రి నిభంబైన గంధేభంబు నడువ దేల?

**సీ. చంద్రహంస ప్రకాశంబులౌ చామరల్**
**విసర రేల ముఖారవిందమునను?**
**వాగ్మలు వందులు పరమసమ్మదమునఁ**
**బొగడ నేటికి రారు పుణ్యశీల?**
**సూతమాగధు లేల శుభమంగళంబుల**
**నీ వెంట రారైరి నీరజాక్ష?**
**వేదపారగులైన విప్రులు నభిషిక్త**
**శిరమున నుంచరేపెరుఁగుఁ దేనె?**
**తే. మంత్రు లేటికి నీ తోడ మలయ? రేల**
**పౌరజానపదుల్ వెంటరా? రదేల**
**స్వర్ణభూషిత నిస్తుల జవనహయ చ**
**తుష్కయుత పుష్యరథము ముందుగను బోదు?**

భద్రపీఠ మేలమున్నుగా రాదు? నీ ముఖారవింద మానందముఁ బాసియున్నది. అభిషేకవేళ సమీపించియు నీ విట్టులుండ నేల? వల్లభా! నేను విననగునేని యిట్టి నీ దీనదశకుఁ గారణం బెఱిఁగింపుము అని సకరుణంబుగ విలపించిన సతిని గని రఘుపతి యిట్లనియె.

## శ్రీరాముఁడు తా నరణ్యమునకుఁ బోవు వార్త సీతతోఁ జెప్పుట

ప్రాణేశ్వరీ! నీకుఁ జెప్పరాని దేమున్నది? నా తండ్రిగారు నన్నరణ్యము నకుఁ బొమ్మని యానతిచ్చిరి. ఇప్పటి నా స్థితి కదియే కారణము. నీవు గొప్పవంశమునఁ బుట్టినదానవు. ధర్మపద్ధతులన్నియు నెఱుఁగుదువు? ధర్మమార్గ మెప్పుడును దప్పవు. కావున నేను పలికెడి పలుకులు నిబ్బరమున వినుము.

నాకుఁ దండ్రియు సత్యవాదియు భూభర్తయు నగు దశరథుఁడు పూర్వకు కైకకు రెండు వరము లిచ్చెను. ఆమెయు నా రెండువరములు మనసున నుంచుకొని యిప్పుడు వానిని కోరెను. అందొక వరముచే నేను జటాజినధారినై మహారణ్యములఁ బదునాలుగు సంవత్సరము లుండఁ బోవలయును. రెండవ వరముచే నా తమ్ముఁడు భరతుఁడు రాజ్యభారము వహింప వలయును. కావున వనములంకుం బోవుచు నిన్నుఁ జూచుటకై వచ్చితిని.

జటాజినధారినై యరణ్యమునకుఁ బోయెద ననుమాటలు వినులఁ బడినంతనే తన యొక్కొక్క భూషణమే యొలుచుచున్న సీతం జూచి యామె యభిప్రాయము గ్రహించి రాముఁడు మఱియు నిట్లనియె.

దేవీ! తండ్రి వాక్యమును సత్యము చేయ నే నరణ్యమునకుఁ బోవుచున్నాఁడను. నీవు ధైర్యము పాయక స్థైర్యము వదలక యింట నిందే యుండి మరల నేను వచ్చువఱకు వ్రతోపవాసములఁ జరించుచు బ్రతిదిన ముదయమున లేచి యిలవేల్పులకు నమస్కరించి పూజాదు లొనర్చి యవల నా తండ్రికి నమస్కరింపుము. వృద్ధయు దుఃఖపీడితయు నగు నా జనని యొద్ద నుండి యామెకు బరిచర్య సేయుచుండుము. నాకుఁ దల్లు లందఱు సమానులు. వారందఱు నీకు వంద్యలు. నీవు భరత శత్రుఘ్నులను దోడఁబుట్టిన వారివలెఁ గన్న కొడుకుల వలె సదా చూచుచుండుము. వారు నాకుఁ బ్రాణములు సుమా. మన వంశమునకు దేశమునకుఁ భరతుడే రాజు. అతఁడు నీకుఁ బ్రొద్దున నమస్కరింప వచ్చినపు డెపుడైన నతని మ్రోల నన్ను నా గుణములను స్తుతింపకుము. వృద్ధి యుక్తు లౌవారు పరపురుషుల పొగడ్త విన నొల్లరు. నీవు పదుగురిలోఁ బదునొక్కొతవుగా నుండు మంతియగాని యెక్కువ పటాటోపములు గాని పెత్తనముగాని వహింపకుము. ఏమియుఎ నెఱుఁగని దానివలె నేదియు నక్కఱపట్టని దానివలెఁ గాలము ద్రోయుచుండును. అటులని భరతుని నిర్లక్ష్యభావమునఁ జూడవలదు. అతఁడు భూపతి యగుచున్నాఁడు. గావున నీకు సమ్మానార్హుఁడు. ఏ కారణముచేతనైనను గైకపుత్రునకు సప్రియములు వచింపకుము. రాజు లగువారు తమ్మారాధించువారికి సకల సంపదలు గూర్తురు. తమ కప్రియకార్యము లొనర్చువారిని గోపించి దండింతురు. రాజు లైశ్వర్యగర్వమునఁ దల్లిదండ్రుల నైనను గన్నబిడ్డలనైనను దమ కహితము సేయువారిని దూరమున విడుతురు. హితులగువారి నన్యుల నైనను గడింతురు. కావున నీ విందేయుండి రాజమతానుకూలవై చరించుచు



స్వధర్మచరితమును సత్యసంధతయుఁ దప్పక యెట్టివారి మనస్సు నొవ్వఁ జేయక యుండుము. నా పలుకు గౌరవింపుము. ఇఁక నరణ్యమున కేగ నా కనుజ్ఞ నిమ్ము.

## సీత రామునితోఁ దా నరణ్యమునకు వచ్చెదనని చెప్పుట

సద్గుణవతియుఁ బ్రియవాదినియుఁ బ్రియవాక్యములు విన నర్హయు నగు జానకి తన్నుఁ బ్రియుడు పల్కిన యప్రియభాషణములు విని ప్రణయకోపమున నిట్లనియె. రామా! యేమిది నీవిటు లేవేవోవో పలుకుచున్నావు? రాజకుమారుఁడుగఁ బుట్టిన నీవు నాలుక తుదకుఁ దెచ్చిన పేదపలుకులు వినఁగా ముగ్ధయు బాలికయునగు నా యట్టిదానికిని నవ్వు వచ్చుచున్నదే. నిన్ను నేనేమందును? నీ యట్టివాఁడు పలుకవలసిన పలుకులా యివి? నీ నీతి పాండిత్యము శౌర్యము నీ యైశ్వర్యముతోడనే పోయెనా యేమి. అట్లైనఁ జెప్పెద వినుము. తల్లి, తండ్రి, తోడఁబుట్టువు, కొఁడుకు, కోడలు, తాను, దాను జేసిన పుణ్యపాపఫలము తాను దాను మాత్రమే పొందును. వీ రందఱు దమకు శుభకరము లగు కార్యము లొనర్చి తత్ఫలములను దామే పొందుచుందురు. ఒక పురుషుని యాపద గాని సంపద గాని సమానముగఁ బంచుకొని యనుభవించునది యతని భార్య యొక్కతయే. అతని మేలునే కోరి వ్రతాదు లొనర్చునదియు నతని భార్యయే. అతని వంశాభివృద్ధియుఁ గీర్తియుఁ గోరునది భార్యయే. తక్కినవారు సంపదలను బంచుకొందురు గాని యాపదలను బంచుకొనరు. కావున నిన్ను మీ తండ్రి యడవికిఁ బొమ్మన్నప్పుడు నన్నును బొమ్మన్నట్లే యగుఁ గాని యన్యథా కాదు. సతికి గతి తండ్రియు గాఁడు. తల్లియుఁ గాదు. అన్నదమ్ములు గారు. కన్న కొడుకులును గారు. పతి యొక్కఁడే సతికి గతి. కావున నిన్ను విడిచి నేనుండఁ జాలను. నీ వడవికిఁ బోయెద వేని పొమ్ము. నేను వలదనను గాని నీకు ముందుగఁ బోవుచు ముండ్లు ఱాలు దర్భలు తొలగించి మార్గము నీ పదములను మృదువుగ నుండు నట్లొనర్ప జేయు నా కోరికను వ్యర్థపఱుపకుము. పరులు ద్రావఁగ మిగిలిన నీరమును బరిహరించినట్టు నా మీది కోపమును వదలిపెట్టుము. మానధనా! ఒంటిదానిని బాలికను, నేనెట్లు కానకు దోడ్కొని పోవచ్చునను సందేహము దవ్వుగ నెట్టుము. నీవు ప్రాపై యుండ నా కేమి భయము? నిన్నుఁ బాసి యొంటిగఁ బ్రాణముతో నుండు నంత పాపము నేనేమి చేయలేదు కదా? కావున నీవు నన్ను తప్పక పిలుచుకొని పోవలయును. అడవులందు



సీత తా నడవికి వచ్చెదనని రాముని వేడుకొనుట

నాకు సౌఖ్యము లమరవని తలంచెదవేమో. సౌఖ్య మననేమి? మనస్సునకు బ్రియమైనదే. మగని విడిచి సౌధవీధులందుఁ బచారము చేయుటకంటెను, దేవతా విమానముల విహార మొనర్చుట కంటెను, ఉద్యానములందు సంచారము చేయుటకంటెను, ఎన్ని దేహ కష్టములైనఁ బడుచుఁ బతిపాద సేవ యొనర్చుటే సతికి శ్రేయస్కరము. భర్తకుఁ బరిచర్య చేయవలసిన నానావిధము లన్నియు నా తలిదండ్రులు నాకు నేర్పియే యున్నారు. సాధ్వీకృతములు నేను గ్రొత్తగ నేర్చుకొన వలసిన వేవియు లేవు. నట్టడవియే పుట్టినయిల్లని తలంచెదను. గాలికిరేఁగు ధూళియే గంధవొడిగా నెంచెదను. నీ తోడ నేనుండు వఱకునేలోక మెట్టులు పోయినను నాకు విచారము లేదు. నా మనస్థైర్యము గుఱించి నీవు సందేహింపఁ బని లేదు. కమ్మఁ దేనియల వాసనలు ఘుమ్మని క్రమ్ము నరణ్యమ్ములం దేభయము చింత లేక బ్రహ్మచర్య వ్రతము ధరించి మీ పాదసేవ చేయుచు హాయిగ సుఖింతును. సందేహింపకుము. తప్పక నీ వెంట వచ్చెదను. నా మనస్సును నీవు మరలింప లేవు. ఆహారమునందుఁ గాని సంచారమందుగాని నీకెట్టి కష్టమీయను. పండో కాయో నీవై చేత నిడి తినుమనిన దిందునుఁగాని నేనై యడుగను. నేను నడవఁ జాలనని చెప్పను. అడవి మృగములఁ జూచి భయపడను. ఎట్టివారినైన నీ వెట్టి సంకటములందును రక్షింపగలవని నే నెఱుఁగుదును. ఇఁక నన్ను రక్షింపఁగలమాట చెప్పవలయునా? నీతోడ నదీ కాసారములందు జలక్రీడ దేలుచు జల్లులాడఁ గోరు నాయాస వ్యర్థ పఱుప నేల? నూఱుసంవత్సరములుగాని పదివేల సంవత్సరములు గాని నిన్నుఁ గూడి యే యలజడి లేక యడవుల నడయాడుచుందును. నాకు సంతోషము గలిగింప నీ కేల మనస్సురాదు? నీకుఁ బరిచర్య చేయుచుందునే. అనన్యచిత్తను, దృఢానురక్తను. నన్ను విడిచి పోయితివా యొక నిముసమైన జీవింపను సుమా. నీ యంతటివానికీ యల్పకార్య మొకభారమా? రమ్మని యకమాట చెప్పుటకును నాయందు నీకుఁ బ్రీతి రాదా? నాపై దయ లేదా? అని యతి దీనతతో వేఁడుచున్నప్రియురాలిం గని యామెను బిలిచికొని పోవ సమ్మతింపక శ్రీరాముఁ డిట్లనియె.

## శ్రీరాముఁడు సీత కరణ్యములందలి కష్టములఁ జెప్పుట

దేవీ! నీవు నా యందలి ప్రీతిచే నా వెంటఁ గాంతారములకు రాఁగోరు చున్న దానవుగాని యందలి కష్టము లెఱింగి వచించెడి దానవు గావు. నీవు గొప్పవంశమునఁ బుట్టినదానవు. ధర్మమార్గము తప్పనిదానవు. నా మాట నిదివఱకు మీఱినదానవు గావు. నేను నీ మేలు కోరువాఁడననియు నీ వెఱుగుదువు. కావున నేను జెప్పినట్టు విని యింట నుండుము. మనస్సునకుఁ దోఁచినట్లెల్ల బోవఁ దలంపకుము. నావెంట నీవు రావలదని కారణము లేక చెప్పినవాఁడను గాను. వనములందలి కష్టము లెఱిఁగిన వాఁడ నగుట నీపైఁ బ్రేమచేతనే చెప్పుచున్నాను. నీ కోరిక వదలుము. సహింపరాని దుఃఖములకు సదనము గావుననే యడవిని వనమందురు. అందు సౌఖ్య మావంతయుఁ గలుగదు. సింహవ్యాఘ్రాది ఘోరమృగములు గుహలలో నుండి పెట్టు బొబ్బలును, ఱాలుదొరలించిన గతి దుముకు కొండవంకల ధ్వనులును, గర్ణకఠోరములై చెవుడు గలిగించు చుండును. మనుష్యులు మిట్టాడని ప్రదేశముల నిర్భయముగఁ గ్రుమ్మరుచుండు మృగము లెన్నఁడుఁ జూడని మనలఁ జూచి

నంతనే యొక్క పరుగునఁ బైపడఁ బఱతెంచును. అది యెంత భయంకరముగ నుండునో యెఱుఁగుదువా? ఇఁక నేఱు లందమా లోఁతు తెలియరాని బురదచేతను, అతి దీర్ఘములయి గుండె లగలించు మొసళ్లచేతను, నీరు త్రావవచ్చునట్టియుఁ దీరముల సంచారముఁ జేయునట్టియు మదపుటేనుఁగుల చేతను జేర రాకుండును. ఇఁక మెట్టస్థలము లనిన నీరా దొరకదు. మార్గములా యుండవు. అట్టులే పోదమనిన ముండ్లకంప లబ్బిన శిఖ యబ్బకుండినఁ గాళ్లు పట్టుకొనుచుండును. అందలి కూళ్లకూఁతలు మిగుల పరుషములు. తినుటకా మనయాహారము దుర్లభము. చెట్ల నుండి తమంత రాలిన ఫలములను నేఱియుంచుకొని పగళ్లయందును, రాత్రులందును దినుచు సంతుష్టి గొనవలయును. హాయిగఁ బరుండుటకు మెత్తని పానుపులు దొరకవు. పగలంతయు నడచినడచి నొచ్చిన దేహమును జెట్లనుండి తాముగ రాలిన యాకులపైఁ బడవైవవలయును. కట్టుకొనుటకు దుకూలములు లేవు. నారచీరలు కట్టుకొనవలయును. జడలు ధరింపవలయును. పలుమాఱు వస్తులండవలయును. అహరహము వచ్చు నతిథి జనంబుల నుపచరింపవలయును. దేవతాపూజలు తప్పక చేయవలయును. దినమునకు మూఁడు మారులు స్నాన మొనర్పవలయును. నియమము మానరాదు. బలికి నర్చనలకుఁ బూవులను దానేకోసి తేవలయును. ఒక్కొక్కనాఁ డుదరమునిండ ఫలములు దొరకనిచో నఱకడుపుతోనే తృప్తి పడవలయును. ఒకనాఁటనైన నాఁకలి మాన్పు పూర్ణాహారము దొరకదు. విడువని యాఁకలియు, హోరని విసరు గాలియుఁ జీకటులును, భయమును, సదా బాధించుచుండును. నానారూపములు గల నానాగిరి ఫణులు పూత్కారముల నించుచు నడవుల విచ్చలవిడి తిరుగుచుండును. ఏ ప్రక్క పోవుదమనిన నదులు వంకలు నడ్డముగ వచ్చుచుండును. ఈఁగలు, దోమలు, తేళ్లు, పురువులు వీని వలన బాధ నే నేమని చెప్పుదును. నడచునపుడు ముండ్లకంపలు దర్భల కొనలు తగిలి దేహమున గాయము లగుచుండును. అరణ్యవాసులకుఁ గ్రోధము లోభము కారాదు. తపము సలుపుచుండుటే తగును. కావున కాంతారవాసుల దేహకష్టములు మనోవ్యధలు ననంతములు. నీవా రాజకుమారివి, సుకుమారివి. కుమారివి. ఎట్లు నీ వీ కష్టముల సహింపఁగలవు ? నా మాట విని జానకీ! నీవు గృహమున నుండుము. పదునాలుగు సంవత్సరములు మాత్రమే సహింపుము. నేను మరలి వచ్చెదను. అనినఁ దన భర్త తన్ను నరణ్యమునకుఁ



గొనిపోవ సమ్మతింపమిని గన్నుల నీరు గాఱఁ బైఁట కొంగున నొయ్యనఁ దుడుచుకొనుచు నిట్లనియె.

### శ్రీరామునితో సీత తానరణ్యమునకు వచ్చుటకుఁ గారణములఁ జెప్పుట

ప్రాణేశ్వరా! నీవుకానలయందలి దుర్గుణము లని చెప్పినవన్నియు నాకు సుగుణములుగాఁ దోఁచుచున్నవి. ఒక పదార్థము నందలి గుణముల నెన్నక దుర్గుణములను మాత్ర మెన్నుట ధర్మబుద్ధులకుఁ దగదు. శరభసింహవారణాది మృగంబులు భయంకరంబులై మనమీఁదికి వచ్చునంటివి. ఇది యేటిమాట? క్రొత్తవానిని జూచినపుడు మృగములకు భయము నైజము. వానిని మనముచెనకినగాని యవి మనల హింసింప రావు. కోదండదండధరుండ వైన నిన్నుఁ జూచి వేదండంబు లైనను గుండె లదరఁ బరువెత్తి దూరమునఁ బోవుఁగాని మన మీది కెట్లు రాగలవు? మార్గములు కుశకంటకాదులచే దుర్గమము లంటివి. రాజకుమారుఁడు సుకుమారుడునైన నీవు మాత్ర మెట్లు వానిపై నడవఁగలవు? నేను నీతోఁడ వచ్చితినా నీకు ముందుగఁ బోవుచు త్రోవలు చక్కజేసెదను. నదు లపాయకరములంటివి. సదుపాయములచే వానిని దరింపవచ్చును. తామరలు కలువలు లోనగు నీటిపువ్వు లా నదులం దెంత రమణీయము లైయుండును. నీరము లెంత నిర్మలములై యుండును. వానినిజూచి యానందించు భాగ్యము నాకు మాత్రము వలదా! తమ్మి పుప్పొడులచే కమ్మవాసనల నీను జలమ్ముల నేను మాత్రము స్నాన మాడరాదా? పట్టనములందువలె గాక యడవులందు మారుతము నిర్మలమై శుద్ధయై నానావిధ పుష్పముల సౌరభములతో గూడి మనోహరమై వీచుచుండును. ఈ సౌఖ్యములు నీతోడ వచ్చి నాకు గలుగగలదు? ఏ సుఖమైనను నన్ను విడిచి నీ విదివఱ కనుభవించినవాడవు గావే? ఇప్పుడు మాత్రము నన్ను విడిచి వనవిహార మేకాంతముగ జేయఁ దలచెదవేల? తానుగ రాలిన ఫలములచే నుదర పోషణము చేయవలయునంటివి. సహజ పక్వములైన ఫలముల రుచి కుండల మ్రాఁగినవాని కుండదని నే నెఱుగనా? కృత్రిమ వనంబులందలి ఫలములు నిస్సారములు. వన్యఫలములు సహజసారములు. వానివలె నివి పుష్టియు దుష్టియు నొసగవు. కావున నిట్టు లాలోచించిననీవు వచించిన కష్టములు కష్టములే కావు. కష్టములు గానిమ్ము. కాకపోనిమ్ము. నేను వచ్చుటకు గారణములు చెప్పెద. దయయుంచి వినుము. నీయొద్ద నేనుండగ న

న్నాయింద్రుడైన జెనకు నను భయము లేదు. నను ధర్మశీల నంటివి. ఉత్తమస్త్రీకిఁ బ్రథమధర్మ మెయ్యది? భర్తను విడిచి యుండుటా? కూడియుండుటా? పతివ్రత పతిని బాసి యొక క్షణమైన బ్రదుకదని నీవు నాతో మున్ను చెప్పవా? నేను నినుఁ బాసి యెట్లు జీవింతునని తలంచితివి? నేను నా తండ్రి యింట నుండిన వేళ విశేషజ్ఞులైన దైవజ్ఞులు నా లక్షణములు బరికించి నాకు వనవాసము గలుగునని వచించిరి. అంతటి మహాత్ము లాడు వాక్యము లసత్యము లగునా? సాముద్రిక శాస్త్రవేత్తలు నా పతితో నేను గాంతారముల నివసింతునని చెప్పునప్పు డెన్నడౌకోయట్టులగునని యెంతో యువ్విళులూరుచుండుదు. నేను చిన్నదాననుగా నుండు సమయంబున నొక సంయమినీమణి నన్నుఁ జూచి యీమె యరణ్యావాసముఁ జేయ భర్తను గోరును. ఆయనయుఁ దన వెంట నీమెను దోడుకొని పోవును అని చెప్పెను. వీరల వాక్యముల కన్యధాత్వము కలుగఁగలదా? వారు చెప్పినట్టు సమయము లభించెను. వారి యాజ్ఞ ప్రకారము నేను వర్తించరుట విధియకదా. బ్రాహ్మణ్యులు సత్యవాదులగుదురుగాక. వనవాసము భీరవులకు దుష్కరము గాని మనకును దుష్కరమా? నీవు నిజ మాలోచించినచో నతి సుకరమని యెఱుంగగలవు. వల్లభా! ఇంతకుము నెన్నిన్నిమాఱులో నన్ను విపినములకుఁ దోడ్కొని పొండని మిమ్ము వేడుకొనలేదా? నా కోరిక యింతమాత్రము చెల్లింపరాదా? నేను మీవెంట వచ్చుటకు నింతకుమించిన ముఖ్యకారణము చెప్పెద వినుము. భార్యకు భర్త సేవకంటె దక్కినదేదియు శ్రేష్ఠముగాదు. కావున నీతోడ వచ్చి నీ పాదసేవ సేయుచుఁ గృతార్థురాల నయ్యెదను.

**కం.** ఓడక యడవులకును నీ । తోడన చనుదెంచి శౌర్యధుర్యా! నీకున్<br>వీడక సేవలుసేయఁగ ! వేడుక పడియెడి మనంబు వినవే మనవిన్.

**కం.** శుద్ధచరిత్రా! కరుణా। బద్ధుని నిను భర్తఁ గొలిచి పావని నగుదున్<br>సిద్ధము వేయేటికి నా। బుద్ధిని దైవంబు నాదుపురుఁషుడె చుమ్మీ.

**కం.** ఈ లోకము మా టేటికి? । నాలోకమునందునైన ననఘాత్మక! నీ<br>తో లీలాగతి నుండుట। యే లాభము నెల్లశుభ మిఁకేలా మాటల్.

**కం.** సతి జనకునిచే ధారా। యుతముగ నెవ్వనికి దత్తయోగ్య చరిత యా<br>సతి కాపతి పరమున నగు। శ్రుతులిట్లని మొఱలు వెట్టుసుమతీ వినవే.

**శా.** ఈ లాగుండఁ బ్రమాణపద్ధతులు నీ యిల్లాలి, సద్వృత్త స<br>చ్ఛీలాత్మన్, బతిదేవతన్, వినయసుశ్రీయుక్త, నీభక్తఁ జిం<br>తాలోలన్ పరసౌఖ్యదుఃఖములఁ దుల్యన్, నాదు ప్రాణేశ! నీ<br>వేలా తోడ్కొని పోవనొల్లవు? హితంబే యిద్ది నీబోఁటికిన్.



జీవితేశ్వరా! యింత యేల? నన్ను విడిచ నీవు పోయితివా. నేనుదుఃఖసముద్రమున మునిఁగి నీళ్లనైనను, విషముచేనైనను, వహ్నియందైనను బ్రాణములు విడుతునని నమ్ముము అని యెంత చెప్పినను సీతను బిలుచుకొనపోవ శ్రీరాముఁ డంగీకరింపలేదు.

ఇట్లెంత చెప్పినను దన్నుఁ బిలుచుకొని పోవుటకు సమ్మతింపక తనకేవోవా యూఱటమాటలు చెప్పుచుండిన భర్తను జూచి దృఢసంకప్ప యగు సీతాదేవి భయముచే గుండెలు కొట్టుకొన మేను వణఁక నేవల ప్రణయకోపముతో శ్రీరాముని ముఖమట్టె చూచుచు నిట్లనియె.

హృదయేశ్వరా! నీకు యశస్కరము శ్రేయస్కరమునగు కార్య మొనర్చెదనని పూనిన నన్ను నిరాకరించుచున్నాఁడవు. కట్టుకొన్న భార్యను భరింపలేని భీరువును నిన్నుఁ జూచి మిథిలాదేశ ప్రజలనెల్ల భరించు వైదేహుఁడగు నా జనకుఁ డేమి తలఁచును? పురుష విగ్రహము ధరించిన స్త్రీ నా కల్లుఁడుగ దాపరించెనని తలఁపడా? ఇస్సీ! సరివారితో నవమానము నీవెట్లు సహింపఁగలవు? నీవు పిఱికివై సహించిన సహింతువుగాక. నేనెట్లు సహింపగలను? ఇంతవఱకు తీక్ష్ణరశ్మియగు సూర్యునందు వలెఁ బరమతేజము శ్రీరామునందుఁగల దని లోకులాడుచుండ విని యుప్పొంగుదానను. ఇఁక నట్టిమాటలు విని వీరెంత మూఢులని తలచుఁచు సిగ్గుచే శిరము వంచుకొనవలసి యున్నది. కట్టా! నా కెట్టిగతి పట్టెను? నన్నడవికిఁ బిలుచుకొని పోవలయుననిన నీకింత విషాదమేల? ఏల నీవు భయపడదెవు? నన్నొకతెను గాపాడు పౌరుషము నీయందు లేదా? అంతటి దుర్బలుఁడవా? నిన్నుఁదప్ప మఱియెవ్వని నేఇన కలయందైనఁ దలంపని నన్ననన్యపరాయణను సతిని నేల వదలిపెట్టి పోవఁ జూచెదవు? నన్ను నీవేమిగఁ దలచితివో కాని సత్యవంతునకు సావిత్రివలె నీకు నేనని నమ్ముము. నీ యిల్లాలను, ఎలప్రాయపు సుందరిని, పతివ్రతను, పాణి గృహీతను. ఇట్టి నన్ను భార్యలను దామై వెలకిచ్చి జీవించువారివలెఁ బరుల పాలు చేసి పోఁజూచెదవు. అంతటి మానహీనుఁడవా? ఎవరి హితముఁగోరి నన్ను వారించెదవో యట్టివారికి నీవే దాసుఁడవై చరింపుము. నేను నీకు మాత్రమే దాసురాలను. నిన్ను విడిచి యుండఁజాలను.

**మ. నను వెంటం గొనిపోక పోఁదగదు కాంతారాళికిన్ నీవు కా**
**ననమైనం దపమైన స్వర్గమయినన్ నాకెప్డు నీతోడిదే**
**యనఘా! లోకము, బాటనే నలయఁ జుమ్మా నిన్ను వెన్నంటి వ**
**త్తును, నుద్యానవిహారమందువలెఁ గూర్తుం బ్రీతి నత్యంతమున్**

నేను నడువలేనిదాన ననుకొనకుము. నీకుఁ గష్టమిచ్చెదనని దిగులుపడకుము. నీతోపాటు నడచునపుడు ముండ్లు గడుసుఱాలు నాపాలికి దూదియేకు లనుకొనుము. అవి నాకొక లక్ష్యమా? సుడిగాలికి రేఁగుధూళి నా పలికి గంధపొడి సుమా. లేఁత పచ్చికపై నీతోడఁ బరుండునపుడు వెలగల యీ కంబళముల నెవతె తలఁచును? అంతకంటె నివి సుకరములా?

**కం. ఆకులొ యలములొ పండులొ**
**నాకుం గొంచెంబొ గొప్పొ నయముగ నీవే**
**చేకూర్చి చేతులారఁగఁ**
**బ్రాకటముగ నిడిని నమృతపానము సమమౌ.**

**చం. తలఁపను దల్లినిం, దలఁపఁ దండ్రిన, స్మరింపను దోడఁబుట్టులన్**
**దలఁపను నిల్లువాకిలి, యథామతి నీపయి నాదుచేతిలో**
**పలఁ దమినించు కాయలనొ పండ్లనొ మెక్కెద; నొక్క కష్టమేన్**
**గలుగఁగ నీను; నీకు నొక కాఱియ గల్గద నమ్ము రాఘవా!**

**కం. నీ తోడ నున్న స్వర్గము**
**నీతోడు రహింపకున్న నిరయం బది యే;**
**నాతలఁపిది మది నెఱుఁగుమ**
**యేతెంచెదమాన్పకుండుమీ ప్రాణేశా!**

పదునాలుగు సంవత్సరములు ముగియఁగానే వచ్చెదనంటివి. పదియేండ్లు మూఁడేండ్లు నేఁడాది. ఓ తల్లీ! యిన్నియేండ్లు నేను నిన్నుఁ బాసి యుండఁగలనా? ఒక ముహూర్తము నీవు కనఁబడ కుండిన మనస్సు వెరవెరఁ బోవుచుండునే.

**ఉ. ఒంటిమి నన్ను వీడి ఛన నోర్చెద వేని వియోగ బాధ నీ**
**వెంటనే వచ్చుఁ బ్రాణములు విన్ము పరోక్షపుఁ జావుకంటె నీ**
**కంటికి ముంద నీ చరణకంజములం బడి చచ్చు టుత్తమం;**
**బొంటరమింటరంబులను నొవ్వనివారలఁ గొల్చుచుందునే.**



అని రామునిఁ గౌఁగిలించికొని హెూయని యేడ్చుచుఁ గొఱవి మిణుఁగురులను విడుచునట్లు కన్నులనుండి వేఁడినీటి బిందువులను శ్రీరాముని వక్షముపైఁ గార్చెను. ఆ నీటివఱదకు గన్నుల కాటుకయుఁ గరఁగిపోయి బాష్పములు స్ఫటికముల కాంతిని రాలఁ జొచ్చెను. వేఁడినీళ్ళలోఁ బడిన కమలమువలె ముఖపంకజ మెంతయు వాడుపాఱెను. పరవశయైనట్లు సీతాదేవి యేమియు మాటాడ నేరక భర్తవక్షముపై శిరముంచి హస్తముల మెడఁగ్రుచ్చి కౌఁగిలించి వెక్కివెక్కి యేడ్చు చుండెను.

## శ్రీరాముఁడు సీత వనంబునకు వచ్చుట కంగీకరించుట

శోకాతిశయముచేఁ బరవశ యయినట్లు తన్నుఁ గట్టుకొని యేడ్చుచున్న ప్రియురాలిం గౌఁగిలించి కన్నీరుదుడిచి ఓదార్చి నమ్మికపుట్ట శ్రీరాముఁ డిట్లనియె. పిఱికీ! నీ విట్లేల తపించెదవు? నిన్ను విడిచిన స్వర్గమైనను నాకుసమ్మద మొసఁగనేరదు. భూషణములుచీరలు భోగము లనిన నేను ముందు నేను ముందని వచ్చుటయుఁ గష్టములకు మార్మొగ మిడుటయు లోకమున స్త్రీలకు స్వభావము. కావున నీ మనస్సును బరీక్షింప నింత దూరమడ్డములు చెప్పితిని. క్షమింపుము. నాతో నరణ్యమునకు దప్పక వచ్చెదనని చెప్పితివి. ఇది నీ కులమునకు గుణమునకు నీ జనక వంశమునకు యోగ్యమైన వాక్యమే గాని యితరము గాదు. నీవు ధర్మయుక్తమై కులశీల సమనిత్వమైన సూక్తి చెప్పినపుడు నిరాకరింపనే నంతటి మూర్ఖుఁడునా? నిన్ను గహనమునకుఁ దోడ్కొని పోనొల్లనని చెప్పు టకు నిన్ను రక్షింప లేనను భయము కారణము గాదు. నారాయణునకు బోలె నాకెందును భయము లేదు. నిన్ను వనుల రక్షింపు శక్తి గలిగియు నీ మనస్సు పరీక్షింప నట్లు చెప్పితిని. నిన్ను నేను గాననములకుఁ దోడ్కొనిపోవుట పూర్వాచార విరుద్ధము గాదు. పూర్వము మహాత్ము లనేకు లిట్లు చేసియున్నారు. కావున సూర్యుని వెనుకొను సువర్చలవలె నా వెంట నీవు రమ్ము. నే నరణ్యమునకుఁ బోయెదనని చెప్పిన వెంటనే నీవును నా వెంట వచ్చుటకు సిద్ధపడితివి గాని, యేల పోయెదవు? పోకున్న నేమి? మీరు రాజునకు బెద్దకుమారులు గారా? రాజ్యము మీదే కదా? నేను పోననిన రాజు మిమ్మేమి చేయఁగలఁడు? అని యైశ్వర్యకాంక్షచే నడ్డమాటలు చెప్పవైతివి. దీని వలననే నీ గుణము మనోనిశ్చయము గ్రహించితిని.

## శ్రీరాముఁడు సీతతో నరునకుఁ బితృపూజ యవశ్య కర్తవ్యమని చెప్పుట

ఉ. పో నవరాదు నాకుఁ బువుఁబోణి! వనాంతరసీమ కిప్పు, డా
మానిని కార్యుచేసిన ప్రమాణము లీడ్చెడి నన్నుఁ గానకున్
జానకి! తల్లిదండ్రుల వచఃస్థితి నిల్చి చరించు టెంతయున్
మానఁగరాని ధర్మ; మది మానిమనంగ సహింతు నే గతిన్

కం. స్వాధీనదేవతల బిం । బాధర! తన తల్లిఁదండ్రి నాచార్యవరున్
దా ధిక్కరించి నరుఁడు। స్వాధీనపు దైవమెట్లు చనుఁ బూజింపన్?

కం. ఆ మువ్వురఁ గొలిచిన నరుఁ। డా మూఁడు జగంబులైన నగు సాధింపన్
వామాక్షి! తత్సమానం । బౌ మహిత పవిత్రమొండు నలవడ దవనిన్

కం. దానము సత్య మ। నూన సుదక్షిణము జన్న మో జానకి! యే
మానవునకైనఁ బితృసే । వాని యతిఫలం బొసంగ వశమె పరమునన్

కం. సురలోకమొ ధాన్యమొ ని।ర్భర సుఖమో ధనమొ సుతులొ
భాగ్యమొ చదువో
గురుశుశ్రూషా బలమునఁ। దరుణీ! దుస్సాధమగు పదార్థము గలదే.

కం. మాతా పితృ సుపరాయణు। లై తనరు మహానుభావు లశ్రమమున గో
పైతామహ సురగంధ। ర్వాతతలోకములు గన సమర్థులు చెలువా!

కావున సత్యధర్మోపేత చిత్తుఁడైన నా తండ్రిని నేను నా సుఖమాశించి కష్టములకు భయపడి యసత్యవాదిని జేయ మనస్సొప్పదు. ఇది నా నిశ్చయము. నాతో వనవాసము చేయుటకై నీవు పుట్టినదానవు. ఇట్టి నిన్ను విడిచి నే నెట్లు కానలకు పోఁగలను? ఇక నీ విషాదము మానుము. లే లెమ్ము. నా వెంట రమ్ము. అర్థకార్యములఁ దీర్పఁ బొమ్ము. నీ సమస్తపదార్థములు భిక్షులకు బ్రాహ్మణులకు సేవకులకు నిమ్ము. నా పదార్థములు మంచములు దిండ్లు వస్త్రములు వాహనములు బంగారు బొమ్మలు పాత్రములు లోనైనవన్నియు నీవే తగువారికి దానమిమ్ము. జాగు సేయకు మనిన సీతాదేవి పొంగి మబ్బుపాసిన చంద్రబింబమువలె ముఖము ప్రకాశింప ధనవర్గము దానమిచ్చి కట్టువస్త్రముతో భర్తవెంటఁ బోవ సిద్ధపడి నిలిచెను.

రుక్మిణి : అప్పా! బ్రహ్మచర్య మవలంబించి నీ వెంట వచ్చెదనని సీతాదేవి చెప్పె నే అట్లు చెప్పనేల?



తండ్రి : లోకమున సకారణప్రీతి యని నిష్కారణ ప్రీతి యని ప్రీతి రెండు విధములు. నేను చీరలు సొమ్ములుగాని మఱి యేవైన నీకుఁ గావలసినవి యిచ్చితినని కాని లేక నా మీద నీవు ప్రీతి యుండినట్లు నటించిన నేదైన నిత్తునని కాని నాపై ప్రీతి కలిగియుండుట సకారణ ప్రీతి. ఇట్టిది నిజమైన ప్రీతి గాదు. కూలిప్రీతి. తల్లిదండ్రులు బిడ్డలను నెన్ని విధములనో ప్రీతితో కాపాడుదురుగదా. అట్లు వారు చేయుటకుఁ గారణము కలదా? తమ బిడ్డలను కారణము తప్ప మఱి యేకారణము లేదు. అది నిష్కారణమైన ప్రీతి. అట్టులే భర్త వలన సౌఖ్యముఁ గోరి యా కారణముచే నతని యందుఁ బ్రీతి గలిగి యుండుట నిజమైన ప్రీతి గాదు. అత డెట్టివాడైనను, దన్ను సుఖపెట్టినను గష్టపెట్టినను దన భర్త గదా యను నభిప్రాయముతోఁ బ్రీతి గలిగి యుండుట పతివ్రత లక్షణము. మావున 'నీ వలన నేనెట్టి దేహసౌఖ్యమును గోరికను నపేక్షింప'నని సూచించుట కా మాట సీత చెప్పెను.

రుక్మిణి : సావిత్రి సత్యవంతున కెట్లో నేను నీ కట్లని తలంపుమని సీత చెప్పె నే యిది యశుభసూచకముకదా?

తండ్రి : ఎన్నటికిని గాదు. ఒక కార్యము చేయఁ దలచినపుడు దానివలనఁ గలుగఁబోవు మేలుకీడును రెండును, ముందే యాలోచించి కార్యము చేయువారు బుద్ధిమంతులు. మూఁడు చేపల కథ మఱువలేదుకదా? కాబట్టి శ్రీరాముడు "పదునెనిమిది సంవత్సరముల చిన్నదాని నడవికిఁ బిలుచుకొని పోయితినా యేమేమి కష్టములు వచ్చునో, ఎన్ని కష్టములు వచ్చినను నేను దీనిని గాపాడఁగలను. కీడెంచి మేలెంచవలయును గదా? ఒకవేళ నా కేదైనఁ గీడు గలిగిన నట్టడవిలో దీని గతియే" మని యాలోచించుచున్నాఁడని సీత యూహించి యొకవేళ నీ కట్టి లాపద కలిగినను నేను నీ సమీపమున నుంటినా నిన్ను రక్షింతును. నేను దూరమున నుండిన నేమి చేయఁగలను? కావున సత్యవంతుని నిమిత్తమై సావిత్రి యెట్లు లడవికిఁ బోయెనో యట్లు నీ క్షేమమునకై నేను వచ్చెద ననుచున్న దాన నని సూచింప నట్లు చెప్పెను.

## సీతా రామలక్ష్మణు లరణ్యమునకుఁ బోవఁ బ్రయాణమగుట

తమతో నరణ్యమునకు వచ్చెదననిలక్ష్మణుఁడు వేఁడు కొన నంగీకరించి శ్రీరాముఁడు సమస్త వస్తువులు బీదసాదుల కొసంగి వనమునకుఁ బోవఁ దండ్రి యాజ్ఞ నొంద భార్యతోడను, దమ్మునితోడను నమ్మహారాజు సౌధమునకుఁ గాల్నడనపోయెను. దశరథుఁడు సమస్త భార్యాయుక్తుడై యుండి యా మువ్వుర లోనికిఁ బిలిపించుకొని వారిని జూచి దుఃఖముచే బరవశుఁడై పడి లేచి దుఃఖించుచుండఁ గైకేయి నారచీరలు దెచ్చి రామా! ఇదో యీ చీరలు కట్టుకొనుడి. మీ సరిగ వస్త్రము లిచ్చుట నుంచుఁడు. అరణ్యమున కిప్పుడే పొండు. ఆలసింపకుఁ డని వానిని రామలక్ష్మణులకును సీతాదేవికి నిచ్చెను. రామలక్ష్మణులు వానిని ధరించిరి.

రుక్మిణి : నారచీర లెట్లుండును?

తండ్రి : నేను జూచితిని. అవి మనము కట్టుకొను వస్త్రముల వలె నేసిన గుడ్డలు కావు. చెట్లపట్టలు. తాటిచెట్లలో నిండ్లిండ్లుగా వలవలె నుండు చిన్న పట్టలు చూచితివి గదా. వానివలెనే మూరెఁడు వెడలుపు మూఁడు జేనలు నిడివి గలిగి దట్టముగా తుండు గుడ్డలంత యుండును. మగవారు ఒకటో రెండో నడుమునకుఁ గట్టుకొందురు. స్త్రీలు ఱొమ్ము మీదఁ గూడ నొకటి పైటకు మాఱుగ కట్టుకొందురు.

సీతాదేవియు వానిఁ గైకొని వలను జూచిన యాఁడు జింకపిల్లవలె భయపడుచు సిగ్గు వ్యథ మనమును ద్రొక్కట పెట్టఁగ నెట్లు కట్టుకొనుటకుఁ దెలియక కన్నుల నిండ నీరు గ్రమ్ముచుండ మునిపత్ను లెట్లు వీనిని గట్టుకొందురో? యనుచు తన భర్త ముఖము చూచుచుండెను. శ్రీరాముఁడును దటాలున నామెను జేరఁబోయి యామె కట్టుకొన్న పట్టు వస్త్రము మీదనే యా చీరలను గట్టెను. శ్రీరాముఁడే తన భార్యకు నారచీరలు కట్టుట చూచి యంతఃపురమున నున్న వా రందఱు గొల్లున నేడ్చి దశరథుని జూచి ఛీఛీ యనిరి. అప్పుడు వసిష్ఠుఁడు కైకేయి క్రౌర్యమునకు నామెను దిట్టెను. దశరథుఁడును గైకేయిని జూచి పాపాత్మురాలా! నీవు సీత నరణ్యమునకుఁ బంప నన్నుఁ గోరితివా? నేను నీ కట్టి వరమిచ్చితినా? ఏల యింతటి ఘోరకార్యమునకు సాహసించితివి? ఛీ! నా కోడలు నారచీరలతో నరణ్యమునకుఁ బోరాదు అని యా చీరలను దీసి వైపించి కోశాగారము నుండి



పదునాలుగు వత్సరములకుఁ జాలినన్ని మంచి పట్టు సరిగ చీరలు తెప్పించి యిచ్చెను. శ్రీరామలక్ష్మణులు తల్లులకుఁ దండ్రికి మ్రొక్కి పాలప సెలవు గైకొనిరి. సీతయును మామగారికి నమస్కరించి యత్తగారికిని మ్రొక్కి యడవికిఁ బోవ సెలవిండని వేఁడెను. కౌసల్యా దేవియుఁ గోడలిని జేరఁదీసి యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని కౌఁగిలించి దీనస్వరముతో నిట్లనియె.

## కౌసల్య సీతకు నీతులు చెప్పుట

అమ్మా! నీ వెఱుఁగని ధర్మములు లేవు. అయినను నేను జెప్పవలసినవి నా యారటము కొలఁది చెప్పెదను.

**కం.** **కలిమియు సౌఖ్యము సతతము**
**సులువుగఁ గూర్పఁగను బ్రాణనాథుఁడు తీవిఁ**
**గులుకుచు, సిరులు దొలంగినఁ**
**గులటలు గద పతిని దూఱు గుణహీనసతుల్.**

**కం.** **తొలుత సుఖ మనుభవించుయుఁ**
**గలికీ! మఱి పతి కెదేని కష్ట మొదవుటఁ**
**దొలఁగ సుఖ, మతని నిందలు**
**పలుకుట పాయుటయు స్త్రీస్వభావము తల్లీ.**

**ఉ.** **బొంకుల పుట్టినిండ్లయి సపూరుషు గేలిగ వెక్కిరించుచుఁ**
**గొంకక దుష్టచింతనలకుఁ నిధులై భృశగూఢచిత్తలై,**
**మంకుతనంబునన్ వయసుమంపున రోయఁగఁ జేయుచుందు రే**
**ణాంకముఖుల్ నిమేషమునఁ బ్రాణమువోలెను జూచు భర్తనేన్.**

**చం.** **కులము మహత్త్వముం గన, రకుంఠితరక్తి విభుండుసేయు చె**
**య్వుల మదిఁజేర్ప, రాత్మవిభు నుజ్వలపొందితి మెచ్చ, రెంతయుఁ**
**దలఁపరు పాణిసంగ్రహము, దత్తధనాదుల నెంచ రాత్మలఁ**
**జలజదళాక్షి! ఱఁగ లగు చంచలచిత్తలు మత్తకాశినుల్.**

**కం.** **పతిహిత యయి శీలంబును**
**శ్రుతమును సత్యంబు శమము సొబగును గలయా**
**పతివత్నీ రత్నమునకుఁ**
**బతి యొక్కఁడె పరమగతియుఁ బావనగతియున్.**

**కం. అక్కట నాదు తనూజుఁడు**
**దిక్కఱి వనవాసి యగుట దెప్పకు మమ్మా**
**రొకకము గలిగిన లేవడిఁ**
**జిక్కిన దైవత మతండె చెలువా! నీకున్**

అని నీతి యుపదేశించిన సీతాదేవి వినయంబున నిట్లనియె. అత్తా! నేను బుట్టినింట నున్నప్పుడే భర్తను భార్య భక్తితో నెప్పు డెప్పు డెట్లెట్లు భజింపవలయునో యా విధులన్నియు నా తల్లిదండ్రులవలన నెఱింగిన దానను. మీరు చెప్పినట్లు భక్తితోఁ బతిని సేవించుచుందును. నన్ననార్యయని సందేహింపకుఁడు. చంద్రునిఁ బాసి వెన్నెల పోనట్లు ధర్మమార్గము విడిచి నా మన స్సెన్నఁడు పోనేరదు.

**తే. తంత్రి లేకున్న వీణనాదంబు లేదు;**
**చక్ర మెడసిన శకటంబు సాగఁబోదు;**
**కువలయాక్షికి నూర్గురు కొడుకు లున్నఁ**
**బ్రాణపతి లేమి సౌఖ్యంబుఁ బడయరాదు.**

**కం. మితముగ నిచ్చును జనకుఁడు**
**మితముగఁ దల్లియును సుతుఁడు మితముగ నిచ్చు౯**
**మితిలేని సుఖము నిచ్చెడు**
**పతిని౯ భజియింప దెవతె పరమపవిత్రా !**

**కం. వింటిని బెద్దల వలనను,**
**మంటిని సద్ధర్మగతిని, మఱివిభు నేలా**
**గెంటసము లాడుదును? వా**
**ల్గంటికి దైవతమనంగఁ గాంతుండ కదా.**

అని చెప్పినఁ కౌసల్యాదేవి సంతోషించి కోడలిని దీవించి సుఖముగ భర్తతోఁ బోయి రమ్మనెను.

రుక్మిణి : ఇవి కైకేయిని మనస్సులో నుంచుకొని యనిన మాటలు కావా?

అమ్మణ్ణి : కాకేమి? పిట్టమీఁద బెట్టి కాకిమీఁదఁబెట్టి తమకు సరిపడనివారిని దూషించుట స్త్రీలకు స్వభావమే కదా.



రుక్మిణి : అప్పా! నాకొక సందేహము. సీతాదేవి పాతివ్రత్యమును గుఱించి శాస్త్రములలోఁ జదివితినని చెప్పక పెద్దవారు చెప్పుచుండఁగా వింటిన నెనే ఆమెకుఁ జదువు వచ్చునా రాదా?

అమ్మణ్ణి : నాకొక సందేహము. సీతాదేవికి మామగారు చీరలు మాత్ర మిచ్చినట్టు చెప్పితివే. రవిక లేల యీయలేదు. సీతాదేవి యఱవస్త్రీల వలె రవిక తొడుగు కొనదా? మలయాళ స్త్రీలవలెఁ బైఁట కూడ వేసికొనదా?

రాముఁడు : నాకొక సందేహము. ఇప్పటి కొంద ఱాఁడుపిల్లలు పసుపు పూసికొని కుంకుమ పెట్టుకొనిన సొగసునకుఁ దక్కువయని మూలిగెదరే సీతాదేవి వానిని వదలినదా?

తండ్రి : కథ యంతయు వినుడు. మీ ప్రశ్నల కుత్తరము కడపటఁ జెప్పెదను.

## సీతారామలక్ష్మణు లరణ్యమునకుఁ బోవుట

అంత నా మువ్వురు సుమంత్రుఁడు రథంబుఁ దెచ్చిన దాని నెక్కి యప్పుడ బయలుదేఱి యా సాయంవేళ తమసానదీ తీరమున దిగి యా రాత్రియందుఁ బరుండి తమ్ము విడువలేక తమ వెంట వచ్చి గాసిచెంది చెట్ల మొదళ్ళ మచ్చు చల్లినవారివలె బడి నిద్రించుచు పౌరు లెఱుంగకుండ లేచి వేకువకు మున్నె పయనించి మఱునాఁడు గంగాతీరమున శృంగిబేరపురంబుఁ జేరిరి.

అందు శ్రీ సీతారామ లక్ష్మణులు భక్తుఁడగు గుహుడు కావించిన సపర్యల గ్రహించిరి. ఆ రాత్రి తీర్థోపవాసమని గంగాజలము మాత్రము ద్రావి దర్భలతోడను బత్రముల తోడను లక్ష్మణుఁడు శయ్య కల్పింప దానిపై సీతారాములు పరుండిరి. లక్ష్మణుఁడును గుహుఁడును నిద్దుర లేక ధనుర్ధరులై దూరమందు నిలిచి రాత్రియందు వారిని గాచుచు గత వృత్తాంతమును గుఱించి సంభాషించుచుండిరి.

ఆ మఱునాఁడు రామలక్ష్మణులు మఱ్ఱిపాలతో జడలు ధరించి సీతతోడ నావ యెక్కి సుమంత్రునకు మరలిపోవ నాజ్ఞ యిచ్చి గుహుఁడు నావ నడప గంగను దరించునపుడు సీతాదేవి గంగానదిని జూచి కేలు మోడ్చి,

**కం. అమ్మా! భాగీరథి! నె । య్యమ్మున నీ దాశరథీ వనాంతర వాసం**
**బిమ్ముగఁ దీరుచు నట్టుగ । సమ్మతి రక్షింపవమ్మ సాగరుకొమ్మా!**

తల్లీ! గంగాభవానీ ! పదునాలుగు సంవత్సరరములు వనవాసముం జేసి తమ్మునితోడను, నా తోడను నా విభుండు సుఖియై మరల నయోధ్యఁ జేరఁ బ్రసాదింపుము. నీ కరుణ వలన మరల మా నగరముఁ జేరఁగనే నీకు సమస్తవిధపూజలు గావింతును. నీ తీరములనుండు తీర్థములను దేవతలను నియతితోఁ బూజించి నీకు దృప్తి గూర నీమాఱు బ్రాహ్మణులకు నూఱువేల గోవులను నన్నవస్త్రములను దానమిచ్చి నీకు వేయి సురాభాండము లర్పించెదను అని ప్రార్థించుచుండఁగ నావ గంగ దక్షిణ తీరముఁ జేరెను.

అచ్చట సీతారామలక్ష్మణులు నావ దిగి యడవులఁ బడి కాలినడకతోఁ బయనించిరి. సీతాదేవికి సొమ్ములపై నెంత యాశయోగాని తన మగనితోపాటు తనాఉ నడవవలయునని శీఘ్రముగ నడచుచుండియుఁ గాలియందెలు మొదలయిన నగలు తీయకయే ఘల్లుఘల్లునఁ బోవుచుండెను. ముందు లక్ష్మణుఁడు త్రోవ చూచి పోవుచుండ నాయన వెంట సీతాదేవి పోవుచుండెను. వారి నిద్దఱ రక్షించుచు శ్రీరాముఁడు సీతకు వెనుక నరుగుచుండెను.

ఇట్లు వారు పోయిపోయి భరద్వాజ మహర్షి యాశ్రమము జొచ్చి యమ్మాహాత్మునకు నమస్కరించి యా రాత్రి యందుండి మఱునాఁడు చిత్రకూటమునకు ముని చెప్పిన మార్గమునఁ బయనించి యమున దాఁటి యా తీరమునఁ గొంతదూరము పోయి శ్యామమను వటవృక్షముఁ గాంచిరి. భరద్వాజమహర్షి చెప్పినట్టు సీతాదేవియు నా మహాదివ్య వృక్షమునకు బ్రదక్షిణించి నమస్కరించి వృక్షరాజా! నా పాతివ్రత్యము నిర్విఘ్నముగ జరుగునట్లును నా యత్తగారులగు కౌసల్యా సుమిత్రల మరల మేము గనుఁగొనునట్లు ననుగ్రహింపు మని వేఁడికొనెను.

రంగన్న : మామా! గయయందుండు మఱ్ఱి యిదా?

తండ్రి : కాదు. అది మఱియొక దివ్యవృక్షము. బుద్ధుని బుద్ధునిగ జేసిన దదే.

అచ్చటినుండి కదలి చిత్రకూటమార్గమునఁ బోవునపుడు త్రోవలో నీ ప్రక్క నా ప్రక్కనుండు నేవైనఁ బుష్పములను జూచి “ఆహా యది యేమి పువ్వో యెంత రమ్యముగ నున్నది. నాథా! యా పుష్పముఁ జూడుఁడు. ఎంత వింతగ



నున్నది. అది యేమి పండు” అని సీత పలుక లక్ష్మణుఁ డప్పుడే పోయి వానిని దెచ్చి యామె కిచ్చుచుండెను. ఇట్లు వారు పోయి చిత్రకూటము చేరి వాల్మీకిని దర్శించి యా పొంత నొక పర్ణశాల కల్పించికొని యందా ముప్వురు నుండిరి.

రుక్మిణి : అప్పా! అయోధ్య, ప్రయాగ యీ స్థలము లిప్పటికి నున్నవా?

అమ్మణ్ణి : ఉన్నవే. బదరికాశ్రమము పోయి వచ్చునప్పుడు అప్ప యివన్నియుఁ జూచి వచ్చి యచ్చటి వినోదములను జెప్పినాఁడు.

రుక్మిణి : నేను వినలేదు.

అమ్మణ్ణి : నీ వాయన దగ్గర నుండినఁ గదా?

తండ్రి : తరువాత వినుఁడు.

కొన్ని దినము లయిన తరువాత మేనమామగారి యింటి నుండి భరత శత్రుఘ్నులు వచ్చి తండ్రి మరణించుటయు, రాముఁ డరణ్యమునకుఁ బోవుటయు దెలిసి చాల దుఃఖించి శ్రీరామునెటులైనఁ బ్రార్థించి మరల నయోధ్యకు తోడ్కొని రావలయునని సమస్త బంధువులతోనుఁ బరివారముతోను బౌరులతోనుఁ జిత్రకూటమునకు వచ్చెను. వచ్చి యెంత ప్రార్థించినను శ్రీరాము డయోధ్యకుఁ బోవ నంగీకరింప లేదు. అప్పుడు రాముని మాఱుగ నాయన పాదుకలను గ్రహించి భరతుఁడు వెడలిపోయెను. భరతుఁడు దండు విడిసిన చోట నేనుఁగులు గుఱ్ఱములు లోనగు జంతువుల పెట్టి లద్దె ముఱిగి కంపు కొట్టుటచే నట్టి యనారోగ్య ప్రదేశంమం దుండటకు నిష్టము లేక సీతారామ లక్ష్మణు లాస్థలము విడిచి మఱియొక చోటికి దక్షిణముఁగ బోవుచు నత్రిమహామునినిని దర్శించిరి.

## శ్రీరాముఁ డత్రియాశ్రమంబుఁ జేరుట

ఆ మహామునియు వారల నాశీర్వదించి శ్రీరామునకుఁ దన భార్యయు వృద్ధయుఁ బవిత్రయు పావనచరిత్రయు మహాత్మురాలునగు ననసూయను జూపి యిట్లనియె. రామచంద్రా! ఈ తపస్వినికి నమస్కరింప సీత నంపుము. పది సంవత్సరములు భూమిమీఁద చినుకనుమాట లేక దేశమంతయు మలమల మఁడునపు డీమె తన తపస్సుచే గంగాతీరమునఁ గందమూల ఫలాదులను సృష్టించి యాశ్రమమున వసించు జీవకోటిని రక్షించెను. పదివేల యేఁడులు

ఘోరతప మొనర్చెను. దేవకార్యమునకై పది రాత్రు లొకరాత్రిఁగ జేసెను. ఈమె కోపమన నెట్టిదో యెఱుఁగదు. నిజపుణ్య కార్యములచే అనసూయ యను పేరు పొందినది. నీకును దల్లివలెఁ బూజ్యురాలు.

రుక్మిణి : అనసూయాదేవి పదిరాత్రులొక రాత్రిగ నేల చేసెను?

తండ్రి : అనసూయాదేవికి ఒక నగరమున పతివ్రత యగు నొక స్నేహితురాలుండెను. ఆమె మగనికి గుష్ఠరోగము. నడవలేఁడు. అతఁడొకనాఁ డొక వేశ్యను జూచి మోహించి దాని యింటికిఁ దన్నుఁ దోడ్కొని పోమ్మని భార్యతో చెప్పెను. ఆమెయు నా ప్రకార మొనర్ప తనని గంపలో నిడికొని పోవునపుడు రాజుచే మ్రుచ్చని గొంతులో కొఱ్ఱుగ్రుచ్చి వ్రేలాడఁ దీయఁబడి యుండిన మాండవ్యునిఁ జీఁకటిఁని గానలేక యాయన క్రిందుగ పోగా గంపలో నున్నవాఁడు మాండవ్యునకుఁ దగిలెను. దానిచే నాయనకు బాధ యెక్కువ యై నన్ను నిష్కారణముగ బాధించినవాఁడు సూర్యోదయము కాఁగనే చచ్చునుగాక యని శపించెను. ఆ మాటలు విని పతివ్రత యాహా యెట్టి కష్టము వచ్చెనని చింతించి వేఱుపాయము గానక సూర్యుఁ డయయింపకయే యుండుఁగాక యని పలికి మగని మరల నింటికిఁ గొనిపోయెను. ఆ ప్రకారము సూర్యుఁ డుదయింపిక యుండెను. పది దినముల కాల మొకరాత్రిగా నుండెను. దేవ బ్రాహ్మణ కార్యము లన్నియు నిలిచిపోయెను. అప్పుడు దేవతలు మునులందఱు పోయి బ్రహ్మను బ్రార్థించి యిట్లగుటకుఁ గారణమేమని యడిగిరి. ఆయన కారణము చెప్పి అనసూయాదేవి శాపము త్రిప్ప సమర్థురాలు. ఆమెను బ్రార్థింపుఁ డని పలికెను. వారంద ఱామెను బ్రార్థింపఁగా నామె నా సఖి భర్త మృతుఁడైనచో మీరు మరల బ్రదికించెదరా యనెను. వారు బ్రదికించెద మనిరి. ఆమె తరువాత సూర్యుఁ డుదయించునట్లు చేసెను.

## సీత కనసూయ హితోపదేశం బొనర్చుట

అంత శ్రీరామాజ్ఞానుసారముగ సీతాదేవి పోయి దేహమంతయు ముడుతలు పడి, తల నరసి, తెల్లవెంద్రుకలు జడలు గట్టి యోరుగాలికి నరఁటి చెట్టువలె వణఁకుచు బతివ్రతా ధర్మమిట్లు స్త్రీరూపమును గ్రహించెనో యను



నట్లుండు ననసూయా దేవికిఁ దన పేర్వాడి మ్రొక్కి చేతులు మోడ్చుకొని నిలబడి తల్లీ ! కుశలమా యనెను. అనసూయయు సీతాదేవిని జేరఁదీసి కౌఁగిలించి యొద్దఁ గూర్చుండఁ బెట్టుకొని యిట్లనియె. అమ్మా సీతా! నీవెంత పుణ్యచరిత్రవే! గొప్ప రాజునకుఁ గూఁతురవై మఱియొక మహారాజునకుఁ గోడలవై సమస్త సుఖము లనుభవించుచుండి చిన్న దానవయ్యు సుఖములను విడిచి, బంధువులను వదలి, సంపదలను మాని, గౌరవము సరకు సేయక, కష్టములకు భయపడక, పతి వెంట నడవికి వచ్చితివి. నీ యట్టి స్త్రీ రత్నములు లోకమునఁ గలరా! నీ నడవడి నాకు మిక్కిలి మెప్పొదవించెను. కూఁతురా! నా మాట వినుము.

**కం.** **నగరస్థుఁడొ విపినస్థుఁడొ**
**యగుణియొ నిర్ధనుఁడొ ఖలుఁడొ యతికామునఁకుడో**
**మగనాలికిఁ దనపతియే**
**సుగతికిఁ గారణ మతండచూ దైవంబున్.**

**చం.** **తన యొనరించినట్టి సుకృతంపుఁ దపంబువిధాన జానకీ**
**తను నిఖిలస్థలంబులను దద్దయుఁ బ్రోచెడి ప్రాణభర్త కం**
**టెను మఱిమేటి చుట్టమును నే నెఱుఁగం జుమి; ఆగలైన యా**
**వనిత లెఱుంగ లేరు మగువా? తగ వాఱడిపోక పోవుచున్.**

**చం.** **తన పతి సడ్డసేయక నితాంత లతాంతశరార్తి నిచ్చమైఁ**
**జనియెడివారు, ప్రాణవిభు శాసన పెట్టెడివారు, దుర్యశం**
**బున వరధర్మ నంచ్యుతిని బొల్పతి పోవుదురమ్మ! యిందునం**
**గును గుణదోషమూఢలయి; దుష్టగుణంబు సుఖంబుఁ గూర్చునే.**

**కం.** **ఇలువడి పాటించుచు మదిఁ । దలఁచుచు మేల్గిళ్ళు**
**శుభముఁ దప్పని సాధ్వీ**
**తిలకము సమస్త ధర్మం । బులు చేసినవారి మాడ్కిఁబొందుఁ**
**ద్రిదివమున్.**

**చం.** **సుమతిని బుట్టినింటికిని జొచ్చిన యింటికిఁ గీర్తిఁ దెచ్చు నా**
**సుమహిత సద్గుణ ప్రకరశోభిత, సన్నుతశీల, సాధ్వి, యు**
**త్తమయశముం బడంపడి నితాంతశుభంబును బొంది నాక సౌ**
**ఖ్యముఁ గనుఁగాన భర్తృహితకారిణివై చరియింపు మంగనా!**

అని బోధించిన సీతాదేవి యిట్లనియె.

అమ్మా! నీ వంటి మహాపతివ్రత యిట్లు చెప్పుట యేమి చిత్రము? చిన్ననాఁట మా తల్లియుఁ దరువాత వనములకు వచ్చునపుడు మా యత్తగారును సతీ ధర్మమును బోధించిరి. ఇప్పుడు నీవు బోధించిన నీతులు వానినెల్లఁ గ్రొత్తగఁ దలంపునకుఁ దెచ్చుచున్నవి. భర్త తేజో హీనుఁడైనను, దరిద్రుఁడైనను నతని గొలువవలసిన విధియుండ జితేంద్రియుండును, శ్లాఘ్యశుభచరిత్రుండును, దయామయుండును, ధర్మమానసుండును, మాతాపితృవత్ప్రియుండును, నగు ధన్యుని మాన్యుని సుజన మూర్ధన్యుని రాముని నేను గొల్చు టబ్బురమా? తల్లీ! నన్నొకతెనుతప్పఁ దక్కిన స్త్రీల నందఱను నా విభుఁడు తల్లుల వలె దోఁడులవలెఁ జూచును. రాజుగా రదాటునఁ జూచిన కాంతనైననుఁ దల్లినిబోలె నాదరించు ననఁదక్కిన మాటలు చెప్పనేల? అహంకార మెట్టిదో యెఱుఁగఁడు. పతిని సేవించుట చేతనే కదా సావిత్రి స్వర్గమున వెలుఁగుచున్నది. స్వర్గము నీ



అనసూయ సీత కంగ రాగము లిచ్చుట



యఱచేతిలోని దగుటకుఁ బాతివ్రత్యమే కదా కారణము. రోహిణి యొక నిమిషమైనను జంద్రుని విడిచియుండునా? స్థిర పతి భక్తిచేతఁ బతివ్రతలు జగన్నుతముగ జీవించి పదంపడి స్వర్గమునఁ బూజ్య లగుచుందురు అని చెప్పిన ననసూయ హర్షించి యామె శిరంబు మూర్కొని బిడ్డా! నీ మాటలచే మనస్సు సంతోషించెను. నీ కొక వరమిచ్చెదఁ గోరుకొమ్మనిన సీతాదేవి నీ కృపవలన నాకే కొఱంతయు లేదు. నీవు సంతోషించుటే నాకుఁ బరమవరమనిన ననసూయ జానకికి దివ్యాంగరాగ వస్త్రాభరణము లిచ్చి యిట్లనియె.

అమ్మా! యివి దివ్యములు. తపస్సుచే సంపాదితములు. ఇవి వాడవు. ఊడవు. వాసన వీడవు. నీ కనురూపములై యుండును. వీనిని ధరించితివా లక్ష్మీదేవి శ్రీవిష్ణువును సంతోష పెట్టినట్లు నీవును నీ భర్తను సంతోషపెట్టఁగలవు అనిన మైథిలి వానిని బ్రీతితోఁ గైకొని ధరించి యామె యంచునఁ గూర్చుండ ననసూయ యామెతో జానకీ! నీ స్వయంవర వార్త కర్ణాకర్ణిగా వింటిని. నీ వలననే యది వివరముగ వినఁగోరెద ముచ్చటించెదవే యనిన సీతాదేవి యిట్లనియె.

## సీత తన వివాహచరిత్రము ననసూయతోఁ జెప్పుట

విదేహాధిపతి యగు జనకుఁ డొకనాడు యజ్ఞార్థమై పొలమొందు దున్నింప నాఁగటితుద దాఁకి భూమి పెల్లగిల్లిన నందుండి నేను వెలికి వెడలి వచ్చితిని. ధూళిధూసరిత గాత్రయగు నన్ను జనకుఁడు కనికరంబున గ్రహించి తన యంకసీమఁ జేర్చి యీమె నా పుత్రికయని యాదరించెను. గగనవాణియు నీమె నీ కూఁతురనియెను. అంతట నన్నుఁ గొనిపోయి తన జ్యేష్ఠపత్ని కిచ్చిన నాయమయు నన్నుఁ దన కన్నకూఁతు వలె మిక్కిలి గారాబుముతోఁ బెంచుచుండెను.

ఈ విధముగ జనకుఁడు నాకుఁ బెంపుడు తండ్రియేకాని కన్నతండ్రి కాఁడు. బుద్ధి తెలిసిన పిల్లలను సాఁకిన మనలో నతుకరు మనమీఁదఁ బ్రీతియు నుంచరని లోకస్థితిని బట్టి నా తల్లిదండ్రులు తొలుతఁ దలంచుచుండిరి. కానినే నట్టి యభిప్రాయమున కెడమీయక వారినే యనుసరించి తిరుగుచుఁ గన్న తల్లిదండ్రుల కంటె నెక్కువగ వారినే గౌరవించుచు వారియందే ప్రీతి గూర్చుచు నుంటిని.

ఇంట్లుండ నాకుఁ బతిసంయోగ సులభంబైన యీడు రాఁగా నా తండ్రి ధననష్టికి నిర్ధనునివలె నన్నుఁ జూచి మిగుల విచారపడుచు,

**కం. కూఁతులఁ గను నాతఁడు కార్కూఁతలు విను వియ్యమాడి**
**కొలఁదుల చేనో**
**లాఁతుల చేనో తనతల వ్రాఁత కొలఁది నింద్రునంతవాఁడై యున్నన్.**

ఇట్టి గుణవంతురాలిని సుశీలను నెవ&ఇనకిత్తునో ఎవ్వఁడు దీనికి మగఁడగునో వివాహయోగ్యమయగు కన్యకనుదీర్ఘకాలమువివాహము సేయక యుంచుకొనరాదు అని యాలోచించి యీమె యయోనిజ గావున వీర్యశుల్క నొనర్చెదనని తనకు వరుణుఁడిచ్చిన యా శివధనువును విఱిచినవానికి నా కన్యక నిచ్చెదనని స్వయంవరము చాటించెను. అది మనుష్యులకు దుస్సాధమని యాయన యెఱుంగును. పదంపడి యెందరో నా నిమిత్తమై వచ్చి భగ్నాశులై తరలిపోయిరి. ఒకనాఁడు గాధేయమహర్షి రామలక్ష్మణులను దోడ్కొని మా తండ్రిని జూడవచ్చి నీ యొద్దనున్న ధనుస్సును వీరికిఁ జూపుమనెను. మా జనకుఁడటు లొనర్చ రామవిభుఁడు దానిఁ గేలఁగొని యెక్కు వెట్టినంత ఫెళు ్లన నది విఱిగి రెండయ్యెను. మా తండ్రి తన కోర్కి నెఱవేఱెనని సంతోషమున మిన్నుముట్టి వెంటనే నన్ను శ్రీరామునకు ధారవోయ సిద్ధపడెను. గాని శ్రీరామచంద్రుఁడు తన తండ్రి యాజ్ఞ లేక తాను గ్రహింపనని నిరాకరించెను. అప్పుదుర మా తండ్రి మా మామగారికి సమస్త వృత్తాంతముఁ జెప్పి పంపివారు వచ్చిన తరువాత నన్ను శ్రీరామునకును నా చెల్లెలు ఊర్మిళను లక్ష్మణునకు నిచ్చి వివాహము గావించెను. ఇట్లు శ్రీరామునకే నసురక్త నైతిని అని చెప్పి యామెచేత సబహుమానంబుగ వీడుకోలు వడసి పతిని డాసి జరిగిన వృత్తాంతము చెప్పి యనసూయ యిచ్చిన దివ్యపదార్థములు చూపిన రామలక్ష్మణులు మిగుల సంతసించిరి. ఆ మూవు రారాత్రి యత్రి యాశ్రమముననే పరుండి యుదయమున దండకారణ్యమునకై పయనించిరి.

## విరాధుఁడు సీతాదేవి నెత్తికొని పోవుట

ఇట్లు వారు ముచ్చురు దండకారణ్యంబునఁ బోవుచుండ విరాధుఁ డనునక రక్కసుఁడు తటాలున వచ్చి జానకి నెత్తికొని దూరముగఁ బరువెత్తెను. రామలక్ష్మణులు వానిపై బాణవర్షము గురియించిరి. వాఁడా శరబాధ





విరాధుఁడు సీత నెత్తుకొని పోవుట

సహింపలేక సీత నచట దిగవిడిచి నిమిషమునఁ బైపడి రామలక్ష్మణులఁ బట్టికొని వీఁపునఁ గట్టుకొని యాకాశమున నెగిరి పోవుచుండెను. సీతాదేవియు మిగుల వాపోవుచు,

**కం. నను మ్రింగు నిచట బెబ్బులు**
**లును దోడేళులును జిఱుతలును, వీడుము వా**
**రిని, నన్నుఁ గొంచుఁ బొమ్మీ**
**దనుజోత్తమ! నీకు మ్రొక్కెదం దయఁ గనవే.**

అని యఱచిన రామలక్ష్మణు లారోదనము విని కినిసి వెంటనే వాని రెండు హస్తములను నఱికి నేల దుమికి వాని నేలగూల్చి మోఁకాళుల మోఁచేతుల బాగు మర్దించి చంపి వానినొక గోఁతిలో బూడ్చి సీతాదేవితోడఁ బోయి

శరభంగునాశ్రమముఁ జేరిరి. అచట దండకాటవి నున్న ఋషులందఱు వచ్చి శ్రీరాముని శరణు జొచ్చి రాక్షసులచేఁ దమపడెడు దుఃఖము లన్నియు వచించి తమ కభయమీయ వేడినఁ నభయప్రదాన దీక్షాదక్షుఁడగు శ్రీరాముఁడును రాక్షసుల సంహరించి మీ భయంబు పాపెదనని యభయమిచ్చెను. అచ్చటనుండి వారు సుతీక్ష్ణాశ్రమముఁ జేరిరి. అమ్మహామునియు వారల నాదరించి పంచుచు మరల రండని వేఁడుకొనెను. ఆ యుదయమునే లేచి సీతాదేవియుఁ బ్రయాణసిద్ధులైన యన్నదమ్ములకుఁ జాప ఖడ్గతూణీరము లీయ వారు ధరించి పయనించిరి.

## సీతాదేవి శ్రీరామునకు హితోపదేశంబు సేయుట

ఇట్లు పోవునెడ శస్త్రాస్త్రముల పట్టువిడుపులు తెలిసిన దగుటచే సీతాదేవి రామలక్ష్మణ లానాఁడు శరచాపముల ధరించిన విధం బుపలక్షించి వారిభావంబు గ్రహించి రఘునందనుఁ గాంచి మందమంద మృదూక్తి సవినయముగ నిట్లనియె.

నాథా! మీరు కామ్య పదార్థముల నెల్ల వదలి మునివృత్తి నవలంబించి మునుల యాహారంబె ముఖ్యముగఁ గొనుచు వారి వలె నరణ్యసంచారము చేయుచున్నవారలు. ఇట్టి నిష్ఠను మీరు కానుభవములైన వ్యసనములను బూర్ణముగ వదలియే జరపవచ్చు గదా. కామమునఁ గలుగు వ్యసనములు మూఁడు. అసత్యసంభాషణము, పరదారాభిగమనము, నిష్కారణహింస. ఈ మూఁటియందు మీ రసత్య మిదివఱకు నాడినది లేదు. ఇఁక నాడఁబోయుటయు లేదు. ధర్మచరిత్రా! రెండవది పరదారసంగమము మీరు కలయందైనను స్మరింపరు. మీకుఁ బరదారలపై వలపిప్పుడు లేదు. ఎప్పుడును గలుగనుబోదు. మీరు స్వభార్యతోనే సంతోషించువారలని నాకుఁ దెలియును. మీరు సత్యధర్మరతులరు. నిశ్చలబుద్ధులరు. గురువాక్యస్థితులరు. సత్యమును ధర్మమును నెప్పుడు మఱవరు. ఏమఱరు. ఇట్టి గుణములు జితేంద్రియులైన వారికి మాత్రమే లభించును. మీ జితేంద్రియత్వము నేను జక్కఁగ నెఱుఁగుదును. మూఁడవ వ్యసనము పగకుఁ గారణము లేకయు నితరుల హింసించుట. ఇది మూఢులు చేయు రౌద్రకర్మము. రామభద్రా! ఇట్టిదానిని జలుప మీరు పూనితిరి. ఆ నిమిత్తముగ నిందు వచ్చితిరి. మీరు బాణబాణాసనములను ధరించిన



విధము చూచి మీ క్షేమము యశస్సు కోరుదానఁ గావున నా మనస్సు తల్లడిల్లఁ జొచ్చుటచేఁ దోఁచినది వక్కాణింపఁ బూనితిని. నా మనవిని నాలకింపుఁడు. మీ రిప్పుడు చాపూబాణ కృపాణపాణులై దండకారణ్య మధ్యమునఁ జరించుట తగని కార్యమని తోచుచున్నది. ఏలన మీరు దెలిసియో తెలియకయో నిష్కారణముగనో సకారణముగనో యేదే నొక బాణము విడుతురు. దాన నెవ్వఁడైనఁ జచ్చును. అదే పగకుఁ గారణ మగును. కావున నిప్పట్ల చాపధారణము కలహ కారణమగును. అగ్నిహోత్రునకు సమిధలవలె క్షత్రియునకు శస్త్రధారణము బలతేజోవృద్ధిని గావించును. ఈ విషయమై యొక కథ విన్నవించెదను.

ప్రాణేశ్వరా! మున్ను సత్యధర్మరతుండైన యొక తపసి కుమారుండు ఘోరతపము గావించుచుండ నిద్రఁ డతని తపస్సునకు హాని గలిగింపఁ గోరి భటవేషము ధరించి యతని యొద్దకు వచ్చి తపోధనా! నేను మరలి వచ్చువఱ కీ కృపాణము నీ యొద్ద నిల్లడగ నుండనిమ్ము అని యాకత్తి నతకిచ్చి పోయెను.

ఆ బ్రాహ్మణకుమారుఁడు దాని నెక్కడ నుంచిన నేమై పోవునోయని తలఁచి జాగ్రత్తగఁ గాపాడుటకై తానెక్కడకుఁ బోయినను దానిని దనతోఁగూడఁ దీపికొని పోవుచుండెను. తొలుత దాని నుపయోగింప కయే యుండెను. తరువాత దర్భలు కోయుట యందును దరువాత సమిధలు నఱకుట యందును దరువాతఁ బొదలు పడఁగొట్టుట యందును గ్రమక్రమముగ నుపయోగింపసాగెను. పొదలలో నుండి చెట్ల నుండి సరీసృపాదు లేవైన వెలువడినఁ బూర్వము జంతుహింస చేయ వెఱచి తొలఁగిపోవువాఁడు వానిని గత్తిచే భేదించుచుండెను. ఇట్టులే సన్నజంతువులను మఱి పెద్ద జంతువులను జంపఁ బ్రారంభించి జీవహింసారతుఁడై దుర్గతికిఁ బోయెనని పెద్దలు చెప్పెదరు. ప్రాణేశ్వరా! వింటిరిగదా శస్త్ర సాంగత్యము వలననగు కీడు. ఆశ్రయాశు సాంగత్యమెట్టిదో శస్త్రసాంగత్య మట్టిది.

వల్లభా! నన్ను నీ వాక్షేపించుదానవా యని తలఁపకుఁడు. చనవుచేతను, స్నేహభావముచేతను, నిరతము మీరు నన్ను గౌరవదృష్టితోఁ జూచు కారణముచేతను నిప్పటి చర్య సరికాదని మిమ్ము హెచ్చరించితినిగాని మీకుఁ దెలియని దానిని నేను నేర్పయత్నింపలేదు. ఏ విధముగఁ జూచినను మన కపరాధము చేయనిరాక్షసులఁ జంపుట సరిగాని కార్యమనియే నా తలంపు.

నిష్కారణముగ నొకరిని బాధించుట నాకేమియు రుచింపదు. నేను క్షత్రియుఁడను గానా, నాకు శరచాపధారణమె ట్లనుచిత మందురేమో? వీరులగు క్షత్రియులకు శస్త్రధారణ మార్తజనరక్షకేగాని నిరపరాధి శిక్షకుఁ గాదు. అదియును గాక క్షాత్రమెక్కడ? మీ తపశ్చర్య యెక్కడ? కానన మెక్కడ? మీ శస్త్రభరణ యెక్కడ? ఇవి పరస్పర విరోధములు గావా? ఏ దేశమున నే వ్రతమునఁ జరించువారి కాదేశమున కా వ్రతమునకుఁ దగిన చర్య యుచితయుగాని యడవుల మునివృత్తి నుండువారికి క్షాత్రధర్మచర్య సరిగాదు. మరల మీ రయోధ్య యందుఁ ప్రభులై ప్రజారక్షణము సేయునపుడు క్షాత్ర మవలంబింప నర్హము. రాజ్యము సంపద భోగములోనగునవి యన్నియు వదలి జటాజినములు ధరించి ఫలమూలాశనవ్రతులై సంయమివలె నుండు మీకు దండము మాని చరించిననే మీ తల్లిదండ్రులు సంతసింతురు.

**కం. ధర్మంబున నర్థం బగు। ధర్మంబున సుఖము గలుగు, ధర్మముచే స**
**త్కర్మంబులు ఫలియించెడి, । శర్మకరా! జగము ధర్మసారంబె కదా.**

**కం. సుఖమున సుఖము లభింపదు, । ప్రఖర వ్రతములకు నియమపద్ధతులకు ను**
**న్ముఖుఁడై యాత్మ జయించిన। నఖిలోత్తమ మైన ధర్మమలవడు నాథా!**

**కం. మానిత సౌమ్యుఁడవున్, శుచి । ధీనియతుండవును, నీకుఁ దెలియని దు న్నే**
**ప్రాణేశ! ముజ్జగంబుల, । నేనెంతటిదాన నీకు నీతులు నేర్పన్.**

వల్లభా! వనములఁ జరించు మీకు మునివృత్తియే సముచితమని నా మతము. స్త్రీ చాపల్యముచే నాకుఁ దోఁచినది వచించితిని గాని మీకు ధర్మాధర్మములు బోధింప నెవరు శక్తులు? అన్నదమ్ములు మీ రిరువురు చక్కఁగ నాలోచించి మీకు రుచించినట్లుల ధర్మహాని లేకుండఁ జరించుటే నా యభీష్టము.

## శ్రీరాముఁడు సీత కార్తరక్షణము పరమధర్మమని చెప్పుట

అనిన శ్రీరాముఁ డిట్లనియె. దేవీ! నీ కులమునకు గుణమునకుఁ బతిభక్తికిఁ దగినట్లు నీతి బోధించితివి. ఈ విషయమున నా యభిప్రాయము వినుము. క్షత్రియులు దీనజన రక్షార్థము శరచాపముల ధరింపవచ్చునని నీవే చెప్పితివి కదా. నీ సమ్ముఖమందే దండకారణ్యవాసులైన మునులు నా శరణు చొచ్చి రాక్షసులవలనఁ దమకు నిష్కారణముగఁ గల్గెడి బాధల వచించి



రెండుచేతులు మోడ్చి రక్షింప వేఁడిరి కదా? జితేంద్రియులును, దపోధనులును, సర్వభూత హితులును, గందమూలఫలాశనులును, శుష్కదేహులునైన మును లొకరికి నెగ్గు సేయుదురా? అట్టివారిని రాక్షసులు తెకతేరకు హింసింప వచ్చునా? అట్లు హింసించుచుండ నార్తారక్షా సమర్థుఁ డగు క్షత్రియుఁడు తేరగానివలెఁ జూచుచుండుట ధర్మమా? దండకయందలి ఋషితండంబులు తమకుఁ దార మమ్ము దాసి తమ కష్టంబులు కొండలు కోటులుగ వాక్రుచ్చిరి. దీనులు మొఱలు పెట్టి నన్నుఁ బ్రార్థించుటకు ముందే వారిని రక్షించుట నావ్రతమై యుండియు వారు ప్రార్థించువఱకు నేమిచేయక యుండుటకు నాకే సిగ్గై వారికిఁ బరిచర్య సలిపి యేమి యాజ్ఞాపించెద రని వేఁడితి. వారును రాక్షసులు తమకుఁ జేయు నపకారములు వచించి మఱియు నిట్లనిరి. మేము క్రూరాత్ములు లోకద్రోహులు ధర్మకార్యహానికరులు మానుషాదులునైన రాక్షసులను శాపంబునఁ జంపఁగలముగాని కోపించితిమా మా కష్టార్జితమైన తపము నశించునని యూరకున్న వారము. తపస్సు సులభకార్యము కాదు. మిక్కిలి దుష్కరము. విఘ్నములు మెండు. అట్టిది వమ్మై పోవుట కోర్వక రాక్షసులు మమ్ము బాధించినను మేము సహించి శపింపకున్నవారము. దేవా! నీవే మాకు దిక్కు. మా తపస్సులు ఫలింప! జేయ నీ భారము అని యెంతయు విన్నవించిరి. నేనట్లే యొనర్తునని బాస చేసితిని.

**కం. న న్నాశ్రయించి కీడుం । దెన్నున నెన్నఁడును బోని దీనుల నసురుల్**
**పన్నుగఁ జంపిరి, నీవే । యెన్నుమ యింతకు విరోధహేతువు సుమతీ!**

**కం. విడిచెదఁ బ్రాణములైనన్**
**విడిచెద నిన్నైనఁ దమ్మునిన్ విడిచెద, నే**
**విడుతునె ప్రతిజ్ఞ? నందుం**
**బుడమి సురలతోడఁ బల్కి ముగ్ధా! యెపుడేన్.**

నన్నాశ్రయించి నన్నే నమ్మియుండు వారి కార్యములు వారు వేఁడక పూర్వమే నేను సలుపుట నాకు విధియై యుండఁ బ్రతిన చేసియుఁ దప్పుదునా? స్నేహమునను మోహమునను సౌహార్దంబునను నీవు బోధించితివి. ఇందుఁ దప్పేమి? స్నేహబుద్ధి లేనివారలు పరులకు హితము బోధింతురా? నీ మనస్సున నుండినది చెప్పి నా యభి ప్రాయము తెలిసికొనుటకై యత్నించితివి. చాల సంతోషించితినని సీతను సమాధానపఱిచెను.

శ్రీరాముఁడు ముందుగను సీత వెనుకను ఆమె వెనుక కోదండదండ ధరుండై సుమిత్రానందనుండు నరుగుచుండిరి. ఇట్లు దండక యందలి నానా ఋషీశ్వరాశ్రమము లన్నియుఁ దిరిగి తుదకు నగస్త్య మహాముని వచించిన చొప్పునఁ బంచవటిఁ చేరి యం దాశ్రమము కల్పించుకని పర్ణశాల యందు వసించుచుండిరి.

రుక్మిణి : పంచవటి చేరునప్పటికిఁ బదునాలుగేండ్లలో నెన్ని కడచిపోయినవి?

తండ్రి : పదుమూఁడు సంవత్సరములు.

ఈ పంచవటి యందు సీతారామలక్ష్మణు లందునపుడే రావణుని చెల్లెలగు శూర్పణఖ యను రాక్షసి శ్రీరాముని సౌందర్యముఁ జూచి మోహించి పెండ్లిచేసుకొన వలయునని వచ్చి సీతను మ్రింగ యత్నింప రామాజ్ఞను లక్ష్మణుఁడు దాని ముక్కుచెవులను గోసి పంపెను. అదియును మొత్తుకొనుచుఁ బోయి దాని యన్నయగు ఖరునితో లేనిపోని యబద్ధములను జెప్పి నవానిని దిట్టి వానికి రోషము వచ్చునట్లు చేసి యుద్ధమునకుఁ బ్రేరించెను. వాఁడు పదునాలుగు వేల రాక్షసులతో శ్రీరాముని మీఁదికి యుద్ధమునకు వచ్చెను. రాముఁ డొక్కఁడే పాదచారియై యా పదునాలుగు వేల రాక్షసులను జంపెను. అందొక్కఁ డకంపనుఁ డనువాఁడు స్త్రీవేషము వేసికొని తప్పించుకొని పోయి రావణాసురునితో జనస్థాన మంతయుఁ బాడైన వృత్తాంతముఁ జెప్పెను. శూర్పణఖయు నట్టులే పోయి యబద్ధము లెన్నో చెప్పెను. రాముని పరాక్రమము విని రావణుఁడు యుద్ధమున శ్రీరాముని జయింపలేనని భయపడి సీతా సౌందర్యము విని యామె నపహరింపఁ దలచి మారీచుఁడను మఱియొక రాక్షసుని దోడు చేసికొని రామాశ్రమమునకు వచ్చి కొంతదూరమందు నిలిచెను. అప్పుడు మారీచుఁడు మణిమయములైన శృంగములును, దెలుపునలుపు గలసిన ముఖమును, ఇంద్రనీల వర్ణములైన శ్రవణములును, వజ్రకాంతుల యుదరంబును గలిగిన మాయలేడియై రాముని యాశ్రమము సమీపమునఁ దిరుగుచుండెను. సీతాదేవియు నా సమయమునఁ బుష్పావచయమునకై యామె నిర్మించినపూలతోఁట యందు విహరించుచు దాపునఁ దిరుగుచుండిన మాయజింకను జూచిరందు రండని రామలక్ష్మణులను బిలిచి వారికిదానినిజూపి నెయ్యపుఁ జూపులఁ జూచుచు నిట్లనియె.



ఆహా! యిది యెంత వింతజింక. ఎన్నెన్ని విధముల మృగములనో చూచితిమి గాని దీని దేహకాంతి వానిలో నొకదానికైనఁ గలిగెనా? దీని రూపమేమి! దీని కాంతియేమి! దీని స్వరసంపద యేమి! ప్రాణేశ్వరా! చూడఁ జూడనిది నా మనమునులాగుకొనుచున్నది.

ఉ. **జింకలు లేవె లోకమునఁ? జిత్రమృగంబుల నెన్ని చూడ? మీ**
**పొంకపు వన్నెయుంజనవుపోణిమి కంటిమె దేనియందు? న**
**ల్వంకల మేనికాంతులు దళంబుగఁ జల్లుచుఁ గానలోన నే**
**ణాంకుని బోలియున్నది ప్రియా! దయ దానిని బట్టి తేఁగదే.**

ఇది ప్రాణముతోడఁ బట్టువడెనా యయోధ్యలో మన యంతఃపురము నలంకరింపదా? భరతునకుమీకు నాకు అత్తగార్లకు అందఱకు నిది విస్మయకారణముగ నుండును గదా? ప్రాణముతోఁ జిక్కక పోయినను దాని చర్మము మీఁద మన మిరువురము కూర్చుండినఁ జాలదా? నాథా! పెనిమిటిని నాకది కావలెనది కావలెనని పీడించుట భార్యలకుఁ దగిన కార్యము కాదు. చాలఁ గ్రూరమైన పనిఅయినను నా మదిలోని కోరిక పట్టఁజాలక చెప్పితిని గాని బలాత్కరింపను. అనిన కోరక కోరక కోరిన ప్రియురాలి కోరికను దీర్పఁ దలంచి యిది మారీచుమాయ పోవలదని లక్ష్మణుఁడు చెప్పినను వినక రాముఁడు సీతను గాపాడుచుండ లక్ష్మణు నియమించి శరచాపాసి ధారియై యా జింకను బట్టుకొనఁ బోయెను. అదియును జిక్కక టక్కులు చేసి దవ్వుగ నాయనను లాగుకొనిపోయెను. ఎంతసేపైనను జిక్కక చిక్కులు పెట్టుచున్నఁ జూచి రాముఁడు కోపించి దానిపై నొక బాణమును వైచెను. ఆ బాణము దెబ్బకు మారీచుఁ డెగిరిపడి హా లక్ష్మణా! హా సీతా! యని బిగ్గ నఱచి చచ్చెను. రాముఁడును వాఁడు లక్ష్మణుఁడు చెప్పిన మారీచుఁడని యెఱిఁగి మఱియొక జింకను వధించి దాని చర్మము వొలిచి దెచ్చుచు రాక్షసుని కూఁత విని సీతా లక్ష్మణు లేమి దిగులుపడిరో యని సందేహించుచు శీఘ్ర గమనంబున నాశ్రమాభిముఖుఁడై వచ్చుచుండెను.

## సీతా లక్ష్మణ వివాదము

అక్కడ సీతాదేవి రామకంఠ సదృశమైన యార్తరావము విని యులికి పడి గుండెలు తటతట కొట్టుకొన లక్ష్మణు! జూచి లక్ష్మణా! నీవును వింటివి

కదా యిప్పుడు వినవచ్చిన మీ యన్న యార్తధ్వని. నాకు గుండెలు ఝల్లు మనెను. ప్రాణములు తత్తఱలాడుచున్నవి. మనస్సు నిలుప శక్యము గాకున్నది. అన్నా లక్ష్మణా! మీ యన్న కే విపత్తు సంభవించెనో, ఒంటరియై యెవరికిఁ జిక్కెనో, రాక్షసులకు వశపడెనో, ఘోరమృగములే పైకొనెనో, లక్ష్మణా! మీయన్న యఱచుచున్నవాఁడు. నా తమ్ముఁ డతిశూరుఁడు. తప్పక నా కేక వినఁగానే తోడుపడ వచ్చును అని నమ్మి నీకై దిక్కులు చూచుచుండును. లక్ష్మణా! పరువెత్తుము. సింహముల నడుమ! జిక్కిన హరిణము వలె నెంత తల్లడిల్లుచున్నవాఁడో అని పలికిన సౌమిత్రియుఁ దనయన్న బలపరాక్రమము లెఱిఁగినవాఁడు గావున దిగులు పడక శ్రీరామాజ్ఞ మదిని స్మరించి చలింపక యచ్చటనే నిలిచి యుండిన యాయనను జూచి కోపించి సీతాదేవి యిట్లనియె.

సౌమిత్రీ! ప్రాణాపాయ దశయందున్న నీయన్నకుఁ దోడుపడఁ బోవనీ మనసేల యొల్లదు? బాసటగాఁ బోవు తలంపును నీకు లేదే. ఆ యార్తనాదము విని నీ మనస్సెట్లు చలింపకున్నది? ఎట్లు కరఁగకున్నది? నీ గుండె ఱాయా? యినుమా? ఓరీ నీవు మిత్రాకృతిగా నున్న శాత్రవుండవా? దుష్కామీ! నీ వాయనపట్ల ద్రోహ మెంచుటకు నీకా పుణ్యాత్ముఁ డేమి కీడు గావించెరా? తెలిసెఁ దెలిసె లక్ష్మణా! నీ మనస్సు నిశ్చముగా నీవు నా మీఁది యభిలాషచే మీ యన్న వినాశముఁ గోరుచున్నాఁడవు. లేకున్న నీవా మొఱ వీనులార వినియు నడుగైన నెత్తిపెట్టక నిద్రాతివలె నిఁలబడి యుందువా? సుజనునకు సౌభ్రాత్రము గలవాని కిట్లు నిలువ మనస్సొప్పునా? ఇంతయేల? ఇప్పటికి నీవు చలింపవు. నీయన్నపై నీకుఁ బ్రేమ సున్న. ఆయన మరణము నీకు సంతోషకారణము. నీ వరణ్యమున కేల వచ్చితివి? ఆయనను గాపాడుటకుఁ గదా! ఆయన యాపదయందు మునిఁగియుండ నీ విక్కడ నన్నుఁ గాచియుండి ఫలమేమి? ఆయన ప్రాణ మెక్కువా నా ప్రాణమెక్కువా? అని బెగ్గిలి కన్నీరు ధారలుగఁ గాఱ బలికిన సీతాదేవిని జూచి లక్ష్మణుం డిట్లనియె.

వదినె! యేలమ్మాయిటు మాటలాడెదవు? ఏల నీకింత భయము? నీ భర్తను దేవ మనుష్య యక్ష రాక్షస పిశాచ సిద్ధకిన్నర కింపురుష గంధర్వ నాగ సమూహము లన్నియు, నొక్కటై దాఁకియు ముఖాముఖి యాయన యెదుట నిల్వలేవు వారికిఁ బ్రాణములు దీపు గావా? చూచి చూచి ప్రళయాగ్నిలో నెవరైన దుముకుదురా? ఆయన జవసత్త్వ పరాక్రమాస్త్ర పాండిత్యాదులు నీ వెఱుఁగవా? ఆయన కోదండ దీక్షాగురుఁడు కాఁడా? రాముఁ డెట్టివారికి



నవధ్యుఁడు. ఆయనకై నీవు విషాదపడకుము. నిన్ను నట్టడవి నొంటి విడిచి పోవ నాకుఁ గాళ్లెట్టులాడును? మనస్సెట్లొప్పును? ఇక్కడ నీ కేదైన విపత్తు గూడిన రక్షకు లెవ్వరు. ఆయన నిన్ను నా కిల్లడ యుంచి యేగెఁ గదా? అన్న యాజ్ఞ యెట్లు మీఱఁగలను? నా మాట వినుము. అది రాముని స్వరము గాదు. ఎవ్వఁడో రాక్షసుఁ డట్లు కూఁత వేసెను. ఖరుని జంపినది మొదలు రాక్షసులందఱు మనమీఁదఁ గంటు వహించి యెటులైన మనల వంచించి మనకుఁ గీడు చేయ రోయుచున్నారు. వారే యట్టి కల్లకూఁతలు కూయుచున్నారు. శాంతింపుము. దుఃఖింపకుము అని యెంతో వినయమున వచించెను.

సత్యవాదియైన లక్ష్మణు వాక్యములు విని జానకి కోపము పట్టఁజాలక పరుషోక్తుల నతని నిట్లనియె.

ఓరీ దయాహీనుఁడా! ఓరి పాపీ! ఓరి కూళా! ఓరి దుష్టుఁడా! ఓరి యనార్యుఁడా! ఓరి సద్వంశదూషకా! ఓరి భ్రాతృద్రోహీ! ఓరి పాషాణ హృదయా! నీ కెంత గుండె నిబ్బరమురా! అన్నచావుకూఁత వినియుఁ గదలకున్నా వేమిరా? ఆయనకేల నీవు కీడు కోరెదవురా? ఆయన నీ కేమి కీడు తలఁచెనురా? పల్లెత్తి యొక మాటయిన నిన్నుఁ గోపించి యెన్నఁడైనఁ బలికెనా? ఆయనపై నీకు నిష్కారణముగ ద్వేషమేలరా? ఆయన చేటు నీ కెట్లు సమ్మతి యాయెనురా? ఓరి చెనఁటీ! యాయన కీడు గన్నారఁ గాంచి యిటు లాడెదవా? ఓరి చెడుగా! తెలిసెఁ దెలిసె. నీ చర్య లోకమున వింతగాదు. దాయాదులు లోకములో మాఱు వేషములు ధరించి కీడు చేయుచుందురు. వెన్నపూసిన కత్తులు. పయోముఖ విషకుంభములు, గోముఖ వ్యాఘ్రములు. పుల్లుకప్పిన గుంతలు, నీయట్టివే కదా. ఓరి నా మాట వినుము. నీ హృదయ మెఱింగితిని. నీవే వచ్చితివో భరతుఁడే నిన్నుఁ బంపెనో గాని నీవు సమయ మెఱిఁగి మీ యన్నకుఁ గీడు సేసి నన్ను హరింపఁ దలంచి వంచన యొఱుంగని యా పుణ్యాత్మువెంట నీవు కానలకు వచ్చితివి గాని నీ నాయనకుఁ దోడుపడ వచ్చినవాఁడవు కావు. నిజముగఁ గావు. నీ కుటిలబుద్ధి కొనసాగునని నీ వెంచితివి గాని, నా మనస్థితి యెఱుఁగవైతివి. ఓరీ! రామునకుఁ దప్ప మఱియొకనికి నేను వశపడుదునటరా. రాముఁడే లేకయుండిన భూమిమీఁద సీత యుండునని తలంచితివా? ఇదిగోఁ జూడుము. నీ యెదుటనే మరణించెదను అని వినరాని పలుకులు సీసము కరఁగించి చెవులలోఁ బోసినట్లు కూచి యినుప శలాకలతోఁ గ్రుమ్మినట్లు సీత పలుకఁగా మానధనుఁడు జితేంద్రియుఁడు నిష్కల్మష చిత్తుఁడగు

సుమిత్రానందనుఁడు రెండుచేతులు జోడించి తలవంచి వదినె! నీవు నాకుఁ దల్లివి. దైవమవు. నీకుఁ బ్రత్యుత్తరము చెప్ప మనసొప్పదు. ఇట్టి నిష్ఠుర భాషణములు స్త్రీలకు సహజములు.

**చం. ఇది సహజంబు లోకమున నింతుల కెల్ల; విముక్త ధర్మ దు**
**ర్హృదయులు, చంచలాత్మికలు, నెంతయుఁ గ్రూరలు, భేదకారిణుల్,**
**ముదితలు; కొఱ్ఱు గాల్చి చెవిలోపలఁ గ్రుచ్చిన యట్టులయ్యెనో**
**మదవతి! నీదుపల్కు రవమాత్రమ యేని సహింప నేర్తునే!**

తల్లీ! నేను పల్కిన న్యాయోక్తులకు నీవు పలికిన నిష్ఠురోక్తులకు సర్వవన చరులు సాక్షులు. ఛీపో. గురువాక్యమందు నిలిచిన నన్నిట్టు నీవు సంశయించుటచే నిచట నిఁక నిల్వరాదు. ఎటులైనఁ బాడై పొమ్ము. ఇదో నే నిపుడే శ్రీరాముకడకుఁ బోయెదను. నిన్ను వనదేవతలు రక్షింతురుగాక. నా కపశకునము లగుచున్నవి. రామునితో నేను వచ్చి యిచట నిన్ను మరలఁ గందనో కనలేనో అని లక్ష్మణుఁడు పల్క సీతయుఁ గన్నీరు గాఱ నేను విషము మ్రింగెదను. గోదావరిలో దుమికెదను. ఉరిపోసి కొనెదను. నిప్పుల దూఁకెదనుగాని పరునిఁ గాలి గోరనైన స్ప ృశింతునా? అని కడుపు బాఁదుకొనుచు హోయని యేడ్చుచు నుండ జానకిని లక్ష్మణుఁ డెంత యూరడించినను వినక బదులు పలుకక మఱింత యేడ్చుచుండ లక్ష్మణుఁడును రెండు జేతులు జోడించి యామెకుఁ బ్రదక్షిణించి నమస్కరించి కోపవశుండయి తాను బోయిన నామెకు నే కీడుమూఁడునో యను భయమునఁ బోవ నిష్టము లేకయుఁ ద్వరగాఁ బోయినట్టులే తిరిగితిరిగి చూచుచుఁ బోయెను.

రుక్మిణి : అప్పా! సీతాదేవి లక్ష్మణుని దిట్టినది యన్యాయ్యమప్పా! అంతటి యుత్తమ స్త్రీ నిష్కారణముగ నటువంటి పుణ్యునిఁ దిట్టవచ్చునా?

రాముఁడు : ఆఁడువారికి సహజముగ నోటి దుడుసు మెండులే. తాఁకుతప్పు, పెద్దపిన్న, మట్టుమర్యాద లేక యెంతమాటయిన నెవ్వరినైనఁ దటాలున నందురు. నిష్కారణముగ నిర్దోషిని దిట్టినందునకే యామె కా శిక్ష వెంటనే కలిగినది. ఈ నీతి మీరు మనస్సులో నిలుపుకొని మీరెవ్వరి నట్లు దూషింపకుండుఁడు.

రుక్మిణి : వీని మాటల కేమిగాని సీతాదేవి యట్టుల మాట లాడవచ్చునా?

తండ్రి : సీత పుట్టిన దెందులకు?



రుక్మిణి : లంక చెఱుచుటకు.

తండ్రి : రామలక్ష్మణులు తన యొద్దనుండిన రావణుఁడు త న్నెత్తికొని పోవుటకు వల్లపడదు. కావున జింక నెపము పెట్టి పెనిమిటిని బంపెను. లక్ష్మణుఁ డన్నయాజ్ఞ మీఱువాఁడు కాఁడు. ఏమి చెప్పినను బోఁడు. కావునఁ దిట్టి పంపెను. అంతియ కాని యామెకు నిజము తెలియకకాదు. ఇది యవతార రహస్యము. రెండవది రాముఁడు చెప్పినది స్త్రీల నడవడి యిట్టిదని, దానివలనఁ గలుగు ఫలమిట్టిదని లోకమునకుఁ దెలుపుట కామె యట్లు నటించెను. మూఁడవది తడిక త్రోసిన వారెవరనిన ఆలు లేనివాఁడని సామెత. భార్య లేనివాఁ డెంత నియమశీలుఁడై జితేంద్రియుఁడై పరనారీ సోదరుఁడై యుండినను, చనవుగ కుమార్తెలతో మాటాడినను స్త్రీలు సందేహింతురు. ఆఁడుదాని కది స్వభావ దుర్గుణము. ఎదుటివారి గొప్పగుణమును దెలిసికొను తెలివి స్త్రీలకు భగవంతుఁ డిచ్చిన వాఁడు కాఁడు.

అమ్మణ్ణి : రాముని కపాయము లేదని రాక్షసమాయయని లక్ష్మణునకుఁ దెలియును గదా? దూరమునఁ బొదలలో దాఁగి సీతను గనిపెట్టక తటాలున కోపించి యేల పోయినాఁడు?

తండ్రి : అంతదూరము దూషించినను లక్ష్మణుఁడు పోక నిలిచిన యెడల సీతకు నతనిపై ననుమాన మెక్కువయి యురి పోసికొని చావనే చచ్చెననుకో. అప్పుడు గతియేమి? అటుగాక దూరమునఁ బొదలలో నిలిచినాఁ డనుకో. శ్రీరాముఁ డాశ్రమమునకు వచ్చినప్పుడు సీత రామునితో లక్ష్మణుని దాను బంపినట్టు చెప్పును గదా. తన యొద్దకు రాక సీతయొద్దను లేకపోయెనని రామునకును లక్ష్మణుని యెడ సందేహము కలుగును గదా? ఇదియంతయు నాలోచించియే ఋజుప్రవర్తనము మంచిదని లక్ష్మణుఁడు చక్క రామునొద్దకుఁ బోయెను. అదిగాక యెట్టివారికైనను గోప మెక్కువయైన నాలోచన తక్కువగును.

తరువాతి కథ వినుండు. లక్ష్మణుఁడు కనుమఱుఁగై పోగాఁనే కాషాయ వస్త్రము గట్టి కమండలువు చేతఁబట్టి జడలు ధరించి ఛత్రము దండముఁ

బూని రావణుఁడు సన్న్యాసి వేషము వేసికొని సీతయున్న చోటికి వేదము పఠించుచు వచ్చెను. ఇట్లు వచ్చి తన భర్త చాల దవ్వుపోయెనని చింతించుచు నెప్పుడు మగఁడు మఱఁది వత్తురాయని వారు పోయిన మార్గముఁ జూచుచు నుండు సీతను డాసి రావణుఁ డిట్లనియె. రమణీ! నీ వెవ్వతెవు? భీకరమృగములు రాక్షసులు సంచారము చేయు ఘోరకాంతారంబున నేల యొంటిగ నున్నదానవు? నీపేరేమి? ఎవ్వరిదానవు? ఇందలి యేనుఁగులను, బులులను, సింహంబులను జూచి నీవెట్లు భయపడకున్న దానవు? నీ సౌందర్యము ప్రాయముఁ జూచిన నాకు వెఱ్ఱి యెత్తినట్లగుచున్నది. నిజము చెప్పుము. నీవు దేవకాంతవా? యక్షచకోరాక్షివా? కిన్నర తరుణివా? మనుష్యకాంతలయం దిట్టి సుందరి నేనెన్నఁ డేనాటఁ జూచినది లేదు అని యడిగిన నతఁడు నిక్కపు సన్న్యాసి యని నిజము కుండిన శపించునని తలఁచి సీతాదేవి యిట్లు చెప్పఁదొడఁగెను.

### సీత రావణునకుఁ దన వృత్తాంతముఁ దెలుపుట

బ్రాహ్మణోత్తమా! నేను మానవకన్యను. విదేహరాజగు జనకుని పుత్రికను. ఆయోధ్యాధీశుఁడగు దశరథుకోడలను. నా పేరు సీత యందురు. శ్రీరాముని భార్యను. పదిరెండు సంవత్సరము లిక్ష్వాకులయింట నే కొఱఁతయులేక మనుష్యభోగము లనుభవించుచుంటిని. పదుమూఁడవ సంవత్సరమున నా మామగారు నా భర్తకుఁ బట్టాభిషేక మొనర్ప యత్నించెను. ఆ వార్తవిని యాయన మూఁడవ భార్య కైకేయి తన భర్తతో శ్రీరామునికి యౌవరాజ్య మిచ్చితివా నేను గూడుదినను నీళ్లు త్రావను. నిద్దురపోను. చావనైనఁ జచ్చెదను. అతనిని పదునాలుగుసంవత్సరము లడవికిఁ బంపుము. రాజ్యము నా కొడుకున కిమ్ము అని వితండవాదము సలిపెను. ఏమి చెప్పినను వినని యాలిమాట త్రోసి వేయఁజాలక దశరథరాజు తన పెద్దకుమారుని బిలిపించెను. అప్పుడు నా భర్త కిరువదియైదు సంవత్సరముల ప్రాయము. నేను భూమిమీఁదఁ బుట్టినది మొదలు నా కప్పటికిఁ బదునెనిమది యేఁడులు.

రుక్మిణి : సీతాదేవికిఁ బెండ్లినాఁటికి నా ఱేడులా?

తండ్రి : అవును. జనకునింటికి వచ్చినది మొద లాఱేఁడులు.

రుక్మిణి : భూమిలో నెన్ని యేండ్లుండెను?



తండ్రి : ఆఱు సంవత్సరము లందరు.

అమ్మణ్ణి : శ్రీరామునకో?

తండ్రి : పండ్రెండేఁడులు.

రాముఁడు: ఎటు చూచినను బాల్యవివాహమే.

అమ్మణ్ణి : అయిన లోకమేమి మునిఁగెను?

రుక్మిణి : క్షత్రియులందు స్త్రీలు పెద్దవారైన తరువాత వివాహము చేసికొన వచ్చునుగదా!

తండ్రి : చేసికొనవచ్చును. శకుంతలాదు లట్లు చేసికొనినవారే.

అమ్మణ్ణి : అటైన సీతాదేవి బాల్యమందే యేల వివాహము చేసికొనెను?

రుక్మిణి : దానికిఁ గారణము నేను జెప్పెదను. స్త్రీలు పెద్దవారైన తరువాత వివాహము చేసికొనిరేని దానివలన ననే కానర్థకములు జరుగుటకు మార్గములున్నవి. కాఁబట్టియే పెద్దవారైనపుడు వారి మనస్సు వక్రమార్గమునఁ బొంకుటకై చిన్నప్పటి నుండి వారి తల్లిదండ్రులు ధర్మములన్ని యుపదేశించుచు నాచారములు నేర్పుచు నీడు వచ్చిన తరువాత వెలుపలఁ దిరుగనీయక యింటిలోనే యుంచుచు నుండిరి. ధర్మమునందు మనస్సు నిలుకడఁ బొందిన కారణము చేతనే దమయంతి మొదలైన పుణ్యస్త్రీలు విషమ సమయములందును కామమునకు లోపడరైరి. అట్టులుండినను ఆ పద్ధతి విశేషము మంచిది గాదని దానిని దప్పించుటే బాగని లోకమునకుఁ దెలుప మార్గదర్శకులైన సీతారాము లట్లు చేసిరి. తండ్రి చేసిన వివాహమని రాముఁడు మెచ్చుకొనెనే యేల యనుకొంటివి. శకుంతలా వివాహము గుఱించి కణ్వుఁడు చెప్పినది మఱచితివా?

తండ్రి : అట్లు వచ్చిన శ్రీరాముఁ జూచి కైకరామా! నీవు రాజ్యము నాకొడుకున కిచ్చి జడలు ధరించి దండకారణ్యమునఁ బదునాలుగు సంవత్సరములు వసింప నిప్పుడే పొమ్ము. నీ తండ్రిని సత్యవాదిని సలుపు మనెను. విప్రవరా! నా భర్త యిచ్చువాఁడేకాని పుచ్చుకొనువాఁడు గాఁడు. సత్యమాడునే కాని యసత్యమాడఁడు. ఇవి నా పతి నియమములు. కావున సవతితల్లి మాటలు విని తథాస్తని

యరణ్యమునకై బయలుదేఱెను. ఆయనకుముందే నేను ప్రయాణమైతిని. రాముని మఱియొక సవతితల్లి కొడుకు లక్ష్మణుఁడును మా రక్షణమునకై మావెంట వచ్చెను. ఈ కారణముచే మేము మువ్వురము వనవాసము చేయుచున్నాము. ఇంచుకనే పిందుండుదువేని నా భర్త యిప్పుడే వచ్చును. వన్యఫలములఁ దెచ్చును. నీ కిచ్చును. నీవెవరు? నీవేల యొంటిగా దండక సంచరించెదవు. వివరింపు మనిన రావణుఁ డిట్లనియె.

## రావణుఁడు సీతతోఁ దన వృత్తాంతమునుఁ దెలుపుట

సీతా ! నేనెవ్వఁడనో నీ వెఱుఁగవుకదా? చెప్పెద వినుము. ఎవని పేరు విన్నమాత్రమున జగమంతయు గడగడవడఁకునో యెవనిపలుకు దేవమనుష్య యక్షాదిస్త్రీలకు గర్భనిర్భేదకరమో, యెవఁడు రాక్షసావళి కెల్లఁ బ్రభువో, యట్టి త్రిలోక విద్రావణుఁడగు రావణుఁడను నేనే. నిన్నుఁ జూచినది మొదలు నా భార్యలపై నేవగింత పుట్టుచున్నది. నే నెందఱనో పరస్త్రీలను బలాత్కారముగ హరించి నా యింట నుంచి యున్నాఁడను. వారికెల్ల నీవే రక్షకురాల వగుము. నాది లంకానగరము. అందు దివ్య సుందరమంది రాగ్రంబులందు హాయిగ నానందసాగరంబున నోలలాడుము. నీకే కొఱఁతయుఁ గలుగ నీను. నా రాజ్యమంతయు నీదిగనే భావింపుము.

ఉ. **అక్కడి భర్మహర్మ్యముల, నక్కడి సుందరనందనంబులం**
**దక్కడి సౌధ వీథికల, నక్కడి చారు విహార భూములన్**
**బెక్కువ మక్కువం జెలఁగి పెంపును సొంపురహింప నుండెదే**
**నిక్కడి భీకరాటవు లివేల రుచించును నీకు మోహినీ!**

నా భార్యవు నీవైతివేని నైదువేల యుత్తమకుల సంభూతల నీ సేవకై యర్పించెదను. లేలెమ్ము. వేవేగ రారమ్ము అనిన సీత కోపించి యిట్టు లనియె.

## సీత రావణు నిష్ఠురములు పలుకుట

ఓరీ! నా మనంబు తెఱంగెఱుఁగక కాఱులు ప్రేలెదవేల? నే నెవ్వతె నని నీవు తలంచితివి.



కం. **భూమీధ్ర మన నకంప్యుఁడు,**
**భూ_మరపతి, యుదధి నాఁగ నక్షోభ్యుఁడు, శ్రీ**
**రాముఁడు నాహృదయేశుఁడు**
**రామానువ్రతను నేను రాక్షసరాజా!**

కం. **శ్రీమహిత లక్షణుఁడు వట**
**భూమిజపరిమండలుండు, పురుతేజుఁడు స**
**త్యామితరక్తుఁడు, రాముఁడు**
**రామానువ్రతనునేను రాక్షసరాజా!**

కం. **రాముఁడు నరకేసరి, సిం**
**హామితవిక్రాంతగామి, హరితుల్యుఁడు, తే**
**జోమేదుర భుజవక్షుఁడు,**
**రానూనువ్రతను నేను రాక్షసరాజా!**

ఉ. **చెన్నఁటి నక్క వీవు, నను సింహి సుదుర్లభఁ గోరువాఁడవా?**
**నన్ను ఖరాంశుదీధితిని నా స్పృశియింపఁగ నీకు శక్యమా?**
**యిన్నెఱి రామచంద్రుహృదయేశ్వరిఁ గోరుట మందభాగ్యుఁడా?**
**కన్నులనిప్డె కాంచెదవు కాంచనవృక్షచయంబు రాక్షసా!**

చం. **పటుతర కాలకూటవిషపానము చేసియు సౌఖ్యరీతిఁ గో**
**రుట శితసూచి కాగ్రములఁ గ్రొవ్వున లోచనమార్జనంబు సే**
**యుట పెనుబండ కంఠముననుండఁగ నంబుధిదాఁట నెంచుటల్**
**చటుల పరాక్రమప్రకట సత్త్వ రఘూత్తముభార్యఁ గోరుటల్.**

కం. **కాలాయసశూలాగ్రము**
**పైలాఁగులు వేయఁ గనుట, ప్రజ్వలితాగ్నిన్**
**జేలాగ్రంబున ముడుచుట,**
**నాలుకనసి నాకుటగును నను నీ కొనుటల్.**

చం. **హరిమృగ ధూర్తకంబులకు, నంబుధికుల్యలకున్ విహంగరా**
**ద్వరపికవర్ధనంబులకు, వారణమూషక బర్హిమద్గులన్**
**బరమ సురాగ్ర్యకుంజల విభాసితచందన పంకవారులన్**
**బరఁగెడు నంతరంబె రఘువర్యునకున్ వినునీకు రావణా!**

రాక్షసాధమా! నన్ను నీవేమిగ! దలంచితివి. ఇదియొక యబల. దిక్కు లేక యొంటరిగఁ జిక్కినది. నేను జెప్పినట్టు వినక యెట్లు తప్పించుకొనఁగలదని తలంచితివా? మూఢుఁడా! నేను రాముని భార్య నగుట యెఱుఁగవా? బ్రహ్మాండభాండము లన్నియు నొక్కటై దండెత్తివచ్చినను దండధర భీషణుండై కోదండదండధరుండై కాండ ప్రకాండంబులఁ జించి చెండాడు రాఘవుండు నాకు నాథుండై యుండ నీ వలన నాకేభయము గలుగనేరదు. ఒకవేళ నన్ను దుర్బలకాయను నీవు హించినను మక్షికము గలసిన యాజ్యముగా నన్నుఁ దలంపుము. నీతి మాలిన చేఁతలకు లోనై లోకముచేనానారీతుల రోఁతలఁ బడలనేల? యని పరుసంబులు పలుకుచు నతఁ డేమి చేయునో యను భీతి నోరుగాలికి నరఁటిచెట్టువలె నడఁకు సీతంగని యామెను భయపెట్టఁ దలఁచి బిభృషికోక్తుల నిటలతటంబున చలించు భ్రూకుటితో యాతఁడిట్లు లనియె.

## సీతను రావణుఁడు బెదరించుట

కోమలీ! నన్ను నీవేమిగఁ దలంచితివి? లక్ష్యము లేక వదరుచున్నావు. నేనెవ్వఁడ ననుకొంటివి. శంకరమిత్రుఁడునుఉత్తర దిక్కధిపతియు నగు కుబేరునకుఁ దమ్ముఁడను. దేవమనుష్యాదుల నెల్లఁ బెక్కు మార్లుక్కు మడఁచిన యుక్కరిని. నా ధాటికి దండధరుండు గుండెలు పగిలి దండంబు పెట్టిపోయెను. కుబేరుఁడు రణరంగమున నోడి పుష్పకవిమానమును గోలుపోయి పాఱెను. నా పేరనిని సూర్యుఁడు ప్రకాశింపఁడు. సదాగతి చలింపదు. నేను నిలిచిన చోటఁ జెట్టాకైన నాడదు. ఏఱైనను బాఱదు.

**సీ.** **క్రూరులై భీకరాకారులై వెలసిన**
**రాకాసిజనులచే జోకఁ గూడి**
**పూర్ణమై ప్రాకారకీర్ణమై కాంచన**
**కక్ష్యావితతుల సంలక్ష్యమగుచు**
**వారణాదుల మణితోరణాదులఁ బొల్చి**
**దూర్యనినాద గాంభీర్యమగుచు**
**నుద్యానవర శోభితోద్యాన సర్వర్తు**
**మానఫలావళీస్థాన మగుచు**

**గీ.** **మత్పురము పొల్చు సాగరమధ్యమునను**
**శక్రపురితుల్యమగుచు నిర్వక్రమవిభవ**



**మలర లంకాఖ్యపట్టన మలరుఁబోణి**
**కానఁగా రమ్ము కన్నులకఱవు దీఱ.**

**తే.** **అందు నాతోడ నీవు సానంద వగుచు**
**మందగమనరో! క్రీడల నుందువేని**
**దెందమునయందుఁ దలఁపఁగఁ గందె మనుజ**
**సుందరీబృందముల నోసి కుందరదన !**

సీతా : నా లంకాపురంబునఁ గల యైశ్వర్య విశేషంబును నచ్చటి భోగంబులనుమరగిన పిమ్మట నీవు క్షీణాయువును, హీనుఁడును, దుర్బలుఁడును, నిర్భాగ్యుఁడు నగు రాముని గీమునిఁ దలఁపనైనఁ దలఁతువా? నీ పుట్టినింటఁగాని నీ భర్త యింటఁగాని యట్టి యైశ్వర్యమును గలలోనైనఁ గాంచి యుండవు. నా మగఁడు నా మగఁడని యేమో గర్వించి పలికెదవు. తన గారాబు కుమారునకు రాజ్యమిచ్చి యడవులకుఁ బొమ్మని మెడపట్టి తండ్రి నెట్టించిన దుర్బలుఁడై సిగ్గుమాలి యడవులలో నల్లాడు రాముఁడఁట! పెద్ద పౌరుషశాలియఁట! బలఢ్యుఁడఁట! అట్టి రాజ్య భ్రష్టుని, వనచారిని, దరిద్రుని, కట్టుకొని యీ యడవులలో నేల యేడ్చెదవు? నీ యట్టి దాని కిట్టిచేతఁ దగునా? నీ సుఖ మాలోచించుకొనుము. నీ యదృష్టము చక్కఁగఁ బండిన కారణముచే నేను నీ కడకు వచ్చితిని. నీ భాగ్యదేవతయే నన్నిటకుఁ దోడితెచ్చెను. నిర్భాగ్యురాలవై నన్నిపుడు కావరమునఁ బోనాడు కొంటివా వెనుక మిగుల దుఃఖించెదవు. నా యట్టి పురుషుఁడు నీకు లభింపఁడు. నా మాట నమ్ముము అని వదరుచున్న రావణుఁ జూచి సీత కోప రక్తనయనయై.

**ఉ.** **ఏమిర యక్షగుహ్యక గణేశ్వరుఁడై మఱి భూతవంద్యుఁడై**
**ధీమహితాత్ముఁ డౌధనదదేవుని తమ్ముఁడ వౌచునా యఘం**
**బీమెయిఁ జేయఁ బూనితి విసీ యజితేంద్రియ బుద్ధిహీనునిన్**
**భూమిపుఁగాఁగ బొంది పోరి పోదు రవశ్యము సర్వరాక్షసుల్.**

ఓరీ కులనాశకుఁడా! పాలసముద్రమున విషముఁ బుట్టినట్లు బ్రహ్మవంశమున నీవెట్లు పుట్టితివిరా? సాలగ్రామ ఖనియందు జాత్యల్ప పాషాణములును బుట్టును గదా? కుబేరుని తమ్ముఁడనని సిగ్గులేక చెప్పుకొనుటకు

నీకు నోరెట్లాడెరా? పాపాత్ముఁడా! సద్వంశముల కపకీర్తి దెచ్చు నీచులు నీ యట్టి వారే కదా. తానుజేయు కార్యమువలని ఫలము నాలోచింపని వాఁడొక మనుష్యుఁడా? అట్టి వానికిని బసరమునకు నేమి భేదము? ఇంద్రుని భార్యను బౌలోమిని హరించియైనఁ గొన్నిదినములు బ్రదుకుదు వేమోకాని రాముభార్యను నన్ను హరించిన నీకు నూఁతేండ్లిప్పుడే నిండవా? ఓరీ భ్రష్టా! యిట్టి తుచ్ఛ కార్యమొనర్పఁ దల పెట్టకుము. పరాంగనాహరణము దుష్కీర్తికి కారణము. వంశనాశనమునకు హేతువు. నరకావాసమునకు మూలము. ఆయువు క్షీణించుటకు నిదానము. నా బుద్ధి విని మరలిపొమ్ము అనిన రావణుఁడు కోపంబునఁ గటము లదర భ్రూకుటి ముడివడఁ బటపట పండ్లు కొఱుకుచు, భుజము లప్పళించుచు నెఱ్ఱని కనుగుడ్లు ద్రిప్పుచు హుంకరించుచుఁ గోఱలు వెలివడఁ దన పదితలలు నిరువది చేతులతోడి రూప మామెకుఁ గనఁ బఱచి మేఘ ముఱిమి నట్లిట్లు పలికెను.

### రావణుఁడు సీత నపహరించుట

**మ.** **వినవే సీత! భవత్సమాన విభునిన్ విశ్వత్రయీ ఖ్యాతునిన్**
**గనఁగాఁ గోరెదవేనినన్గలయుమీ కల్యాణి! శ్లాఘ్యుండ నే**
**ననురక్తుండను, నీకు నప్రియముఁ జేయంబోవ నెన్నండు,**
**మనుజుఁ వీడుము గూడు నన్ను దనుజుఁ మాంగల్యసంధాత్రివై**

**ఉ.** **ఏమిని మోహముంచితివె? యేమిగుణంబులఁ జూచిమెచ్చితే**
**యోమతిహీనురాల! యొక యుగ్మలి మాటను బట్టి రాజ్యమున్**
**భామ! సుహృజ్జనంబులను బాయుచు వ్యాలనిషేవితాటవిన్**
**దీమసమేది క్రుమ్మెరెడి దీనునిఁ బండితమానినీమమణి!**

అని కర్ణకఠోరంబుగఁ బలికి తడిసినఁ గార్యంబు చెడునని త్వరపడి బుధుఁడు రోహిణిని బట్టినట్లు పైబడి జానిక శిరోజముల నెడమచేతను రెండుతొడల నొకచేతను గదియఁబట్టి యెత్తికని శీఘ్రగతింబోయి సారథి తెచ్చియుంచిన తేరిపై నెక్కి భయంకరోక్తుల సీతను బెదిరించుచు సకలభూతంబులు తన్నుఁ జూచి మృత్యువును జూచినట్లు భయపడి పరువెత్తుచుండ నాకాశమార్గంబునఁ బోవఁ జొచ్చెను.





రావణుఁడు సీత నెత్తికొనిపోవుట

### సీతాదేవి రామలక్ష్మణులఁ బేర్కొని యేడ్చుట

సీతాదేవియు మూర్ఛ దేఱి రాక్షసుని పట్టు విడిపించుకొన లేక హా లక్ష్మణా! హా రామా! నన్ను రాక్షసుఁడు బలాత్కారముగఁ బట్టి యెత్తుకొని పోవుచున్నాఁడు. వేగవచ్చి నన్ను విడిపింపరేకావరే యని యఱచుచు రావణుని దూఱుచు, భూతావళికి నమస్కరించుచు, బోవుచు నొక చెట్టుమీఁదఁ గూర్చున్న జటాయువుం జూచి "అయ్యా!జటాయూ! నేను సీతను. రాముని భార్యను. నన్నీ రాక్షసుఁడు బలాత్కారముగఁ గొనిపోవుచున్నాఁడు. నా గతిఁ జూడుము. నీవు ముసలివాఁడవు. వీనితోఁ బోరాడలేవు. తటుకునఁ బోయి రామలక్ష్మణులఁ దోడి తెమ్ము. గృధ్రరాజా! నీకు నమస్కరించెదను అని హోయని యేడ్చెను. జటాయువు కన్నులు దెఱచి యాకాశమువంకఁ జూచి కోపరక్త నయనుండై చివాలున మింటి కెగిరి రావణు తేరికి సడ్డమై వానితో నిట్లనియె.

అమ్మణ్ణి : రామా యని ముందు సీత తన భర్తను బిలువక లక్ష్మణు నేల పిలిచెను.

తండ్రి : లక్ష్మణుఁడు కొంచెము సేపునకు ముందు పోయిన వాఁడు గదా. ఆయన సమీపమందే యుండునని యాయనను బిలిచెను.

అమ్మణ్ణి : సీతాదేవి యింతదూర మాలోచించిన దనుకొనలేదు. నీవు పొరపాటుఁన జెప్పితి వనుకొంటిని.

తండ్రి : హెచ్చరికతో వినుఁడని ముందే చెప్పితినిగదా. ఇట్టివి యింతకు ముందు గొన్ని కలవు. ఇంకను గొన్ని వచ్చును. జాగ్రత్త.

## జటాయువు రావణునితోఁ బోరుట

ఓ రాక్షసేశ్వరా! తుదకు నీ కెట్టి దుర్బుద్ధి పుట్టెను? సర్వలోక పూజ్యురాలగు సీతాదేవి నా హరియింపఁ బూనితివి? వినాశకాలమునఁ బుట్టు విపరీతబుద్ధి యిట్టిదే కదా?

సీ. ఆలోకనాథు నిల్లాలు యశస్విని
సీతను హరియింపఁ జెల్లు నటర?
ధర్మతత్పరుఁడైన ధారిణీపతికిని
బరదారహరణంబు భావ్యమటర?
దానిలో విను రాజదార ముఖ్యంబుగఁ
గాపాడఁ దగు నంట గానవటర?
పరదారమర్శన భావంబు నీచంబు
ధీరగర్హిత మౌట తెలియవటర?

ఆ. నీకు బుద్ధిగాదు నీరజలోచనఁ
గొంచుఁ బోకు విడువు క్రూరచరిత!
యాత్మదార రక్ష్యయగు రీతిఁ బరసతుల్
రక్ష్యలనుచుఁ దలఁపు ప్రాజ్ఞతతికి.

ఓరి దురాత్ముఁడా! ప్రజలను ధర్మమార్గమునం దుంచవలసిన రాజులే యధర్మమార్గమందుఁ జరించువారేని యిఁకఁ బ్రజల ననేల? దుశ్శీలా! నీ భార్యను మఱియొకఁ డపహరించిన నీ కెట్టులుండునో తలఁపవలదా? శీలము స్త్రీ సామాన్య ధర్మమని యెఱిఁగి ప్రతి మనుష్యుఁడు తన భార్య శీలమువలెనే



యితర స్త్రీల శీలమును రక్షింపవలయును. ధర్మవిరుద్ధ పద్ధతి నార్జించు నర్థకామములను బుద్ధిమంతులు గర్హింతురు. ఓరీ! నా మాటలు కాలము సమీపించిన నీకు రుచించునా?

కం. పుట్టఁగ వచ్చిన గుణములు
కట్టెలతోఁ గానిపోసె కలుషాత్ములకున్
గట్టిగఁ జెప్పిన బుద్ధులు
పట్టునె మనమునకు? నిలువఁబడునే తిరమై?

ఓరీ! నీకు రాముఁ డేనాఁడైన నే విషయంబునం దైన నెగ్గాచరించి యుండెనా? నిష్కారణ విరోధము నీకేల? బలవంతునితో విరోధించుటెట్టి నీతి? సీతాదేవిని స్త్రీయని తలంచితివి కాఁబోలు. ఈమె నిన్నుఁ వధింపఁగల విషభీకర భుజంగి. నీ కంఠమునందలి యమపాశము. నీనెత్తి పిడుగు. నీపాలి కాళరాత్రి. రావణా!

కం. మోవఁగల యంత భారమె
మోవం దలకొనఁగ వలయు; మొగి రోగముఁ దే
కే వస్తువెంత యఱగునో
యా వస్తువు నంతె తినుట యర్హము కుమతీ!

ఇప్పుడు నా కఱువదివేల యేండ్ల ప్రాయము. నీవా వయస్సున నున్న వాఁడవు. బలవంతుఁడవు. సాయుధుఁడవు. విల్లుబాణములు కవచము ఖడ్గము లోనగు పరికరము లన్నియుఁ గలవాఁడవు. నేనా నిరాయుధుఁడను. అట్లుండియు నీవు నన్ను మీఱి పోలేవు అని యేమి చెప్పినను వాఁడు వినక చావుపరువునఁ బోవుచుండ జటాయు వడ్డమై,

మ. వినరా నామెయిఁ బ్రాణముల్ గలుగఁ బృథ్వీకన్యకన్ జానకిన్
వనజాతాయత పత్రనేత్రను రఘుస్వామీష్టచిత్తేశ్వరిన్
గొనిపోనీ నిదె ప్రాణగొడ్డమయినన్ గూర్తుం బ్రియం బా మహా
త్మునకున్ రాముని కాజికిన్ వెలయుదున్ దుర్వార విక్రాంతిచేన్.

ఉ. పోకుర పోకు నిల్వునిలు పోఁగల వెందిఁక బంక్తికంఠ! నిన్
దీకొని విక్రమంబు కొలఁదిన్ సమకూర్తు రణాతి థేయమున్
జోక గ్రహింపుమీ కనుమి శూరత నిన్నె రథంబునుండి య
స్తోకజపంబునన్ ధరిణిఁ ద్రోయుచు వృంతమునుండి పండనన్.

అని ఘోరరణమొనర్చి వానివింటిని ద్రుంచి యంబుల పొదులు నేలం గూల్చి కవచము చించి సారథిని జంపి తేరిని విఱిచి రావణునెత్తిపైం గూర్చుండి వెండ్రుకల నన్నిటిని నూడంబెఱికి తలల నన్నిటిని ముక్కుతోం ద్రుంచి వైచెను. రావణుండును ఒకచేత సీతను గట్టిగా నదిమి పట్టుకొని యుద్ధముచేసియు జటాయు బలపరాక్రమముల సహింపలేక నేలంబడి సీత నొకచోట నుంచి కత్తి యెత్తికొని పక్షిరాజుతోం బోరాడి ముసలివాండై యలసి జవసత్త్వము లుడిగిన యతని పైంబడి ఱెక్కలు కాళ్ళు నఱకెను. జటాయువును గొఱ యూపిరితో నెత్తురు గ్రక్కుచుం గ్రిందంబడి యుండెను. సీతయును జటాయువునకు వచ్చిన దుర్దశ చూచి యతనిని గౌంగిలించికొని యేడ్చి రావణుండు తన్నుం బట్టుకొన రాంగాం బరువెత్తి యొక వృక్షమును గౌంగిలించుకొనెను. రావణుండును వెంటనే పరువెత్తి తలవెండ్రుకలు పట్టి లాగి యామెను జంక నిఱికించుకొని యామె యెలుంగెత్తి యేడ్చుచుండ మింటి కెగసి తివ్వన దక్షిణ దిక్కుపట్టి పోవుచుండెను.

రుక్మిణి : మారీచుం డఱచిన సీతాలక్ష్మణులకు వినంబడెను గదా. సీత యేడ్చిన రామలక్ష్మణుల కేల వినంబడలేదు? జటాయువున కెట్లు వినంబడెను?

తండ్రి : మీ యద్దప్రశ్నలతోనే కాలహరణ మగుచున్నది. మారీచుం డఱచి నంత గట్టిగా సీత యఱవంగలదా? అదిగాక రాముని యాశ్రమము చుట్టు కొండలు. మారీచుండు రాముని నుత్తరముగాం దీసికొని కొండ కా వైపునకుం బోయెను. జటాయువు త్రోవలో నెత్తైన చెట్టున నుండినాండు. గ్రద్దలకు దృష్టిబల మెక్కువ. ఆకాశమున నెగురుచు భూమిమీంది సన్నపురుగులను గూడం జూడంగలవు. ఆ కారణముచే జటాయువునకు సీత యేడ్పు వినవచ్చెను. ఆమె కానవచ్చెను. రామలక్ష్మణులు కొండమఱుంగున నుండుటచేతను రావణుండు మాయచే మేఘములు గల్పించుకొని వానిచాటున దక్షిణముగం బోవుటచేతను రామలక్ష్మణులకు సీత యేడుపు వినరాలేదు. ఆమె కనంబడలేదు.

ఇట్లు కొంతదూరము పోవ పంపాతీరంబున ఋష్యమూకమను నొక కొండమీంద నైదుగురు వానరులండం జూచి వీరైన రామునితోం దన వార్తను జెప్పుదురుగాక యని రామా రామా లక్ష్మణా యని యేడ్చుచుం దన దేహము మీంద నొక్క ప్రక్కనున్న కొన్ని సొమ్ములొలిచి తాను గట్టిన సరిగ పట్టు చీరకొంగు





సీత తన సొమ్ములమూటను వానరులయొద్ద వైచుట

చించి యందు ముడివైచి వారు చూచుచుండ వారిముందరం బడవైచెను. వారు దానిని బదిల పఱచియుంచిరి. ఎక్కడ రామలక్ష్మణులు వత్తురో యను ప్రాణభీతిం బరువెత్తుచున్నవాండగుటచే రావణుం డామె చేసిన పని యెఱుంగండు. ఇట్లు పోయిపోయి సముద్రము దాంటి యప్పటికి గండము తప్పి లంకలో జొరంబడి యంతఃపురంబునకు సీతాదేవిని దీసికొని పోయి యక్కడ దించెను.

కృష్ణుండు : దేవతలు ధర్మమును రక్షింపవలసిన వారుకదా? అట్లుండ దేవేంద్రుండు బ్రాహ్మణకుమారుని తపస్సుచెఱుచుటకై కత్తి యిచ్చెనే. అట్లు చేయుట ధర్మమా?

తండ్రి : నే నడిగిన ప్రశ్నల కుత్తరమిమ్ము. ఇప్పుడు నీవే తరగతి యందుం జదువుచున్నావు?

కృష్ణుండు : నాలుగవతరగతియందు.

తం(డ్రి : ఐదవతరగతికి నీవు పోవలయుననిన నేమి చేయవలయును?

కృష్ణు : నేను జేయునది యేమున్నది? ఈ తరగతికి నేర్పాటైన పాఠములను బాగుగఁ జదువవలయును. పరీక్షలయం దాపాఠములలో నడిగిన ప్రశ్నములకు సరియైన ప్రత్యుత్తరము లిచ్చిన రావలసినన్ని గుణకములు వచ్చెనా ప్రధానోపాధ్యాయుఁడే నన్నుఁ బై తరగతికిఁ బంపును. నేనీ తరగతి పాఠములు బాగుగఁ జదువవలసినది తప్ప నేను జేయవలసిన దేమియు లేదు.

తం(డ్రి : ఈ పాఠశాలవారు నిన్నుఁ బై తరగతిదకిఁ బంపలే దని నీవు మఱియొక పాఠశాలకుఁ బోయి హెచ్చుతరగతిలోఁ జేరఁగోరిన నచ్చటివా రేమిచేయుదురు?

కృష్ణుఁడు : నన్నుఁ బరీక్షింతురు. అర్హుఁడనని తోఁచిన గ్రహింతురు. లేకుండిన నింటికిఁ బొమ్మందురు.

తం(డ్రి : నీ మీఁద వారికిఁ బగయుండి యట్లు చెప్పుదురా?

కృష్ణుఁడు : నామీఁద వారి కేమిపగ? వారెవరో నే నెవరో?

తం(డ్రి : నిన్నుఁ బైతరగతికి వేయలేదని వారు దుష్టులని నీవు చదువుకొని వృద్ధికి రావలయునని యుండిన వారు విఘ్నపఱతురని దూషింతునా?

కృష్ణుఁడు : దూషింపను. మరల నీ తరగతి పాఠములనే బాగుగఁ జదువుదును.

తం(డ్రి : నాలుగవ తరతియందున్న వాఁడవు గదా నీ వీ తరగతి నుండియె యెనిమిదవ తరగతికిఁ బోవలయునని చదువఁ బూనిన నేమగుదువు?

కృష్ణుఁడు : క్రమక్రమముగఁ బోవలయును. అటు గాకపోయిన చదువని నీ కారణముచే పాఠములు రావు. గ్రహించుటకు శక్తి లేక పై తరగతుల పాఠములు రావు. ఈ తరగతి పాఠములు వచ్చువఱ కెన్ని యేండ్లైన నిందే యుండవలయును. వీనిని మఱచితినా క్రింది తరగతులకుఁ బంపుదురు.

తం(డ్రి : బుద్ధిమంతుఁడవే. ఇఁకఁ గొన్ని ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము లిమ్ము. తపస్సు చేయుట నేల?



కృష్ణుఁడు : మోక్షము కొఱకు.

తం(డ్రి : ఎట్టివారు మోక్షమున కర్హులు?

కృష్ణుఁడు : పాపము లేనివారు.

తం(డ్రి : కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, అసత్యము లాడుట, హింస చేయుట, దయలేకుండుట, శుచి రుచి వేళ యెఱుంగక యేదైనఁ దినుట, ఒకరిని దిట్టుట, మత్తుపదార్థములు తినుట, యిట్టి వన్నియుఁ బుణ్యములా పాపములా?

కృష్ణుఁడు : పాపములే.

తం(డ్రి : ఇవి కలవాఁడు మోక్షమున కర్హుఁడా?

కృష్ణుఁడు : కాఁడు.

తం(డ్రి : ఒకఁడు దేవునిఁ గూర్చి నాకు మోక్షము కావలయునని ప్రార్థించు చుండిన దేవుఁ డేమి చేయవలయును?

కృష్ణుఁడు : వానియం దీపాపములు కలవో లేవో పరీక్షించి దోషము లేదని తెలిసిన మోక్ష మీయవలయును.

తం(డ్రి : దేవుఁడు తానే పరీక్ష చేయవలయునా? తన క్రింది యధికారులతోఁ జెప్పి చేయింపవచ్చునా?

కృష్ణుఁడు : అధికారులకుఁ జెప్పి చేయింపవచ్చును. మా పాఠశాలలో మాత్రము ప్రధానోపాధ్యాయుఁడే పరీక్షలన్ని చేయుచున్నాఁడా యేమి?

తం(డ్రి : ఇప్పుడు నీ వడిగిన బ్రాహ్మణకుమారుని విషయముఁ జెప్పుము. వీనియందు దయాగుణ మున్నదా లేదాయని యింద్రుఁడు పరీక్షించుట ఒప్పాతప్పా?

కృష్ణుఁడు : ఒప్పే. అయినను వాఁడు బ్రాహ్మణుఁడు కదా. వాఁడు తపస్సు చేయవచ్చును గదా?

తం(డ్రి : విను. మీరు ప్రవేశ పరీక్షకుఁ బోవుటకు తరగతు లెట్లున్నవో యట్లే యొక జీవి మనుష్యుఁడుగాఁ బుట్టిన తరువాతఁ గ్రమముగ నెనిమిది తరగతులలోఁ గృతార్థుఁడు కావలయును. పరీక్షలయందుఁ గడతేఱి

యుద్యోగమునఁ బ్రవేశించుటకు నాంగ్లభాషను బ్రధానముగ నెట్లు పఠించుచున్నారో యట్లే యన్ని తరగతులవారును 'సేవ' యను దానినిసాధింపవలయు. జీవులు తరించుటకు భగవంతుఁడు సేవ యను దానిని ప్రధానసాధనముగా నేర్పఱిచి యున్నాఁడు. అక్షరములతోఁ బ్రారంభించి యొక్కక్క తరగతికంటెఁ బై తరగతి యందు భాషావిషయము నెట్లు ఎక్కువగ మీరు నేర్చుకొనుచున్నారో యట్లే తరగతి కొలఁది సేవయందును గల నానాభాగములను గ్రమ క్రమముగ మనుష్యులు నేర్చుకొనవలయును. దీనిని మీకు సంగ్రహముగ విశద పఱిచెదను. ప్రపంచమంతయుఁ జరమని అచమని రెండు విధములు. చరములనఁగాఁ దిరుగునవి పురుగులు, పశువులు, పక్షులు, మృగములు, మనుష్యులు లోనగునవి. అచరము లనఁగాఁ దమంత దిరుగ లేనివి లోహములు, కొండలు, రాళ్లు మొదలైనవి. ఇన్నిటి యందు జీవమనునది యున్నది కాని లేకుండఁ బోలేదు. ఇన్నిటియందును అధమాధమము, అధమము, మధ్యమము, ఉత్తమము లోనగు భేదము లున్నవి. ఱాలలో గులకరాతికి రత్నమునకు నెంత భేదమున్నది? లోహములలో నినుమునకు బంగారమునకు నెంత భేదమున్నది? పశువులలో పందికి ఆవునకు నెంత భేదమున్నది? చెట్లలోఁ దృణమునకు మఱ్ఱిచెట్టున కెంత భేదమున్నది? ఇట్లే యన్నిటియందుఁ దారతమ్యమున్నది. ఈ భేదము లేల కలిగెనో యాలోచింపుఁడు. తొలుత ఱాలుగా నున్నవి వాని పుణ్యము కొలఁది చెట్లుగాఁ బుట్టును. చెట్లుగా నుండునవి వాని పుణ్యము కొలఁది పక్షులుఁగా బుట్టును. పక్షులుగా నుండునవి యట్లే మృగములుగాఁ బుట్టును. మృగములుగా నుండునవి యధమాధమ మనుష్యులుగా జనించును. అధమాధమ మనుష్యులు అధమ మనుష్యులగుదురు. అధములు మధ్యములగుదురు. మధ్యములు క్రమము నుత్తము లగుదురు. ఈ ప్రకారము నేఁడు ఱాయిగ నుండునది పుణ్య మతిశయించు కొలఁది యెన్నికోట్ల సంవత్సరములకైన మనుష్యుఁడుగాఁ బుట్టును గాని పుట్టకపోదు. ఇన్నిటియందును సామాన్యముగ నుండు పుణ్యము సేవ యనునదే. ఱాలు, చెట్లు ఏమి పుణ్యము చేయఁ గలవు? ఏమి సేవ చేయఁగల వని తలఁపవలదు. ఒక పుణ్యాత్ముఁడు ఎండచే నలసి



సొటసొటలాడుచు నొక చెట్టు నీడకుఁ బోయినపుడు వాని ప్రాణముమెంత సుఖించును? ఈ విధముగఁ జెట్టు ఆ మనుష్యునకు సేవ యొనర్చును గదా. వానివలన ఆ చెట్టు ప్రతిఫలము గోరెనా? ఈ విధముగ మనుష్యులకు మృగములకు నీడ నీయఁ గలిగినవి నీడ నిచ్చి ఫలముల నీయఁ గలిగినవి ఫలముల నిచ్చి సేవ చేసి పుణ్యము సంపాదించును. అట్టులే మృగములును. ఒక యావు తన పాలచేత నెందఱ కుపకార మొనర్చుచున్నది? ఈ విధముగ నది మనుష్యసేవ చేసి యేమి ప్రతిఫలము పొందుచున్నది? గడ్డి. అదియైనను నీవు దాని నింటఁ గట్టి యుంచుటచే నీవై యిచ్చిన గ్రహించునుగా నిన్నుఁ బీడించునా? దీనిని పొలమునకుఁ బోనీయకుండిన ఆ దోషము నీదే. ఈ విధముగ నన్నియుఁ బ్రతిఫల మపేక్షింపక, యపేక్షించినను దేహరక్షణార్థ మెంత కావలయునో యంత మాత్రమే కోరుచు సేవ చేయుచున్నవి. మనుష్యుల తరగతికి వచ్చువఱకు నన్నియు స్వభావముగనే సేవ చేయుచున్నది. మనుష్యుల తరగతికి వచ్చునప్పటికి వారికి జ్ఞానమనునది యొకటి భగవంతుఁ డనుగ్రహించెను. జ్ఞానమనఁగా నేమనెదవా? ఒక గాడిదను ఎండలోఁ గట్టియుంచితివనుకో. అది నీవై మరల నిప్పువఱ కట్టులే యుండునుగాని నన్నేల యీ మనుష్యుఁ డెండలోఁ గట్టవేసెను? నేనేల నీడకుఁ బోరాదు? ఈ యెండలో నుండుటచే నా కేదైన రోగము వచ్చునేమో? అప్పుడు నేనేమి చేయవలయును? అని యాలోచించు శక్తి దానికి లేదు. ఒక పసరము త్రోవలోఁ బోవునపుడు తిను పదార్థమును జూచెనా దానిలో మూతి పెట్టును. నీవు కొట్టితివా దెబ్బతిని యప్పటికిఁ దొలఁగి పోవును. అదే పసరమే మరల వచ్చునపుడును దానిలో మూతిపెట్టి దెబ్బ తినునే కాని, యింతకుముందు దీనిలో మూతిపెట్టిన వీరు కొట్టిరి గదా మరల మూతి పెట్టినఁ గొట్టుదురేమో యను తెలివి దానికి లేదు. ఇట్టు లాలోచించు తెలివికే జ్ఞానమని పేరు. జ్ఞానము లేని మనుష్యులు పశువులతో సమానులు. ఆహారము నిద్ర భయము ఇవిపశువులకు మనుష్యులకు సమానములు. క్షుద్రమనుష్యుల విషయము పోనిండు. భగవద్గీతలో మీరు శూద్రునకుఁ బరిచర్య స్వభావధర్మమని వింటిరి

గదా. జ్ఞానముగల మనుష్యులలోఁ దక్కువ తరగతివారు శూద్రులు. ఇందు తరతమ భేదములు పెక్కులుండుట మఱవవలదు. వారేవిధముగఁ గడ తేఱవలయును. ఆది నుండి వచ్చిన సేవచేతనే. కావున వీరు తక్కిన యన్నిజీవులకు సేవ చేయవలయును. ప్రతిఫల మపేక్షింపరాదు. తమ సుఖజీవనమున నెంత కావలయునో యంత మాత్రము గ్రహింపవచ్చును. ఈ సేవయందుఁ గల గొప్పగొప్ప గుణములను మీరు చక్కఁగ నాలోచింప వలయును. నీవు మఱియొకని యొద్దకుఁ బోయి సేవచేయ వలయు ననిన నీవేమి తలంతువు? నేనొకరికి సేవ చేయుదునా? యని యహంభావము వహింతువు. అహంభావ మనఁగా నేను గొప్పవాఁడను. అందఱు మనుష్యుల వంటి వాఁడనే కదా నేనును. వారెక్కువయేమి? నేను దక్కువ యేమి? యని గర్వించుట. నీ వెప్పు డితరులకు సేవ చేయఁ బూనితివో తొలుత నీకు గర్భశత్రువైన యహంకారమును జంపుదువు. నూరు దేశములను జయించుటకంటె అహంకారమును జయించుట కష్టము. అహంకారమును నీ వణఁచినను ఆశకుఁ బాలై సేవ చేసితివా పొగలో నుండి సెగలోనికి పోయినట్టె యగును. కావున ఆశకు లోపడక సేవ చేయవలయును. ఈ సేవయే తనకంటెఁ దక్కువవానికి జేయునపుడు ప్రేమ యను గొప్పగుణము కలిగించును. ఈ విధముగాఁ బ్రతిఫల మపేక్షింపక దురాశకుఁ బాల్పడక శూద్రుఁడు సేవ చేయవలయును. ఈ పరీక్షయందు వీఁడు కడతేఱెనా అధమాధమ వైశ్యుఁడుగఁ బుట్టును. సేద్యము గోరక్షణము వాణిస్యము ఇవి వైశ్యునకు స్వభావ ధర్మములు. పూర్వపు శూద్రజన్మ మందుఁ దా నభ్యసించిన సేవాధర్మమునే యిందును మఱియొక విధముగ నభ్యసింపవలయును. కృషి చేసి ధాన్యము పండించుట చేతను, దాని నితర దేశమునకుఁ గొనిపోయి విక్రయించుటచేతను, ఆ దేశమునఁ బండిన దానిని తమ దేశమునకుఁ దెచ్చి యిచ్చటివారికి విక్రయించుట చేతను, ఇవి మోసికొని పోవు నెద్దులను పశువులను భరించుట చేత వైశ్యుఁ డెన్ని జీవుల కుపకారము చేసినవాఁ డగు చున్నాఁడో చూచితిరా? ఇందును అహంకారమునకు, దురాశకును దుష్కామమునకును బాలుపడరాదు. ఈ కార్యము లన్నియుఁ జేయుట కెంత ధనము కావలయునో యంత ధనము వాఁడు సేకరింప



వచ్చును. పూర్వజన్మమం దభివృద్ధిచేసిన దయాగుణము బీదసాదలకు దానము చేయుట యందును, ధర్మకార్యములు చేయుటయందును దోడుపడును. క్రయవిక్రయములందు మోసము కారాదు. కావున నీ విధముగ వర్తించు వైశ్యుఁడును లోకసేవ చేసిన వాఁడే. చక్కఁగ శిక్షింపఁబడని మనస్సు గల వానిచేతి ధనము లోకమునకును వానికిని మేలు చేయుటకు మాఱుగ నెన్నియో కీడులను జేయును. కావుననే యర్థ మనర్థమని పెద్దలు చెప్పిరి. కావున ధనము వలనఁ గలుగు కీడులు దొలఁగించుటకు మనస్సును భగవంతుని ప్రక్క త్రిప్పుట యను మందొక్కటె గలదు. స్వేచ్ఛగా విహరించుచుండిన మనస్సు సులభముగా మనుష్యునకు లోపడునా? లోపడదు. కావునఁ బ్రతిదినము దానిని పలుమాఱు భగవంతునియందుఁ బోనిచ్చి కామక్రోధలోభముల నణంచుటకై నియమములును వ్రతములును ఏర్పఱుపఁ బడెను. ఈ విధముగ నధమాధమ వైశ్యుఁడు, కర్మ యోగము నభ్యసించుచు క్రమక్రమముగ నుత్తమ వైశ్యుఁడై వైశ్యవృత్తి పరీక్షయందుఁ బూర్ణముగఁ గడతేఱి యధమాధమ క్షత్రియుఁడగును.

తక్కిన దేహమునకు నపాయము కలుగకుండునట్లు చేతులెట్లు కాపాడునో యట్లు క్షత్రియులు ప్రజల కెవరికి నపాయము రాకుండునట్లు రక్షింపవలయును. ప్రజలను గీడులనుండి తొలఁగించుచు వారికి సౌఖ్యములు గలిగించి రంజింపఁ జేయుటచే వారు రాజులగు చున్నారు. ఈ ప్రకారము చేయుట తమ సౌఖ్యమున కని తలంపరాదు. లోకసేవకే. వారు ప్రజలవలన ధనము రాఁబట్టుట తమ భోగములకుఁ గాదు. ప్రజలకు సుఖము గలుగు కార్యములయందు వినియోగించుటకే. ఇట్లు రాజులకుఁ గర్తవ్యమైనది కామ క్రోధలోభము లణంచిచేయు లోకసేవయే. అధికారబలము ధనబలము కలిగినపుడు మత్తెక్కి దేహమెఱుంగక యకార్యములను జేయుదురని వీరికి వైశ్యుల కంటెను మిక్కిలి యమనియమములు వ్రతములు విశేష యజ్ఞాది కార్యములు విధింపఁబడినవి. ఈ విధముగ నధమాధమ క్షత్రియుఁడు కర్మరాజయోగములను నభ్యసించి క్రమక్రమముగ నుత్తమ క్షత్రియుఁడై యుత్తమక్షత్రియ వృత్తి పరీక్ష యదు కృతార్థుఁడై యధమాధమ బ్రాహ్మణుఁడై పుట్టును.

బ్రాహ్మణుఁడు మూఁడు సంవత్సరముల గ్రాసమున కెక్కువ చేర్పరాదు. కామక్రోధాదులను బూర్ణముగ జయింపవలయును. భూతదయ సత్యము

శౌచము అహింస కొంచెమైన వదలరాదు. విద్యయుఁ దపము మానరాదు. ఇంద్రియనిగ్రహము ప్రథమ కర్తవ్యము. ఇట్టి వనేక నిర్బంధములు బ్రాహ్మణులకుఁ గలవు. దక్కిన రెండు వర్ణముల వారికివలె వీరికి బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసమను నాలుగాశ్రమములు గలవు. ప్రత్యాశ్రమము పరిపూర్ణముగ సాధింపవలయును. నీ రేయాశ్రమమమందున్నను వీరి జ్ఞానము శక్తి లోకోపకారముగనే యుపయోగింపవలయును. తల తక్కిన యవయవముల మేలెట్టు లాలోచించుచుండునో యట్లు బ్రాహ్మణులు తక్కిన మూఁడు వర్ణముల వారెప్పుడె దేది చేయుచుండిన క్షేమమో చెప్పుచూ నాయాకార్యములు వాచిఏ చేయించుచుండ వలయును. ఇట్లు స్వలాభమునకైగాని లోభముచేతఁ గాని చేయింపరాదు. ఉపకారబుద్ధి వదలరాదు.

బ్రాహ్మణునకు దానము బట్టుట నిషిద్ధము. ఆలోచించు పని తప్ప తలకు మఱియే యితర కష్టము లేనట్టు బ్రాహ్మణులకు లోక క్షేమ చింత భగవచ్చింత తప్ప మఱియే జంజాటము లేదు. తక్కిన యవయవములు కష్టించి సంపాదించి శిరమున కాహార మిడునట్టు తక్కిన వర్ణములవారు వీరిని భరింపవలయును. బ్రాహ్మణుఁడు విద్యను అమ్మరాదు. ఈ విధముగ బ్రాహ్మణులు జితేంద్రియులై లోకసేవ చేయవలయును. ప్రత్యవయవము దేహమాద్యంతమునకు క్షేమకరమైన కార్యము లెట్లు చేయుచుండవలయునో ప్రతి వర్ణమునందలి ప్రతి మనుష్యుఁడు తక్కిన యందఱకు మేలిచ్చునట్లు ప్రవర్తించుచుండవలయును. ప్రతి మనుష్యుఁడును లోకసేవతోపాటు దేవసేవ చేయుచుండవలయును. ఈ కారణముచేతనే భార్య భర్తను సేవింపవలయును. భర్త భార్య కెట్టి లోపము కలుగకుండునట్లు భరింపవలయును. పుత్రులు తల్లిదండ్రులను గొలువవలయును. పుత్రులను దల్లితండ్రులు పోషింపవలయును. రాజును బ్రజలు సేవింప వలయును. ప్రజలకుఁ గష్టమనునది తెలియకుండునట్లు రాజు ప్రజలఁ గాపాడవలయును. భక్తులు భగవంతుని సేవించుట వలనఁ దాము బాగుపడుదురుగాని భగవంతు నుద్ధరింపరు. అట్టులే లోకు లీ ప్రకారము సేవచేయుట తమ్ముఁ దా ముద్ధరించుకొనుటకేగాని యెదుటివారి నుద్ధరించుటకుఁ గాదు. ఇది మీరు మనస్సులో బాగు నుంచుకొని గురుసేవ, పితృసేవ, దేవసేవ, లోకసేవ యొక్కటే భక్తితోను దయతోను చేయుచుండవలయును. మనుష్యుఁడు సంసార సాగరము దాఁటుటకు నావ సేవ యనునదియే. ఈ పద్ధతి భగవంతుని వఱకు వ్యాపించి



యున్నది. భగవంతుని కంటె గొప్పవాఁడు లేఁడు గాన ఆయన యెవరియందు భక్తి చూపవలసినది లేదు గాని లోకులందఱు ఆయన బిడ్డలుగాన వారివలనఁ దనకుఁ గావలసిన ప్రయోజనమేమియు లేకున్నను వారయందు దయచూపి సంకల్పముచేతనో యవతారము లెత్తియో సర్వదా యన్ని విధముల రక్షించుచుండును. ఒక నిమిషమైన నేమఱఁడు. మనవలన ఆయన యొక తృణమైన నాశింపఁడు. ఆయనకు మనము చేయు పూజ మనము బాగుపడుటకేగాని భగవంతు నుద్ధరించుటకుఁగాదు. మీకుఁ జాల సంగ్రహముగఁ బరిణామ మార్గమును దెలిపితిని. ఈ క్రమమార్గము నుల్లంఘింపరాదు. కాఁబట్టి యే స్థానము నొకఁడు గోరునో యాస్థానమునకు వలసిన యోగ్యత వాఁడీ జన్మమదో పూర్వజన్మమందో సంపాదించియుండక పోయినయెడల వానికోరికను దేవత లేదోవిధముగ విఘ్నపఱుచుచుందురు. నీవు ఎనిమిదవ తరగతయందుఁ జేరవలయుననిన 5–6–7 తరగతుల పాఠములన్నియు నీకు వచ్చి యుండవలయుఁగదా? అట్టులే యిదియును. ఇంద్రియనిగ్రహము లేక బ్రాహ్మణుఁడుగా బుట్టినంత మాత్రముచేతనే లాభమా? అట్టివాఁ డధమ బ్రాహ్మణుఁడు. ఉత్తమ బ్రాహ్మణుని యోగ్యత వానికెట్లు వచ్చును? తపస్సు చేయుటకు ముందు సంపాదించవలసి దయాది గుణములను నీవడిగిన బ్రాహ్మణుఁడు సంపాదించినవాఁడు కాఁడు. దానివలన రాని పాఠముల నేర్చుకొమ్మని యింద్రుఁడట్లు చేసెను. క్రమమార్గమునఁ బోవువాని కాయాసము లేదు. విఘ్నములు రావు. తటాలున పైకెగురఁ దలఁచువానికే యనేక కష్టములు కలుగును. సమర్థుఁడు తెలివిచేతను, గురువు తోడ్పాటుచేతను, అభ్యాసముచేతను, పట్టుదల చేతను ఎంత దానినైన సాధించును. నీవడిగిన ప్రశ్నకు సమాధానము వచ్చినదా?

కృష్ణుఁడు : వచ్చినది. ఇన్ని కట్టుపాటులతో సదుద్దేశముతో ఫలవంత మగునట్లు పూర్వులు చేసిన వర్ణాశ్రమ నియమమును దూషించువారు కూడ నేఁడు మనలోఁ బుట్టినారు గదా యని విచారపడుచున్నాను.

తండ్రి : దేశము కాలము గుఱించి నీవు నేను విచారపడి ప్రయోజనము లేదు. కలికాల బలమట్టిది. యుగధర్మము జరగక మానునా? నీవు బుద్ధిమంతుఁడ వైతివా యిది యంతయు మనస్సులో నుంచుకొని నీవు వంకరత్రోవఁ బోవలదు. నీ పిల్లవాండ్రకు నివి నేర్పి వారిని

సరియైన మార్గములో నుంచుము. ఒకరి నిమిత్తమై మనము వ్యసన పడి ప్రయోజనము లేదు. తనను తన్నాశ్రయించిన వారిని చక్కఁబెట్ట యత్నించినఁ జాలును. బాగుపడఁ గోరువారిని భగవంతుఁడు చెఱుపఁడు. ఐశ్వర్యమును భోగమునే గోరి కామదాసుఁడ వైతివా నిన్ను నీవే చెఱుపుకొందువు.

కృష్ణుఁడు : నేను బ్రాహ్మణుఁడఁగాఁ బుట్టితిని గదా ఒక నాకేమి భయము?

తండ్రి : పిచ్చివాఁడా! బ్రాహ్మణునకే యెక్కువ భయము. చెట్టు కొన కొమ్మనుండి క్రిందఁ బడినవాని కెంత దెబ్బ తగులునో కొమ్మల మొదట నుండి పడిన వానికెంత దెబ్బతగులునో యాలోచింపలేవా? ఈ తరగతి పాఠములు మఱచిన క్రింద తరగతులకు వేయుదురంటివే. మఱచితివా? అట్టులే నీవు బ్రాహ్మణ కర్మలు చక్కఁగఁ జేయకపోయితివా నీవు మఱచిన పాఠములను మరల నేర్చుకొనుమని క్షత్రియుఁడుగనో వైశ్యుఁడుగనో శూద్రుఁడుగనో చండాలుఁడుగనో పశువుగనో నీ యోగ్యతకుఁ దగినట్టు దేవతలు పుట్టఁజేయుదురు. ధర్మవ్యాధుని కథ జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

కృష్ణుఁడు : నేను బ్రాహ్మణవృత్తి పరీక్షయందుఁ గడతేఱిన నాకేమి లాభము?

తండ్రి : నీవు చేసిన పుణ్యకర్మము కొలఁది ఇంద్రుఁడుగనో సూర్యుఁడుగనో చంద్రుఁడుగనో బ్రహ్మగనో యగుదువు. బ్రహ్మపదమునకు హనుమంతుఁడు కాచుకొనియున్నాఁడు గదా. ఇప్పుడుండు సూర్యచంద్రులు ఇంద్రాగ్నులు లోనగు వారందఱు మనవలె నుండి పుణ్యకర్మములు చేసి యా పదము లలంకరించినవారే. మనము దేవసేవ లోకసేవ చక్కఁగఁ జేసిన వారివలె నగుదము. లరుదీల నచ్చట నుండి మోక్షమునకుఁ బోయినఁ బోవచ్చును. కావున నీ యోగుబాగులు నీవు చేయు కార్యములం బట్టి యుండును.

కృష్ణుఁడు : నీవు చెప్పిన మార్గముకంటె శీఘ్రముగ మోక్షము నకుఁ బోవుమార్గము కలదా లేదా?

తండ్రి : లేకేమి? నీవు పాఠశాలలోఁ జదివి ప్రవేశ పరీక్షకుఁ గావలసిన విద్య సంపాదించుటకు నధమపక్షము పది సంవత్సరములు పట్టును.



నీకు శ్రద్ధ తెలివి యుండి యింటిలోనే చదివితివా యెక్కువ పక్ష మయిదు సంవత్సరములలో నంత విద్యయు గ్రహింపవచ్చును. అట్టులే నీకు భగవంతునిపై భక్తి శ్రద్ధ విశేషించి యుండెనా నీవు శూద్రుఁడవైనను మఱి యెవ్వఁడవైనను శీఘ్రముగనే ముక్తి నొందుదువు. నీవు చేయునట్టి కార్యము లన్నియు భగవత్ప్రీతిగాఁ జేయుచు నవి యెల్ల భగవంతునిసేవయు యని తలంచుచు సర్వము భగవన్మయముగాఁ జూచువాఁడు శీఘ్రముగనే ముక్తి నొందును. శ్రీరాముఁడు వానరులకు జటాయువునకుఁ బశుపక్ష్యాదులకుఁ గూడ మోక్షమిచ్చెను గదా.

కృష్ణుఁడు : నేను దేవసేవ చేయను. లోకసేవ మాత్రమే చేయుదును. నాగతి యేమి?

తండ్రి : ఒకఁ డొకనాఁడు తాను వ్రాసికొను నింటిలోనికిఁ బోయెను. అప్పు డొకఁడు అక్కడఁ గూర్చుండి యేమియో వ్రాయుచుండెను. అయ్యా! నీ వెవ్వర వేమి వ్రాయు చున్నావని యితఁ డడిగెను. నేను దేవదూతను. దేవుని భక్తుల పేర్లు వ్రాయుచున్నా ననెను. అయ్యా! నా పేరు నీ పట్టియందున్నదా యనెను. లేదని వాఁడు చెప్పెను. అటైన నా పేరు లోకసేవ చేయువారి పట్టిలోఁ జేర్పుమనెను. అట్టులే యని తయఃడని మాయమై పోయెను. మఱుసటినాఁడు ఆ యింటిగోడ మీఁద భక్తుల పేర్లన్నియు వ్రాయబఁడి యుండెను. అందు మొట్టమొదట నితని పేరే బంగారక్షరములతో లిఖింపఁబడి యుండెను.

కృష్ణుఁడు : నేను దేవ సేవ మాత్రము చేయుదును. లోకసేవ చేయను, ఒకరు నాకేమియు నుపకారము చేయవలదు. నే నొకరికిని జేయను. నేను జెడుదునా బాగుపడుదునా?

తండ్రి : ఇది యాలోచన లేని మాట. ఇటులుండుట యసాధ్యము. నీ విధిమొద లితరుల కుపకారము చేయవు? ఈ జ్ఞానము పుట్టినది మొదలుకొని గదా? ఈ జ్ఞానము నీ కెప్పుడు పుట్టెను? 12 సంవత్సరములయిన తరువాతఁ గదా? ఇంత వఱకు నితరుల యుపకారము లేనిదే నీ వెట్టు బ్రతికితివి? నీకు విద్యాబుద్ధు లెట్లు

వచ్చెను? నీ కిదివఱకే కేవలప్రీతితో నుపకారము చేసినవారికిఁ బ్రత్యుపకారమైనఁ జేయకుండినఁ గృతఘ్నుఁడవు కావా? ఇతరుల సహాయ్యము లేనిదే నీవెట్లు బ్రతికెదవు? నీకు రోగములు నొప్పులు వచ్చినపు డితరుల సాహాయ్యమక్కఱ లేదా? కాఁబట్టి లోకసేవ తప్పక చేయవలయును. ఉపకారికి నుపకారము చేయుట విపరీతము గాదు. ఈ విదముగ దేవేంద్రుఁడు, నారదుఁడు, యమకింకరులు, దేవదూతలు, భగవదాజ్ఞ శిరసా వహించి వారివారికి వారివారి కర్మఫలము లొనగూర్చుటకు సాధారణ మార్గము సరిపడనప్పుడు తామే యేదో యొక విధముగ నవి సమకూరునట్లు చేయుచుందురు. గాని కామ క్రోధములవలనఁ గాదు. దీనికొక చిన్నకథ రేపు చెప్పెదను.

రుక్మిణి : నా కూఁతురు వీర్యశుల్కయని జనకుఁ డనెనే యట్లనిన నేమి?

కృష్ణుఁడు : రాక్షసులనఁగా నెవరు?

రాముఁడు: నీవు చెప్పిన పద్ధతి ప్రకారము చూచిన నెంత యధమ బ్రాహ్మణుఁడైనను శూద్రునికంటె నుత్కృష్టుఁడుగా నుండవలయును గదా. అటు లేక యిప్పుడెందఱో బ్రాహ్మణులు శూద్రులకంటె నికృష్టులుగా నున్నారు. శూద్రులు అనేక బ్రాహ్మణులకంటె నుత్కృష్టులుగా నున్నారు. దీని కేమి కారణము?

రంగన్న : సేవ యందఱు చేయవలయునని యంగీకరించితిని గాని వైశ్యుఁడు వాణిజ్యరూపముగానే చేయవలయునని క్షత్రియుఁడు భూపాలనమే చేయవలయునని నియమమేల? శూద్రుఁడు భూమిని పాలించిన దోషమా? నేను బ్రాహ్మణుఁడను వాణిజ్యము చేయరాదా? చేసిన దప్పేమి?

అమ్మణ్ణి : ఎంతరాత్రి యైనదో గడియారము ప్రక్కఁ జూడుడు. పిల్లవాండ్రు తూఁగుచున్నారు. నేనును గొన్ని యడుగవలయును. రేపడుగుదము. ఇప్పటికిఁ బోయి పండుకొందము.

తండ్రి : సరి పోయి పండుకొనుఁడు.



# రెండవ భాగము

తండ్రి : ఈ దినము శ్రీసీతారాములకుఁ బట్టాభిషేకము చేయవలయును. నిన్నటి మీ ప్రశ్నములకుఁ గడపట నుత్తరము చెప్పెదను.

ఇట్లు రావణాసురుఁడు సీతను దన యంతఃపురములో దించి తన యైశ్వర్యమంతయు నామెకుఁ జూపుచు,

**సీ.** **ఇదె చూడవే సీత! హేమదంతసమేత**
**పూతవాతాయన వ్రాతములను**
**అదె చూడవే భామ! హృదయంగ మోద్దామ**
**ధామనిర్జిత సోమధామములను**
**అటు చూడవే గోల! హారికేళీలోల**
**జాలపాదాంగనా జాలములకు**
**ఇటుచూడవేచాన! యింపుసొంపుల నీన**
**మానితన వనవోద్యానములను**
**తే.** **చూచితే యల్లకొలఁకుల సొంపుసెంపు**
**కొమరుఁ జిలుకలపులుఁగుల గుంపుఱంపు**
**నెల్లపుష్పితవృక్షంబు లింపునింపు**
**మగువరో! యింకనైన నీమంపుదింపు.**

అని మఱియు నిట్లనియె. ఓసీ సీతా! యింకను నేల యేడ్చెదవు? ఎన్ని దినము లేడ్చినను నీ మొఱ వినువార లెవరు? ఏడిచియేడిచి కృశించిన రాఁగల లాభమేమి? ఈ మందిరము లన్నియు నీ వశపఱిచెదను. ఈ నానెలంత లందఱు నీకు దాసులయ్యెదరు. నాకు నా యైశ్వర్యమునకు నెల్ల నీవే దేవివై భోగంబు లనుభవింపుము. నేను నా వారలందఱు నీకు సేవకుల మయ్యెదము.

**ఉ.** **రాముఁడు రాముఁడంచు నొక రాజ్యవిహీనుని దేబ జోగినిౝ**
**వేమఱు నల్పతేజుని ననేక విధంబులఁ గూర్చి యేడ్చెదో**
**భామిని! నీకు యోగ్యుఁడగు భర్తను నెనే, ననుౝ భజింపుమీ**
**శ్యామరో! యౌవనంబు సతమా? పిఱికీ! ననుఁ గూడు హాయిగౝ.**

ఇఁక రాముని నీవు కలనైనఁ జూడఁజాలవు. దేవాదులకైన సముద్రంబు దాఁటి రారాదు. దాటియు లంకను జొరరాదు. చొచ్చియు నన్ను గెలువరాదు.

ఇఁక మనుష్యులకెట్లు మనస్సుననైన నిటకురా సాధ్యపడును? కావున 'రాముఁడు వచ్చును నిన్ను విడిపించు' నను నడియాస మానుము. దేవదానవ బలంబులచే నైన మృతిలేకుండ వరంబులఁ బడసిన వాఁడను. ఇఁకఁ దుచ్ఛ మానవులేమి లెక్క? నీవు చేసిన పాపములన్నియు వనవాసముచే నశించెను. నీవు చేఇసన పుణ్యముల ఫల మనుభవించు కాలము వచ్చెను. సిరిరా మోఁకా లొడ్డినట్టు. నీ పూర్వ పుణ్యవశమున వచ్చిన యైశ్వర్యము నేల త్రోచిపుచ్చెదవు? అని యేవియో కాఱులు ప్రేలుచుండ సీతయు వాని ముఖము చూడ రోసి పఁట కొంగునఁ దనముఖము కప్పుకొని మాఱుమొగము పెట్టి తిరస్కార పూర్వకముగ వానితో నిట్లనియె.

ఓరీ మూఢుఁడా! రాముఁడన నెట్టి మహాత్ముఁడో నీవేమి యెఱుఁగుదువు? నీ యట్టివా రా మహాత్ముని నెఱుంగఁజాలరు. నా రూపము భయంకరము నాపురము. దుష్ప్రవేశము నే నజయ్యుఁడను. నా బలము దుస్సాధమని పగ్గెలు గొట్టెదవు గానియెదిరి బలమెట్టిదో యోజింపవైతివి. దేవదానవావళికి నీ వసాధ్యుఁడవైన నగుదువు గాక. శ్రీరాముని కెట్లు నీ వసాధ్యుఁడవు? అంతటి బలశాలివేని యేల వారి యెదుట నిలువ భయపడి యుద్ధము చేయక ప్రాణభీతిని బరుగెత్తితివి. ఒక ముసలి గ్రద్దచే నీ పడినపాటు నేను గన్నులారఁ జూచితిని గదా. రామలక్ష్మణుల కంట నీవు పడియుంటివా నీ వింతకు కుక్కలకు నక్కల కాహారమై యుండవా? నిన్ను నేలన బలిపెట్టుటకు నా ప్రాణేశ్వరుని యస్త్రమొకటి చాలదా? నీకు సంపద, యాయుస్సు, సర్వము క్షీణించుటచేఁ జేఁపలు గాలమును మ్రింగునట్టు నన్నుఁ దెచ్చుకొంటివి. ఆయన నిన్ను జూచియే యుండిన దృష్టి మాత్రముననే భస్మీకరించి యుండఁడా.

కం. **కాలవకు లైన పురుషులు । కాలప్రేరణముఁ జేసికార్యములందున్**
**జాలఁ బ్రమాదము పడుదురు। మేలని దుష్కార్యములను మేకొంద్రుసుమీ!**

దుష్టుఁడా! నీ కట్టి వినాశకాలము దాపరించి యిట్టి విపరీత బుద్ధి పుట్టెను. ధర్మాత్ముఁడును సత్యసంధుఁడునునైన శ్రీరాముని భార్యను నన్నుఁ దాఁక నీకు సాధ్యమా?

చం. **తనువు విసంజ్ఞ మియ్యది మదంబునఁ గట్టెదవేని గట్టు మీ**
**క నలునఁ దిందు వేనితిని కాదనుదానను గాను, నాజి**



**నీతనువును జీవితం బయిన దానవ! రక్ష్యము గాదురోరి నా**
**మన మిది మద్వశంబ యవమానము పాల్పడ నొల్ల నమ్ముమీ!**

అని పరుషంబుగఁ బలికిన రావణుఁడు గోపించి రాక్షస స్త్రీలఁ బలిపించి జానకిని జూపి యిట్లనియె. దీని నశోకవనంబునకుఁ గొనిపొండు. ఎటులైనను నీకు వశపడునట్లు చేయుఁడు. ఈమె యేది కోరినఁ దెచ్చియిండు. ఈమె కవజ్ఞ గావించెదరేమో జాగ్రత్త. నా యాజ్ఞ లేక యశోకవనములోని కెవ్వరును బోరాదు. లోనివారు వెలికి రారాదు అని యానతిచ్చి సీతను చూసి జానకీ! నీకుఁ బండ్రెండు మాసములు గడువిచ్చితిని. ఈ లోపల నా మంచ మెక్కితివా సరి లేనియెడలఁ బ్రొద్దుటి పూఁట యాహారమునకై యీ రాక్షసస్త్రీలు నిన్ను ముక్కలుముక్కలుగా నఱక నాకు వండిపెట్టుదురు. బ్రతుకు మార్గము చూచుకొమ్మని చెప్పి తన గృహములోనికిఁ బోయెను. సీతాదేవియుఁ దన మేననున్న యాభరణములన్నియుఁ దీసి తానుండిన చెట్టుకొమ్మలకుఁ దగిలించి రామా రామా యని యేడ్చుచునేయాహారము గొనక పదినెలలు దుఃఖించుచుండెను. భయంకరాకారములు గల రాక్షస స్త్రీలు ఒంటికంటిది, ఒంటి చెవిది, చెవులు లేనిది, నిడివి మెడది, వ్రేలాడు చెవులది, ఎగయుముక్కుది, బోడిది, చింపిరితలది, పెద్దతలది, వ్రేలాడు పెదవులది, వ్రేలపొట్టదియును, గిటకలు, పొడవులు, మఱుగుజ్జులు, వికటలు, మిట్టపండ్లు, మిడిగ్రుడ్లు కలవారును, ముక్కిఁడులు, బొక్కినోటివారు, మేఁక మొగము దున్నపోతు మొగము, నక్క మొగము పులిముఖము, ఒంటె కాళ్ళు గుఱ్ఱపు కాళ్ళు ఏనుఁగు కాళ్లు గలవారును, ఒంటిచేయి ఒంటికాలు గలవారు, గుఱ్ఱపు కాళ్లు ఏనుఁగు కాళు గలవారును, ఒంటిచేయి ఒంటికాలు గలవారు, గుఱ్ఱపుజెవులు గాడిద చెవులు ఏనుగు చెవులుగలవారు, నిట్లు నానా విధముల వికార వేషములు గలవారు తన్ను పెక్కు భంగుల భయపెట్ట సీతాదేవి రామా రామా యని ప్రాణధవు స్మరించుచుఁ గాలము గడుపుచుండెను.

## రావణుం డశోకవనంబునకు వచ్చుట

ఇట్లు పదినెలలు జరగ రావణుఁ డొకనాఁటి రాత్రి సీతను స్మరించి భార్యలతోను బరిచారికలతోను అశోకవనమునకు వచ్చి రామా యని యేడ్చుదానిని, రిత్తనేలఁ గూర్చుండిదానిని, సముద్రమునఁ బగలిన నావయో, తెగిపడిన పూవుఁ దీఁగెయో, బురదమునిఁగిన కమలమో, గుణముకీర్తి ధర్మవృత్తి గల సద్వంశమందుఁ బుట్టియుఁ గాపురుషుని గులహీనుని వివాహ మాడిన

స్త్రీయో, అభ్యాసము చెడిన విద్యయో, అపవాదముచేఁ జెడిన కీర్తియో, హతశూరసేనయో, రాహువు మ్రింగిన చంద్రబింబమో, గజము కలఁచిన కమలాకరమో, కృష్ణ పక్షరాత్రియో, యెండకు వాడిన తూఁడో, యననుండు దానిని భయము చేతను శోకము చేతను ఉపవాసములను స్రుక్కిన దానిని జూచి రావణుఁడు చేరఁబోయి యిట్టు లనియె.

## రావణుఁడు తన కోరికను సీతాదేవికిఁ జెప్పుట

సీతా! యేల నన్నుఁ జూచి మొగము మాటు చేసెదవు? ఇక్కడ క్రొత్త వారెవరు? నేనొకఁడనే కదా పురుషుఁడను. నేను నిన్ను వలచి యుండువాఁడనే కదా! నా మాటఁ బాటింపుము. నన్నాదరింపుము. నా కోరిక వ్యర్థపఱుపకుము. పిఱికిదానా! నన్నుఁ జూచి యేల భయపడియెదవు? నీ ప్రీతికిఁ బాత్రుఁడను. నీ దాసుఁడను. పరాంగనా సంగమము గోరి నేను బాపినైతినని తలఁపకుము. పరదారహరణము పరదారసంగమము మాకుఁ గుల ధర్మములు. కులధర్మము సదోషమైనను విడువరాదు. నాయందు నీ కనురాగమున్నచో నాకు నరకమైనను సంతోషమే. అటులని కామహీనవగు నిన్ను బలాత్కరింప నొల్లను. నాయందుఁ గరుణించి నీవే నన్నుఁ గామించి యథాకామముగా సుఖమొసంగుము. భయపడవలదు. ఏల వృథా దుఃఖపడెదవు? నీ యట్టి సుందరికి నేకవేణియు, నేలఁ బండుకొనుటయుఁ బస్తుండుటయు మాసిన చీర కట్టుటయు, విడువని చింతయు, నుచితంబులా? నీ వనుగ్రహించిననే నా జన్మము సార్థకము.

**ఉ. అందములై మాల్యనిచయంబులు దివ్యములైన భూషలుఁ**
**జందనలేపనంబులును జక్కని పెక్కుతెఱంగు చేలముల్**
**సుందర మందిరంబులును సొంపగు పానశయాసనంబులుఁ**
**సుందరి! నృత్తగీతములు నూల్కొనుమీ ననుఁబొంది మైథిలీ.**

వయస్సు ప్రవాహమువంటిది. పోవచుండునుగాని మరలి రాదు. అట్టి వయస్సును వ్యర్థపఱిచిన ఈ జన్మమున నీ వింక నెప్పుడు సుఖింపఁగలవు? నన్ను నీవు వరించితివా నీ జనకునకు సమస్త సంపదలు పత్తనములు ధరణిరాజ్యము నంతయు సమకూర్చెదను. సింగారించుకొనిన నీరూపము చూడఁ గోరుచున్నాఁడను. తొలుతటి నీ దివ్యసుందర విగ్రహము నాఁకు గనులఁ గట్టినట్లున్నది. దానినే మరలమరలఁ జూడఁ గోరెదను. నీ శరీరమున నా దృష్టి యొందెందు పడుచున్నదో యందు స్థిరముగా నాటుకొని పోవుచున్నది.



నన్ను నీవు రణభీరువుగాఁ దలంపకుము. నీ కన్నుల యెదుట నీ మగని మఱఁదిని వధించిన నీవు దుఃఖింతువని వారలతోఁ గలహింప నొల్లనైతి. ఇన్ని దినములైనను రాముఁడు రాముఁడని యేడ్చుచున్నదానవు. వనచారియు, నిర్భాగ్యుండును, చీరాజినధరుండును స్థండిలశాయియునగు రామునిఁ దలఁచి యేల యేడ్చెదవు? అశ్రీకుఁడగు నతఁడు నీకే సుఖంబులు గలిగింపఁ గలఁడు? నిన్నుఁ బొందినవాఁడే శ్రీమంతుఁడు రాముఁ డడవిలోఁ బ్రాణముతోనైన నున్నాఁడో లేఁడో అట్టివానికి నిన్నుఁ జూడ సాధ్యపడునా? వానకారు మబ్బులు క్రమ్మిన వెన్నెలఁ జూడ నెట్టివారికైన నగునా? ఈ చింత విడుము లెమ్ము. సంతోషమున నాతోడ రమ్ము. తుమ్మెదలు జుమ్ము జుమ్మని క్రమ్ముపూఁబొదలలో సముద్రతీరమ్మున నెమ్మది సుఖింపుము అని యిట్టులనుచున్న రావణాసురినితో గడ్డిపోఁచ యొకటి యడ్డము నుంచి పతిఁ దలంచుచు సీతాదేవి యిట్లనియె.

రుక్మిణి : గడ్డిపోఁచ యడ్డమేల?

తండ్రి : సత్కరింప యోగ్యులుగాని పరపురుషులతో పతివ్రతలు మాటలాడరు. మాటలాడవలసి వచ్చిన నేదైన నొకటి యడ్డముంచి దానితో మాటలాడినట్టుగ వారు వినునట్లు సంభాషింతురు.

అంతియగాక వాని నొక తృణముగ భావించెననియుఁ దెలియ వలయును. లేదా నీవు చెప్పునట్టి మాటలు గడ్డిపోచతో సమానము లనికాని, లేదా ఆమె మహాలక్ష్మి కావున అనిర్భాగ్యునిపైఁ దన దృష్టి పడనీయరాదనికాని, లేదా కాకాసురుని తృణముచే భంగపఱిచినట్లు నిన్ను భంగపఱుచుటకు తృణమే చాలునని సూచించుటకనిగాని, పశుసమానుఁడవైన నీకు భోగ్య మీ గడ్డియేకాని నేను కానని తెలుపుటకుఁగాని, గడ్డి పోఁచ నడ్డముంచుకొనెను.

## సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట

ఓరీ! నీ మేలు కోరి చెప్పుచున్న దాననుగాని నీకు భయబడితినని తలఁపకుము. నాయందలి యాశ వదలుము. నన్ను నీవు కోరుట పాపాత్ములు ముక్తి గోరుటవంటిది.

**ఉ. పుట్టితిఁ బుణ్యవంశమునఁ బూజ్యతరాన్వయ మేను మెట్టితిం**
**బట్టతినేక పత్ని నియమంబును నిట్లు రహించి పాపముఁ**
**గట్టుకొనంగ నేర్తునె? యకార్య మొకండు ఘటించి? యేల యీ**
**వట్టివి విప్రలాపములు వాఁగెను మూర్ఖుఁడవౌచు రాక్షసా!**

అని పెడవాటుగా మరలి మఱియు నిట్లనియె. ఓరీ మూర్ఖుఁడా! నేను బతివ్రతను. నీ భార్యను గాను. ఇతరుని భార్యను. ఇతరుని భార్యను నీవాశింపరాదు. సదాచారము దలంపుము. సాధువులు పెద్దలు పరదారాభిగమనమేల నిషేధించిరో దానివలనఁ గలుగు పాతకమెట్టిదో పాపాచారుఁడు తెలియలేఁడు. కావునఁ బెద్దలు పోయిన మార్గమున నతఁడు పోవుట శ్రేయస్కరము. పరుని భార్యను నీవాశించుట ధర్మమైనచో నీ భార్య నితర పురుష లాశింపవచ్చును గదా? నీవు పరుల భార్య నాశించుట నీ భార్య యితర పురుషుల నాశించుట కనుజ్ఞ యిచ్చుటయే కదా? ఇంతమాత్రము జ్ఞానము లేక యేల వదరెదవు?

**ఉ. సంచలితేంద్రియుం డగుచుఁ జంచలుఁడై తన భార్యయంద ప్రేమ**
**మించి రమించి తుష్టి గొన మేకొననోపని జాల్ము ప్రజ్ఞయు౯**
**సంచితలక్ష్మి యాయుధము సంతతియు౯ మఱి వానియాయువు౯**
**ద్రుంచుట సత్య మన్యనవతో యజపత్రవిశాలలోచనల్.**

ఓరీ! నీకు బుద్ధి చెప్ప బుద్ధిమంతులు పెద్దలు లేరా? ఇంత నగరమున నొకఁడైన లేకుండునా? నీ దురాచారులు నీ పాపకార్యములు నిన్ను వారి యొద్దకు బోనీయకా వారిని నీ యొద్దకు రానీయకున్నవి. దుష్టున కెవ్వఁడు బుద్ధి చెప్ప నిచ్చయించును? అటుగాక వారు చెప్పినను నీకును రాక్షసకులమునకును వినాశకాలము దాపరించుటచే వారి నీతులు నీకుఁ దలకెక్కవు కాఁబోలు నీచుఁడా! లోకమునఁ బాపము చేయువాఁ డొకఁడే. ఫలము మహాజను లనుభవింతురు. ఒకఁడు చేసిన పాపము చేతనే యతని వంశము హీనస్థితికి వచ్చి తదకు నశించును. ఒకని పాపము చేతనే కులములకు నపకీర్తియు హానియు వచ్చును. ఒకని పాపము చేతనే దేశమున కుపద్రవము గలుగును. కావున నీవు చేసిన యీ పాపముచే నీవు నశింతువు. నీ వంశమంతయు నశించును. నీ దేశమంతయు నాశమగును. నీవారందఱు చెడుదురు.

**ఉ. దూరపుఁజూపు లేక యెటుదోచిన నెయ్యదియైనఁ జేయుచున్**
**గ్రూరపుఁ బాపకార్యములకున్ మనసిచ్చి చరించునా యప**
**స్మారి స్వకీయకృత్యములఁ జావఁగ లోకములెల్ల సంతసం**
**బారఁగఁ బందుగుల్ సలుపు హాయిగఁ గన్ను మగుడ్చు రాత్రులన్.**



**ఉ. నిక్కపు వంచకుండవగు నిన్నొక నెచ్చెలివంచు నమ్మి వే**
**దిక్కఱి పోవువారు నినుఁ దిట్టుదు రీచెడుకూళ చిక్కె నీ**
**చిక్కుల దైవతంత్రమునఁ జేద్పడుఁగాక యటంచు సంతసం**
**బెక్కఁగ నేలరా చెడెద వీగతి నిందును ననందు నిందలన్.**

ఓరి మతిహీనుఁడా! సూర్యునకు నెండయు, చంద్రునకు వెన్నెలయు, నెట్టు లట్టు శ్రీరామునకు నేనని గ్రహింపుము. వానిని నీవు వేఱుపఱుపఁ గలవేని మమ్మును వేఱుపఱుపఁ గలవు. నా భర్తను నీవు కాలపాశ వశుఁడవై యసదుగాఁ జూచుచున్నవాఁడవు. శ్రీరామలక్ష్మణుల బలపరాక్రమంబులు నీవెఱుంగవు. స్వస్థానం బదరఁ బ్రస్థానార్థులతో జనస్థానమునందుండి ఖరదూషణాదుల వచ్చుటయుఁ జచ్చుటయు నైనఁ దలఁపలేవా? వారి యస్త్రబల మెఱుంగవేని తెలిపెద వినుము.

**కం. కదువడి నురపతి విడిచిన ।**
**పిడుగుల వడువునను గడిఁది బెడితిపుటులివుల్**
**విడివడ రఘుపతిశరములు ।**
**వెడలఁగ వినఁగలవురా వివేకము గనరా.**

**ఉ. తప్పినఁ దప్పవచ్చు బలదానవ వైరిశతారపాతముల్**
**దప్పినదప్పవచ్చు నలధర్ముని చూడ్కులు కొంతకాలమే౯**
**జెప్పెద సావధానమతిఁ జేర్పుము వీనుల రాముఁడల్గిన౯**
**జెప్పెడి దేమి మూర్తమున జీలిచి వైచును నిన్ను బోఁటుల౯.**

నీ సోదరుల రాఁముడు చంపెనను కోపం బతినిపైఁ జూప నోపక పాపీ! పిఱికివై నన్ను దొంగిలితెచ్చితివి గాని దీనిఫలమెట్లులుండునో యోజింపవైతివి. గరుత్మంతుఁడు త్రోటీ ముఖంబున సర్పంబులఁ జించి చిమ్ముగతి నా ప్రాణేశ్వరుఁడు కాఅనల సన్నిభంబులైన నారాచనిచయంబుల నిన్ను నీవారిని జించి చెండాడును. నీవు నాకు ద్రోహము చేసియున్నను నీకు నేను ద్రోహమెంచను. నీ ద్రోహమే నిన్ను నిర్మూలించును. నా నిమిత్తముగ నొరఁ డెట్టివాఁడైనఁ జెడుట నా కభిమతము గాదు గావున నీ మేలు కోరి వచించు నా పలుకులు వినుము.

**ఉ. ఇంకను గొన్ని నాళ్ళు పురలమేఁ దలంచెద వేని దండ భృ**
**త్కింకర ఘోర పాశములఁ గీడ్పడనొల్లవయేని రావణా!**

**కొంకకు రాముతోఁ జెలిమిఁ గోరుమ; యప్పురుషోత్తముండు ని**
**న్నంకిలిపెట్ట కేలం శరణాగతవత్సలుఁ డౌట నర్మిలిꣳ.**

కావున నామతిఁ బాటించి నాప్రాణేశ్వరుం గొనివచ్చి నన్నర్పింపుము.

ఉ. **సాంగము వేదముం జదివి సత్యము శీలముగల్గి సాధు స**
**త్సంగతిఁ దేఱి జ్ఞానియగు క్ష్మావిభుదేశున కాత్మవిద్య నా**
**నంగుగ రామభద్రునకు న్యాయవిధిం దగు భార్య నేను; నీ**
**యంగముఁ గాలనేనియును నంటుదునా యిది యేమి భ్రాంతిరా!**

అనిన రావణుం డిట్లనియె.

## రావణుఁడు సీతాదేవిని బెదిరించుట

జానకీ! నా మంచితనంబు నిన్నింత ప్రేలఁ బ్రేరించుచున్నది. కామ మడ్డగింపఁబడి క్రోధమగును. కావున నీ యందలి నా కామమునకు నీవు నిరోధించుటచే జనించు క్రోధాగ్నిని నీ యందింకను గలవలపను జలముచేఁ జల్లార్చుచున్నాఁడను. నీవు వధ్యవు. పరిభవింపఁబడ నర్హురాలవయ్యును నా శాంతగుణము సౌజన్యము నీ పట్ల క్రౌర్యముఁ జూపనీయకున్నవి. నీ విపుడాడిన కఱకు పలుకులకే నీ శిరము కఱకఱనతికి వైవఁదగును అని రోషావేశంబున రౌద్రమూర్తియై,

మ. **వినవే జానికి యింక రెండు నెలలే విశ్వాసపూర్వంబుగాఁ**
**గను నే వేచెద, నంతయే గడువు, నెక్కం జూడుమా లోపలꣳ**
**ఘనవేణీమణీ! నాదు శయ్య సతివై కాదేని రెణ్ణెల్లపై**
**నిను వంటింటను గోసి వండుదురు వింటే ప్రాతరాశార్థమై.**

అని కఠోరముగఁ బలికి జానకిని భయపెట్ట నామెకుఁ గలిగిన వెతలకై దేవతాస్త్రీలు కొందఱు మిక్కిలి తపించిరి. కొందఱు కనుసైగలచేతను బొమముడులచేతను, పెదవి విఱుపులచేతను, భయపడక ధైర్యము వహింపుమని తెలిపిరి. సీతాదేవియును వారి సన్నలచే ధైర్యము తెచ్చుకొని రాకాసి తేని నొకపోకకు సరకుసేయక శీలగర్వకారణమునఁ దనమేలు కోరి వానితో నిట్టులనియె.

ఓరి క్రూరుఁడా! నీ మేలుకోరి నీకు బుద్ధి చెప్పు వారొకరును నీ యూర లేరని యిప్పుడు నిశ్చయించితిని. ఉండిన నీ వింతటి ఘోరమైన యకార్యమును





రావణుఁడు సీతను జంపఁబోవుట

జేయ నుదాసీనులై యుందురా? నీవు చేసిన పాపము ఫలము నీ యొకనితోఁడఁ బోదు. నిన్ను నీ వంశమును నీ నగరమును రాక్షసకులమును సమూలముగ నాశము చేయును. ఓరి నీచుఁడా! శ్రీరామునిభార్య నగు నన్ను నీవుతక్క మఱియెవఁడైన నాశించునా? నన్ను నీవు దురుక్తులెన్నియో పలికితివి. ఆ పాపము నిన్నూరక విడుచునా? నావంక నూరకచూచు నీ గ్రుడ్లు కూలి యేల నేలఁ బడవో, నన్ను కఠోరవాక్యము లాడెడు నాలుక యేల వ్రీలిపోదో, నా పెనిమిటి కంటఁబడియుండిన గొన్ని నాళ్లాయుస్సు పెట్టినాఁడు. ఓరి నిర్భాగ్యుఁడా! నిన్నుఁ జంపుట యొక గొప్పకార్యము కాదు. కుక్కను గొట్టను బచ్చెనకోల కావలయునా? యన్నట్టు నిను భస్మము చేయుటకు శ్రీరాముఁడేల? నేనే చాలుదును. బెల్లము దిని చచ్చు వానికి విషము పెట్టువాఁడు వెఱ్ఱివాఁడన్నట్టు నీ పాపముచేతనే నీవు హతుఁ డవగుచుండ నేనేల శపింపవలెను. నీపైఁ

గోపించిన నా తపము క్షీణమగుననియు నిన్ను వధింప నా పతి యాజ్ఞలేమిఁ జేసియు నిన్ను వధింపకున్నదానను. ఎటులైన నీకు దండము తప్పదు. నేనేల కోపింపవలయునని శాంతమును, నీ వలన నాకేభయము గలుగదని ధైర్యమును, వహించి నిన్ను సైఁచినదానను. లేకున్న నన్నా నీవు హరింపఁగలవాఁడవు? నీ రాక్షసకులమను నడవికి నేను దావానల మనుకొమ్ము

అనిన రావణుఁ డిరువదికన్నుల నిప్పులురల గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచు సర్పమువలె రోఁజుచు

**ఉ. ఓ గుణహీనురాల! నను నొల్లక నీతివిహీను నిర్ధనున్**
**బాగని యాశ్రయించెదటె? పంకజమిత్రుఁడు సంధ్యఁ ద్రుంచు నా**
**లాగున నిన్ను నిప్పు డచలంబున రూపఱఁ జేయువాఁడ నీ**
**యాగడమెల్ల నా యెదుటనా? నను రావణు నీ వెఱుంగవా?**

అని చంద్రహాసము కేలఁగొని యామెను వధింపఁ బైకుఱికినఁ జూచి యచ్చటివారెల్ల హాహాకారంబులు గావించిరి. ధాన్యమాలిని యను రావణుభార్య యడ్డమువచ్చి యా కత్తిని బట్టుకొని యతని గట్టిగఁ గౌఁగిలించుకొని మనోహరా! నిన్ను మోహించి నీకై యేకారుచు మే మిందఱముండ నిన్నొల్లని యీ పుడమి పుట్టువు నీకేల? ఈ సకియ మానవి. వివర్ణ. మహాకృపణ. ఇది నీకుఁ దగినది కాదు. ఏదీ నీ నేర్పు చూతము. నాతో రమింప రమ్ము. దేవుఁ డిచ్చునుగాని నోటఁబెట్టి కూరునా? తేరకు మగడనయ్యెదనని నీవెంత చెప్పినను దాని కనుభవించు వ్రాఁత లేదు. నీతో రమించునట్లు బ్రహ్మదేవుఁడు దీని నొసట వ్రాసినవాఁడు కాఁడు. నీ వఱచి యార్భటించి బొబ్బరించి యేమి ప్రయోజనము? కామము లేని కామినిని గూడిన పురుష దేహము చెడును. కామించిన దానిని గామించిన సుఖము గలుగును. రారమ్ము పోదమని పిలువ నతఁడును దనలో నవ్వుకొనుచు సీతను బోధింపను బాధింపను రాకాసి మూఁకలకు నాజ్ఞాపించి తన మందిరమునకుఁ బోయెను.

రుక్మిణి : దమయంతి యెఱుకువానిని జంపినట్టు సీత రావణుని నేల చంపలేదని నేనడిగినపుడు రామాయణకథలోఁ జెప్పెదనంటివే. ఇప్పుడు చెప్పుము.

తండ్రి : దమయంతి శపింపకుండిన నెఱుకువాఁ డెంత దుష్కార్యమునకైన నొడిగట్టి పైపడనుండెను. ఆలసించిన మానహాని శీలహాని కూడఁ



గలుగును. కావున శపించెను. రావణుఁడు సీత నెట్లయిన నంగీకరింపఁ జేయవలయునని యత్నించెను గాని బలవంత పెట్టుటకుఁ బూనినవాఁడు కాఁడు.

నీ శీలము నిన్ను రక్షించునుగాక యని నలుఁడు దమయంతిని జూచి యామె నిద్రపోవునపుడు చెప్పెను. దమయంతి శపింపకుండినను శీలమువలన నెఱకువాఁడు భస్మమైయుండును. అదిగాక నలుఁడు సూర్యచంద్ర వాయుదేవతలకు దమయంతి నప్పగించెను. కీచకునిచేఁ జిక్కకుండునట్లు సూర్యుఁడు రాక్షసుని పంపి ద్రౌపదిని రక్షించినట్లు దమయంతిని గూడ సూర్యుఁడు కాపాడియుండును. దమయంతికి దేవతలు తన్ను రక్షించుచున్నారని తెలియదు. పరపురుషుఁడు తనుఁ దాఁక రాదు కనుక వాఁడు తాఁకుటకుముందే శపించెను. భర్త యనుజ్ఞ యున్నది గావున ఆమె శపించినను తపమునకు హాని రాలేదు. సీతను రాముఁడు లక్ష్మణున కప్పగించెనుగాని శీలమున కప్పగింపలేదు.

బుధుఁడు రోహిణిని బట్టినట్టు రావణుఁడు సీతాదేవిని బట్టుకొనెను. రోహిణికి బుధుఁడు కొడుకు. కాఁబట్టి సీతాదేవిని తల్లివలె భావించి రావణుఁడు తాఁకెను. రామలక్ష్మణు లెక్కడనుండి వత్తురోయని గుండెలు టమటమ కొట్టుకొనుచుండు వానికి ఆ కాలమున కామ మెచ్చటనుండి వచ్చును? కామముతోఁ దాఁకియే యుండిన బ్రహ్మ నలకూబర శాపముచే వాఁడచ్చటనే చచ్చిపడియుండును. సీత శపింప వలసిన పనియే లేదు.

అదియునుగాక రావణునితో సనత్కుమారుఁడు నారాయణుఁడు రాముఁడుగాను లక్ష్మీదేవి సీతగాను లోకరక్షణార్థమై పుట్టుదురనియు, సీతను నీ వపహరింపఁగా రాముఁడు నిన్నుఁ జంపుదుననియు, ఆయనచేఁ జచ్చి నీవు ముక్తినొందెదవనియుఁ జెప్పియుండెననియు, ఆ కారణముచే రామునిచేఁ జచ్చి ముక్తినొందఁ గోరి సీతాదేవిని భక్తితోనే హరించెనుగాని కాముకుఁడై హరింప లేదనియుఁ గావుననే తెలిసిన మూర్ఖుఁడు రావణుఁడు, తెలియని మూర్ఖుఁడు దుర్యోధనుఁ డను సామెత పుట్టెననియు రావణు వాక్యములకు రెండర్థములు గలవనియుఁ గొందఱు చెప్పుదురు.

అదిగాక రావణుఁడు సీతాదేవిని దాఁకినపు డామె మూర్ఛిల్లియుండెను. ఆమెకు స్మృతివచ్చునప్పటికి రావణునిచేతిలోఁ జిక్కి యుండెను.

కార్యము మించిన పిమ్మట నేమి చేయవచ్చును? వానిని నిర్వంశముగ నాశము చేయవలయుననియే పట్టుపట్టెను. తానందఱు రాక్షసులను నిష్కారణముగ శపింపరాదు. కావున నందఱనురామునిచే జంపింప వలయునని యెన్ని కష్టములైన సహించి యుండెను. తా నేస్థితియందున్నను దనశీలమునకు వాడు హాని కలిగింపఁ జాలఁడని యామెకు నమ్మకము గనుక నామె దమయంతివలెఁ దొందర పడలేదు. నిద్దురపోవుచున్నను మేలుకొని యుండినను ఏమఱియుండినను వానివాని పూర్వపుణ్యములు వానిని రక్షించుచుండును. నా యందేపాపము లేదు. నాకేమి భయమని యామెకు ధైర్యము.

సీతాదేవి మూర్తీభవించిన ప్రేమ. ఆమెయందు నిర్దయత్వగుణము పరమాణువు మాత్రమైన లేదు. తానెంత కష్టపడినను బరుల కుపకారము చేయునేగాని యపకారముచేయ దలఁపనైన తలఁపదు. దుష్టుఁడైన కొడుకుపైఁ దల్లికెట్టి కోపమో రావణాసురునిపై సీతకు నట్టికోపమే. కొడ కొక యకార్యము చేయఁబూనిన వానిని దల్లి వెంటనే శిక్షించునా? శిక్షింపదు. ఎన్ని విధములనో నయము భయము చూపి బోధించును. వాడప్పటికిని వినక వానివలన నితరులకుఁ గీడగు నట్టులుండినఁ బెనిమిటితోఁ జెప్పి దండింపఁ జేయును. లోకమాత సీత చేసినది యీ కార్యమే. దయావతియైన తల్లికి బిడ్డను గొట్టఁ జేతులాడవు. రావణునిపై సీతకుఁ గోపము లేనియుఁ గోపించియే యుండిన రావణుఁ డెప్పుడో భస్మమైపోయి యుండుననియు హనుమంతుని యభిప్రాయము. ప్రతి విషయమదు సీతాదేవి చెప్పిన మాటల నన్నిటిని చక్కఁగ బోధపఱచుకొని యామె యెట్టి గుణవతియైన యెడ నామె యట్లు చెప్పునో యాలోచింప వలయును. అప్పుడు గాని యామె గొప్పగుణము మీ మనస్సునకు బోధపడదు. తరువాత చర్య వినుఁడు.

అంత రాక్షసస్త్రీలందఱు సీతాదేవి చుట్టు చేరి యఱచువారును ఆర్భటించువారును లోకవిద్రావణు మా రావణు ధిక్కరించెదవా యని చెవులలో బొబ్బరించు వారును కొట్టఁబోవువారును నఱకఁబోవువారును మ్రింగఁబోవువారును అదలించివారును బెదరించువారును నై నానావిధముల నామెను దిగ్భ్రమపఱచిరి. అప్పుడందు ఏకజట దగ్గఱ కూర్చుండి చేతులు త్రిప్పుచు నిట్లనియె. సీతా! నా మాటవిను. రావణు నీవేమని తలఁచి



తిరస్కరించు చున్నావోకాని యా మహారాజు సామాన్యుఁడు గాఁడు. బ్రహ్మకొడుకు పులస్త్యుఁడు. పులస్త్యుని కొడుకు విశ్రవసుని కొడుకు రావణుఁడు. వింటివా? రావణుఁడనఁగా నాల్గవబ్రహ్మ. ఎదురులేక తిరుగువాఁడు. మాఱులేక మలయువాఁడు. అదరు బెదరులేని కుదురు గుండెవాఁడు. అట్టివాఁడు నీ యొద్దకు వచ్చి ప్రార్థించుకొలఁది యేమో చాల నిక్కిపడుచున్నావు? నీ కండ కావరమా? పోతరమా? యనుచుండ నింతలో హరిజట యనునది తన పిల్లికన్నులను గిరగిర త్రిప్పుచు సీతా! నీకెంత పొగరే. మూఁడు లోకములను జయించిన రావణుని మా రావణుని తిరస్కరించి పలికెదవు? ఏమి చూచిన ధైర్యమే నీకు? అని యొక్కొకతె యొక్కొక్క విధముగఁ బదరుచుండి యిట్లు గాదని యందఱుచేరి యిట్లు పలికిరి. ఓసి నీవు మనుష్య స్త్రీవగుట మనుష్యునే గొప్పగఁ జూచెదవు. ఏమిటి రాముఁడే రాముఁడు రాముఁడని యేడ్చెదవు? వాఁడు రాజ్యభ్రష్టుఁడు. దరిద్రుఁడు. దేబ. మా రావణుఁడు రాక్షసభర్త. సకలైశ్వర్యసంపన్నుఁడు. సీతా! నీకెంత దెలివిలేదే. అట్టివాని వలదని వలల యేడ్చెదవు అనిన సీత వారితో నిట్టులనియె.

రాక్షసస్త్రీలారా! మీ బుద్ధులు మీ యుపదేశములు చాలును. ఎవరైన వినిన నవ్వుదురు. ఒకని భార్య మఱియొకనిఁ గోరుట పాపకారణము. పశువులకు మృగములకు పక్షులకు పశుప్రాయలుగ నుండు స్త్రీలకు మీరు చెప్పిన నడివడి తగును గాని జ్ఞానవతికిఁ దగదు. అందు మనుష్యస్త్రీ రాక్షసునిఁ గోరునా? దీనుఁడో రాజ్యహీనుఁడో నా పతియే నాకు సమ్మతుఁడు. ఇంద్రునకు పౌలోమి, వసిష్ఠునకు అరుంధతి, చంద్రునకు రోహిణి, చవ్యనునకు సుకన్య, సత్యవంతునకు సావిత్రి, కపిలునకు శ్రీమతి, అగస్త్యునకు లోపాముద్ర, సగరునకు కేశిని, సౌదాసునకు మదయంతి, నలునకు దమయంతి, యెట్టులో శ్రీరామునకు నేనట్టులు. మీ మాట నేను వినుదానను గాను. నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము. మీ కిష్టముండిన నన్ను భక్షింపుఁడు. అంతియకాని నేను మీ మాట వినను అనిన రాక్షసస్త్రీ లందఱు గ్రుడ్డులెఱ్ఱ చేసి గండ్రగొడ్డండ్లఁ ద్రిప్పుచు నఱగొడ్డములు పలుకుచు నీవటే మామాటకు మాఱొడ్డి యెదురాడెదవని పైపడ్డ గతి మీఁది కురికి భయపెట్టిరి. అందు వినత యనునది నీతి యుపదేశించుదానివలె నొద్దఁ గూర్చుండి మంచిమాట లాడుచుఁ జేతులుత్రిప్పుచు నిట్లనియె.

సీతా! నేనేమియో చెప్పుచున్నదాననని తలంపకుము. నీ మేలుగోరి చెప్పుచున్న దానను. నీవలె నేను ఆఁడుదాననే. స్త్రీ ధర్మము నేనెఱుఁగుదును. "నేను మనుష్యస్త్రీని, నాకు మనుష్యుఁడే మగఁడు. రాక్షసునినెట్లు వలతు" ననియు, "స్త్రీకి వివాహము చేసికొనిన మగఁ డొకఁడుగాక పెక్కురను వలవరా" దనియుఁ జెప్పితివిగాని అందలి మేలుగీళ్లు ఆలోచింపవైతివి. మా రావణుఁ డెంతటి సుందరుఁడు! ఎంతటి బలశాలి! ఎంతటి యైశ్వర్యవంతుఁడు! మహాప్రభువు దేవతల నందఱ జయించినవాఁడు. స్త్రీ కోరు గుణము లన్నియు వానియందుఁ గలవుగదా? అట్టివాని వలదు వలదనుట యెంతటి యవివేకమో నీలోన నీవే ఆలోచింపుము. స్త్రీకి నొకఁడేమగఁ డనుటయు భ్రాంతి. కామినులు సుఖ మనుభవింపఁ బుట్టినవారు. నీ రాముఁడు దరిద్రుఁడు. రాజ్యభ్రష్టుఁడు. దుర్బలుఁడు. కావున దుర్బుద్ధి మాని మా రావణు వరింపుము.

**ఉ. ఏటికి రాముఁ గట్టుకొని యేడ్చెద? వా కృపణున్ గతాయుషుఀ**
**గూటికి లేని వాని మదిఁ గూర్చెదు? విన్ము మదీయవాక్యముల్**
**పాటిగ నెంచి మాపనుచు భంగి నొనర్పక మాఱువల్కని**
**నూటికిఁ గండకండగను గోసి భుజింతుము వ్యంజనంబుగఀ.**

అనిన మఱియొకతె భయంకరముగ నవ్వుచు ముష్టిపైకెత్తి చూపుచు నిట్లనియె. ఓసీ! నీవు రావణరాజు నెంత దూషించినను సైఁచి నిన్ను వలచియున్నాఁడే. దానివలననే నీపై నతని కెంత మోహమో యెఱుఁగఁ జాలవా? సముద్రమెక్కడ? దాఁటుట యెక్కడ? లంక యెక్కడ? ప్రవేశించుట యెక్కడ? రాముఁడెక్కడ? ఇది సాధ్యము, ఇది యసాధ్యమనియైన నాలోచింపలేవా? నీవెంత బుద్ధిహీనురాలవే సీతా! పంజరములో చిలుకను వేసినట్టు ని న్నీయంతఃపురములో నుంచి మేమిందఱము కావలి కాచియుండఁగా రాముఁడఁట! వచ్చునఁట! నిన్ను విడిపించుకొని పోవునఁట! ఏమి గొంతమ్మ కోరికలే. ఓసి సీతా! విను. నేనూరక పనికిమాలిన మాటలు మాటలాడుదానను గాను. నీ హితము కోరి యొక్కమాట చెప్పెదను. నా మాటలు చెవిలోఁ దూఱనిమ్ము. వలవల యేల యేడ్చెదవుగాని మా రావణుదేవివై సుఖింపుము అనిననింతలో ప్రక్కన కత్తి నూఱుచున్న యొకతె చివాలున లేచి ఏలయూరక గలగల యఱచెదరే. దీనిని జూడఁగా జూడఁగా నెప్పుడు దీని మాంసము తిందునా యని నోట నీరూరుచున్నది. మీరంద ఱావలపొండు. దీని గొంతు నులిమి చంపి సీతాదేవి బలవంతముగా చచ్చెనని పోయి రావణునకు చెప్పి



వచ్చెదను. సరి అందఱుపంచుకొని తినుఁడని రాజు చెప్పును. ఇంతలో నీ వింటికి పోయి నంజుకొనను ఊరుఁగాయ తెమ్ము

అని యీ ప్రకారమందఱు కూయనికూఁత అఱవని యఱపు లేక వారివారి యిష్టము చొప్పున వారువారు మాటాఁడగా సీతాదేవి చాలదుఃఖపడుచు వారితో నిట్లనియె. అమ్మలారా! నన్నేల మీరింత కష్టపెట్టెదరు? నన్ను మీరిప్పుడే చంపి తినుఁడు. వలదనుదానఁ గాను. మీమీ జాతీ మీమీ నీతి మీమీ తెలివి ననుసరించి మీరు పలుకుచున్నారుగాని ధర్మము నాలోచించి గాదు.

నీతి ధర్మము పుణ్యము సత్యము వీని నాశము చేసి రెండవవానిని పెనిమిటిగఁ జేసికొనుట కామము ప్రధానముగ నెంచు కులటలకుఁ దగునుగాని ధర్మము కీర్తి పుణ్యలోక సౌఖ్యము ప్రధానముగ నెంచు కులస్త్రీలకుఁ దగదు. రెండవ మగనిఁ గోరురండ మఱియెందఱ మగలనైనఁ గోరుచునే యుండును. అది దేహమును దేవతగాఁ గలదానిమార్గముగాని ధర్మమును దేవతగా నెంచుదాని మార్గము గాదు. స్త్రీలుగాని పురుషులు గాని కామము నెంత యణఁగఁ ద్రొక్కెదరో యంత చెడుదురు. కావునఁ బ్రతి పురుషుఁడు ప్రతి స్త్రీ దుష్కామ మణఁచుటకే సర్వవిధములఁ బ్రయత్నింపవలెను. ఉత్తములకు నధములకు దీనివలననే భేదము. ఇంతకు మీతో నాకు వాదేల? మీ యట్టి వారికి నీతి బోధజంప నా వశమా? నా నిశ్చయము నాది. మీరు నన్ను తునుకులు తనుకలుగ గోయుఁడు. కత్తులతో వ్రేయుఁడు. మండెడె మంటలలోఁ ద్రోయుఁడు. మీరెంత మిడిసిపడినను మిట్టిపడినను ఎగిరిపడినను మీ మాటలు నేను వినను. ముమ్మాటికి వినను అని తోడేళ్ళనడుమ చిక్కిన ఆఁడు జింకవలె రాకాసిమూఁకలలోఁ జిక్కి సీత దుఃఖించుచు వారితో నిట్లనెను.

అయ్యో! నా కెంతటి కష్టకాలము ప్రాప్తించెను. నా ప్రాణభర్తను విడిచి యింతకాలము జీవించియుండుట చూడఁగా అకాలమున స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని మరణము రాదని నిశ్చయమగుచున్నది. అయ్యో! మృత్యువునకుఁ గూడ నాపై దయ లేదాయెఁగా. ఇందఱు నన్నిట్లు బాధించెదరే గాని ఇదిగో తినుమని యింత విషము తెచ్చి యిచ్చు దయావతి యొకతెయు లేదుగదా. పూర్వజన్మమునం దేకొఱనోము నోఁచితినో ఆ కారణమున సుడిగాలికి సముద్రమధ్యమునఁ జిక్కిన నావవలె నల్లాడుచున్న దానను. ఇన్ని దినములైనను నా ప్రాణేశ్వరుఁడు రాఁడాయెఁగదా. వార్తయైన రాదాయెఁగదా. నా గతి ఆయనకు చెప్పువారెవరు? నే నిచ్చటనున్నదాన నని ఆయన కెట్లు

తెలియును? ఆ పుణ్యమూర్తి జటాయువైనఁ బ్రాణముతో నుండిన చెప్పియుండును. అతఁడును హతుఁడయ్యెఁగదా. రావణాసురు ననవేల? నా పాపమే యాపరోపకారిని వధించెను. నిర్భాగ్యులకు సాహాయ్యము చేయువారికిని కీడు కలుగును గదా! హారామా! హాలక్ష్మణా! అత్తా! అయ్యో! సుమిత్రాదేవీ! మీరొకరైన నన్నీ కష్టకాలముల నాదుకొన రారుగదా. నేనిచ్చట నుండు జాడ నాపతికిఁ గొంచెమైనను దెలిసెనా యా బలశాలి వదలువాఁడు కాఁడు. ఎట్టులైన లంకను దుమ్ము చేసి సముద్రములోఁ గలుపకుండునా? నా రాముఁ డాలంకలో కనవచ్చినపుడు కదా యింటింటను నా కొడుకా నా మగఁడా నా అన్నా నా తమ్ముఁడా యని నే నిప్పు డేడ్చినట్లు మీ రాక్షసస్త్రీ లందఱేడుతురు. అప్పుడుకదా వీథివీథి పాడెరాసులతోను పీనుఁగు కుప్పలతోను నిండి లంక విధవవలెఁ దోఁచును. లేదులేదు. ఇవన్నియు నుత్తకోరికలే. ఆయన కన్నులను చంద్రునివంటి ఆయన మోమును జూచు భాగ్యము నాకుఁ గలదా?

కం. ధన్యులు రఘుకులనృప మూ
ర్ధన్యుని నా హృదయనాథు రాముని నత రా
జన్యునిఁ రాజీవాక్షుని
మాన్యునిఁ గనుదేవసిద్ధమౌని ప్రవరుల్.

ఉ. ఇక్కడఁ బ్రాణయుక్తనయి యేడ్చుచునుండుట లక్ష్మణాగ్రజుం
డక్కడఁ దా నెఱుంగడొ కటా! యొకయింత యెఱింగియుండినన్
జక్కఁగ రోయ కేలుడుగు క్ష్మాతల మెల్లను? నన్నుఁ బాసి లోఁ
ద్రెక్కొను శోకవేగమునఁ దీఱనొకో యిఁక నేమి సేయుదున్

కం. పరమాత్ముఁడు ధీమంతుఁడు
నిరతము ధర్మైకరతుఁడు నృపఋషి యగునా
వరశీలున కాలయినన్
బరఁగెడి నా వలన నేమి ఫలమాయనకున్?

ఆ. కంటికెదుర నున్నఁ గడు ప్రేమ కలుగును
మఱుఁగుపడిన మైత్రి మఱపు గలుగుఁ
దథ్య మద్దియగుఁ గృతఘ్నులయం, దెదఁ
బ్రేమ మఱవఁ డెపుడు రామవిభుఁడు.



ఆ. అంత మంచిగుణము లమరవో నాయందుఁ
బుణ్యఫలము చూఱపోయెనేమొ?
ప్రాణతుల్యుఁడైన భర్తచే విడువంగఁ
బడితిఁ బడఁతి! గోడు గుడుచు దాన.

కం. ఎంతిటి ధన్యులొ ముని లా
వంతయు నేవంత లేక త్యక్తకలుషులై
స్వాంతముఁ బ్రియాప్రియంబుల
పొంతలఁ బోనీరు విజితబుద్ధీంద్రియులై.

కం. ప్రియమున సంతోషం బ
ప్రియమున నధికముగ భయము పృథివి జనించున్
భయమును ముదమును విడిచిన
యయగుణులకు మ్రొక్కుదాన నవహితమతినై.

అని యేడ్చుచుండ దూరమున నిద్రపోవుచుండిన త్రిజట యను వృద్ధ రాక్షసి లేచివచ్చి రాక్షసస్త్రీల నందఱఁ బిలిచి యిఁక మీమీ యధిక ప్రసంగములు చాలింపుఁడు. మీరటే రాముని భార్యను మ్రింగువారు తినువారు! ఆమె మాఱుగ మిమ్ముఁ దినుఁడు. ఏలయంటిరా? నే నిప్పు డొక కలగంటిని. దాని విధమును దెలిపెద వినుఁడు. నా దేహము నంటి చూడుఁడు. కలగన్నప్పుడు పుట్టిన వణఁ కిప్పటికిని వదలకున్నది.

ఆకాశగమనము గలిగి యేనుఁగు దంతములచే నిర్మింపఁ బడిన తెల్లని విమానమందుఁ దెల్లవస్త్రములు తెల్లమాలికలు ధరించి లక్ష్మణుతోడ శ్రీరాముఁడు వచ్చెను. ఈ సీతయును తెల్లనిచీర ధరించి శ్రీరాముపజ్జఁ గూర్చుండి యుండెను. వీరు భద్రేభము నెక్కి యీ లంకమీఁద నిలుచుండఁ జూచితిని. మఱియు సూర్యతేజము గలిగిన పుష్పక విమానమునఁ గూర్చుండి వీరుత్తరముగఁ బోవఁ గంటిని. రావణుఁడు నూనెను దేహమునకుఁ బూసికొని నూనె త్రావుచు నెఱ్ఱ గన్నేరు పూలదండలు ధరించి యెఱ్ఱగుడ్డలు కప్పుకొని నల్లగుడ్డ కట్టుకొని పుష్పకము నుండి నేలఁ గూలినట్లును, ఒకతె వానిని బట్టి యీడ్చుచుండినట్టును, వాఁడు గాడిదలు కట్టిన తేరిపైఁ గూర్చుండి దక్షిణము పోయినట్టును గంటిని. ఈ విధముగనే యింద్రజిత్తు కుంభకర్ణుఁడు దక్షిణమునకుఁ బోవఁ జూచితిని. విభీషణుఁడు మాత్రము తెల్లనిగంధము పూసికొని తెల్లవస్త్రములు కట్టుకొని

తెల్లమాల్యములు ధరించి శంఖ దుందుభి ఘోషములతో నేనుఁగు నెక్కి నలువురు మంత్రులతోడ నాకాశమునఁ బోవుచుండ వీక్షించితిని. లంక సముద్రములోఁ గూలినట్టు చూచితిని. రాముని భటుఁడొకఁ డొక క్రోఁతి వచ్చి లంకఁ గాల్చినట్టు కలగంటిని. ఈ కల ఫలము చూడ రామునకు జయము రావణునకు లయము తప్పదు. ఈమె భర్త సీతోఁగూడుట సిద్ధము. నా కల నిక్కల తప్పదు. కావున నూరక యామెను బీడింపక దూరముగఁ బొండు. మీ మేలుకోరిన వారైతిరా ఆమెకు నమస్కరించి క్షమింపుమని ప్రార్థింపుఁడు. మనమింత యదరించి బెదిరించి బాధించితిమే మనల రక్షించునా యని తలఁపవలదు. సీత మనస్కారప్రసన్న. ఈమె నమస్కారముచేతనే సంతోషించును. కావున నా మాట వినుఁడన వారందఱు లేచి అమ్మా! మమ్ముఁ గాపాడుము. ఇఁక నిన్ను బాధింపము అని మ్రొక్కి దూరముగఁ బోయి యింకను రాత్రి యుండుటచే పండుకొనిరి. సీతయునుదన స్థితిఁ దలంచుకొని యిట్లేడ్చుచుండెను.

సీ. తన వారిపట్లను బెనుదోస ముండిన
గుణము మాత్రముఁ గను గుణధనుండు
ఇంచుక యపకార మెవఁడు చేసిన దాని
విస్మృతినొందని విజ్ఞతముఁడు
తన్ను నమ్మినవాని ఖిన్నతకై తాను
విరవిరలాడెడి కరుణగలఁడు
అన్యుల యభివృద్ధి నాత్మఁ గోరుచునుండు
నిర్మలచిత్తుఁడు నిపుణతముఁడు

తే. పదియు నాలుగువేల దుర్మదులఁ ద్రుంచె
దానవుల నెక్కటిగ జనస్థానమునను
నట్టి నా ప్రాణభర్త దా నిట్టు కరుణ
మాలుటయు నాదు దౌర్భాగ్యమహిమ నేమొ?

సీ. నన్నిట్టు లరికట్టు నిన్నీ చబలుఁ ద్రుంపఁ
జాలియు నన్నేల నేలరాఁడొ?
దంటకాటవి విరాధు దండించినట్టి వీ
రాగ్రణి నన్నేల యరయరాఁడొ?
ఖరదూషణాదుల ఖండించి వైచిన
శూరుండు నన్నేల చూడరాఁడొ?
రక్కసుచేతిలోఁ జిక్కిన ప్రియురాలిఁ
బ్రోయాలి నన్నేల ప్రోవరాఁడొ?

తే. యుదధిమధ్యంబునను లంక యుండుఁగాక
యన్యులకు నెల్ల దుస్సాధమగును గాక
మహిమ జగముల నెందును మాఱులేని
రామబాణంబులకు నడ్డ మేమిగలదు?

సీ. కన్నతల్లికి మిన్న కరుణనఁ లాలించు
నా రామదూత! నాయత్తగార!
యత్తగారికి మిన్నయాదరించుచు నున్న
మైత్రీధీపాత్ర సుమిత్రదేవి!
కన్నతల్లిని బోలె మన్నించు నా ముద్దు
మఱఁది యో లక్ష్మణా! మహితచరిత!
తన ప్రాణముల కన్న ఘనముగా ననుఁ జూచు
ప్రేమసముద్ర యో రామభద్ర!

తే. యయ్యయో! రామ! లక్ష్మణా! హా సుమిత్ర
హేరఘూత్తమ జనని! యత్తా! యిటేను
గడలి నుడిగాలి నుడివడు కలము కరణి
మందభాగ్యను నిడుమల ద్రుందుదాన.

సీ. నీ వొక్కఁడవు దక్క నితరదైవము లే ద
టంచు నేఁ దలఁచిన యట్టి తలఁపు
వినఁగోరి నీ సూక్తి వికట రాక్షస పరు
షాలాపముల విను నట్టి యోర్పు
నీ తోడ శయనించు ప్రీతిమై నీనేలఁ
బడియున్న యట్టి యీ కడిఁది దిటము
రాముఁ డేటికి నన్ను రక్షింపకుండునన్
ధర్మమార్గంబున స్థైర్యవిధము

తే. నాదు పరమ పాతివ్రత్య నవ్యతదము
పాడుగాఁ బోయె నాదు దౌర్భాగ్యమునను

**ధరఁ గృతఘ్నున కొనరించు పరమకృతిని**
**బోలి నా పాపమెంత ప్రభూత మౌర!**

రుక్మిణి : అప్పా! సీతాదేవి కష్టము దుఃఖము వినుచున్న నాకును గంటనీరు వచ్చుచున్నది.

తండ్రి : అంతయుఁ జెప్పిన జాలఁ బ్రొద్దగును. మీరు నిద్రపోదురే యని సంక్షేపించి చెప్పుచున్నాను. ఆమె దుఃఖములో నాల్గవంతైనను జెప్పలేదు. ఆమె కష్టములు, దుఃఖాతిశయము, ఆమె యోర్పు, మనస్థ్సితి, మహిమ తెలియవలసియుండిన వాల్మీకి రామాయణమున సుందరకాండము ఉత్తరకాండము చదువుము. వానివలన హనుమంతుని మహిమ, సీతా దేవి మహిమ పూర్ణముగ తెలియును. సీతాదేవి యుత్తరచరిత్రమును విన్న మీ రేడువనే యేడ్తురు. అది రేపు చెప్పెదను. నేఁటి కిది వినుఁడు.

ఈ ప్రకార మేడిచి యేడిచి "ఇఁక శ్రీరాముఁడా రాఁడు. వచ్చునని యాశయు లేదు. నేనా నిద్రాహారములు లేక శుష్కించి శుష్కించి యున్నదానను. గడువా సమీపించుచున్నది. అది ముగియఁగానే కోసినట్లు గర్భిణి గర్భములోని మృతశిశువును శస్త్రచికిత్సకుఁడు కోసినట్లు తునుకలు తునుకలుగ రావణుఁడు నన్ను కోసివేయును. దుఃఖమా యిఁక సహింపలేను. కావున నురి పోసికొని మరణింతునా? బలవంతముగ మరణించిన సూర్యరశ్మి లేక గాఢాంధకారము గలిగి భయంకరమై దుర్గంధమయమయి యుండు నరకము ప్రాప్తించుట నిశ్చయము. ఆ దుఃఖము ఇప్పటి నా దుఃఖమునకంటె హెచ్చయినదా? కాదు. కావున ప్రాణమైనఁ బోగొట్టుకొందును గాని రావణాసురుని ఎడమ కాలిగోర నైనఁ దాఁకుదునా అని చివాలున లేచి కొమ్మ పట్టుకొని నిలఁబడెను. అప్పు డామెకు నెడమకన్ను ఎడమభుజము ఎడమతొడ యదరెను. అదిచూచి సీతాదేవి "యేమి యిది! నాకును శుభశకునము లగుచున్నవి. దుఃఖము లనుభవింపఁ బుట్టినదాననే. నాకును సుఖము గలుగునా?" యని యాలోచించుచుండ నామెకు సంస్కృతభాష యందీ వాక్యములు వినవచ్చెను.

## హనుమంతుఁడు సీతాదేవి వినునట్లు శ్రీరాముఁ బ్రశంసించుట

దశరథుఁడనుమహారాజు అయోధ్యకు ప్రభువు. మిక్కిలి ధర్మాత్ముఁడు. కీర్తిశాలి. దయావంతుఁడు. ఇక్ష్వాకు వంశాగ్రణి. ఆ మహాత్ముని పెద్ద కొడుకు



శ్రీరాముఁడు. లోకాభిరాముడు. సద్గుణధాముఁడు. సౌందర్యకాముఁడు. రణరంగ భీముఁడు. ముఖజిత సోముఁడు. పరాక్రమోద్దాముఁడు. దయానిస్సీముఁడు. మేఘశ్యాముఁడు. ఆ మహాత్ముఁడు తన తండ్రిని సత్యవాదిని జేయుటకై యతని పనుపున దండకారణ్యమునకు వచ్చెను. ఆయన భార్యయును దమ్ముఁడును వెంటవచ్చిరి. దండకయందు దుష్టులైన రాక్షసుల ననేకుల శ్రీరాముఁడు సంహరించెను. ఖరదూషణాదుల మరణము విని రావణుఁడను రాక్షసరాజు మాయలేడి నెపంబున శ్రీరాముల భార్యను అపహరించెను. ఆమెను వెదకుచు వచ్చి శ్రీరాముఁడు వానరుఁడగు సుగ్రీవుఁని వానరరాజ్యంబున నభిషేకించెను. ఆ సుగ్రీవుఁడును శ్రీరాముని దేవిని నానా దిక్కుల వెదకుటకై వానరుల పంపెను. వారిలో నేనొకఁడను. జటాయు సోదరుఁడైన సంపాతి చెప్పఁగా సీతాదేవి యిందున్నదని యెఱిఁగి నూఱామడ సముద్రమును దాఁటి లంకఁ జొచ్చితిని. సీతాదేవి యెట్టిదని నాకు శ్రీరాముఁడు చెప్పెనో యట్టి యుత్తమస్త్రీ రత్నము నిందుఁ గంటిని. నా పూర్వపుణ్యముచేఁ గృతార్థుఁడ నైతిని.

రుక్మిణి : అప్పా! హనుమంతుఁడు మంచి చమత్కారము చేసినాఁడు. దశరథుఁడని మొదలుపెట్టి యాయనను స్తోత్రము చేసి తరువాత రాముని పేరు చెప్పి యాయనను స్తోత్రము చేసి తరువాత వృత్తాంతమంతయుఁ దెలిపెను. దాని వలన ఆమె మొదటినుండి శ్రద్ధతో వినఁ గల్గెను. లేకుండిన ఆమె దుఃఖములో మునిఁగి హనుమంతుని వాక్యములు వినకయే యుండును. వినినను ఎవఁడో పరపక్షమువాఁడు చెప్పుచున్నాఁడని యైనఁ దలఁచి యుండును.

తండ్రి : మేలు మేలు. చక్కఁగ గ్రహించితివి. ఇట్టివి అనేక విధములైన చమత్కారములు రామాయణమున కొల్లలుగ నున్నవి. ఈ చరిత్రములు వినుటచేత మీకు పెద్దపుస్తకములు చదివి వాస్తవార్థము గ్రహించు తెలివి రావలయునని సదాచారములు పట్టుపడ వలయునని నా యుద్దేశము. మీకుఁ జదువు వచ్చినందునకు ఫలమది. తరువాత విను.

హనుమంతుని వాక్యమును విని సీతాదేవి యే దిక్కునుండి యా మాటలు వినవచ్చెనో యెఱుఁగక వ్రేలాడుచున్న ముంగురులు చక్క నెగయఁ ద్రోచికొని నాలుగు ప్రక్కలఁ జూచి యెందు నెవ్వరినిగానక క్రింద మీఁదు చూచెను.

తానున్న చెట్టు కొమ్మల సందున తెల్లని వస్త్రము ధరించి సూర్యకాంతిగల యొక క్రోఁతిని అశోక పుష్పచ్ఛాయ గల దేహముగల దానిని చూచి చలించి యత్రపడి అయ్యో! కలలో క్రోతిని చూడరాదందురే! నేను జూచితినే. ఇంక ఎవరి కేకీడు రానున్నదో. ఏమిగతి. ఏమి చేయుదును. రామలక్ష్మణులారా! మీ రెందున్నారో. ఏమిగనున్నారో అని భీతిచేతను దుఃఖముచేతను విసంజ్ఞయై శవమువలెనై తెలివి తెచ్చుకొని 'రానీ వచ్చుదానిని వలదనిన మానునా? అయినను ఈ దుస్స్వప్నమువలనఁ గలుగు కీడు శ్రీరామలక్ష్మణులకు నా తండ్రి జనకునకుఁ గలుగకుండుఁ గాక' యని యనుకొనుచు మరల నిట్టు లాలోచించెను. ఏమిది! నేను కలలో క్రోఁతిని జూచితినని భ్రమించుచున్నాను! నిద్దుర లేక కలలు వచ్చునా? ఇంత దుఃఖములో మునిఁగి యుండు నాకు నిద్దుర యెట్లు వచ్చును? ఇప్పుడు నేను నిద్రించు చున్నానా? లేదు. కావున నిది నిజమైన వానరమే. కాదు కాదు. ఇది కలయును గాదు. నిజమును గాదు. సర్వదా రామరామయని ధ్యాన మొనరించు చున్నదానను. ఆయన పేరే పలుకుచున్నాను. సంకల్పబలముచే ఆయన రూపమే చూచుచున్నాను. కావున ఆయన విషయమైన వాక్యములే వినుచున్నాను. నా మోహమే యొక వానరమై నా మనస్సులో నుండు వాక్యములే చెప్పుచున్నది. ఇది మోహము కాదు. మోహపడినపుడు బుద్ధి ప్రకాశించునా? ప్రకాశింపదు. ఇప్పుడు నా బుద్ధి చక్కఁగ ప్రకాశించుచున్నది. మోహమున కొక రూపము గలదా? లేదు. అంతియగాక యీ క్రోఁతి నన్నుఁ జూచియే మాటలాడుచున్నదే. ఇది మాయ యెట్టులగును? కాదు. నిశ్చయమే యగును అని యాలోచించి దేవతలారా! యిప్పు డీక్రోఁతి పలికిన పలుకులెల్ల సత్యము చేయుఁడీ అని చేతులెత్తి నమస్కరించెను.

### హనుమంతుడు సీతాదేవితో సంభాషించుట

ఈ లోపల చెట్టు కొమ్మనుండనని హనుమంతుఁడును సవినయంబుగ మెల్లగ పై కొమ్మనుండి కొంచెముగ క్రింది కొమ్మకు దిగి సీతాదేవిని జూచి యిట్లు పలికెను.

**శా.** **అమ్మా! యెవ్వతెవమ్మ? నీ విచట నేలా మైలకౌశేయచే**
**లమ్ముం దాలిచి కొమ్మయూఁతగఁ గొని నిల్చెన్? బద్మపత్రంబులం**
**దిమ్మై కాఱుజలంబు నాఁ గఁనులం దిట్లేల శోకాశ్రుపూ**
**రమ్ముల్ గ్రమ్మెడి? నానతీయఁ గదవే ప్రార్థింతు సాధ్వీమణి!**



తల్లీ! నీవెవ్వతెవు? కిన్నరకన్యకవా? యక్షపయోజాక్షివా? అమరభామినివా? చంద్రునిఁ బాసి వచ్చిన రోహిణివా? వసిష్ఠుని విడిచి వచ్చిన యరుంధతివా? నిన్ను దేవతవలెనే తలంచుచున్నాను.

అమ్మా! నీ వెవ్వరిదానవు? ఎందుండి యిందు వచ్చితివి? నీ తండ్రి యెవరు? నీ యూరేది? నీ భర్త యెవరు? నీ తోడఁ బుట్టువులెవ్వరు? ఏల యిచ్చటికి వచ్చితివి? నీ కొడుకు పేరేమి? నీ యేడ్పు చుండుటను, భూమిపై నిల్చియుండుటను, ఊర్పులుండుటను రాజకన్యక లక్షణము లుండుటను, నీవు సురతరుణివి కావని తోఁచు చున్నది. నీ చిహ్నములఁ బట్టి నీవు క్షత్రియ స్త్రీవని ధరాచక్రంబు వహించు గొప్ప రాజపత్నివని తలంచెదను. దండకాటవిని గ్రుమ్మరుచుండ రావణుఁడు బలాత్కారముగాఁ బట్టి తెచ్చి సీతాదేవివా? చెప్పుము. నీకు మేలగును. అతి మానుష సౌందర్యము వ్రతయుత వేషము దేహవైవర్ణ్యము చూడ నీవు రామునిదైవివైన సీతవే యని నమ్ముచున్నాను. నిజముగ నీవు జానకివే కదా? అనిన సీతాదేవి తన భర్త పేరు వినఁగలుగుటకు సంతోషించి చెట్టుపై నున్న హనుమంతునితో నిట్లనియె.

అవును. నేను జనక రాజు కూఁతురనే. దశరథరాజు కోడలను. శ్రీరాముని భార్యను. నాపేరు సీత యందురు. పండ్రెండు సంవత్సరములు సుఖముగా మనుష్యభోగము లనుభవించుచు నా భర్తను గూడి యుంటిని. పదుమూఁడవ సంవత్సరమున నా మామగారు మంత్రిపౌరుల సమ్మతిని నా భర్తకు యౌవ రాజ్యపట్టాభిషేక మొనర్ప యత్నించెను. ఆ వార్తవిని యాయన ప్రియురాలగు కైక పట్టుపట్టి నీవురాముని రాజుగఁ జేసితివా నేను కూడుదినను. నీళ్ళు ద్రాగను. ఇంతటితో ఈ దేహము తోడి పొత్తు ముగిసెను. ఇప్పుడే ప్రాణములు పోఁగొట్టుకొందును అని అంపు చేసెను. రాజుగారును ఆమె కఠోర వాక్యములు విని సహింపలేక యేడిచి తన మాట నిలుపుకొనుటకై పెద్ద కొడుకును బిలిచి "నాయనా! నీ రాజ్యము భరతునకిచ్చి నీవు పదునాలుగు సంవత్సరము లడవికి పొమ్మ"ని చెప్పెను. రాజ్యమున కంటెను ప్రియమైన తండ్రి వాక్యము విని రాముఁ డడవికి బయలుదేఱెను. ఏలంటివా? నా మగఁ డేకారణముచే నైన నాలరి పలుకు పలుకఁడు. ఒకరికిచ్చునే కాని యొకరిచేఁ బుచ్చు కొనఁడు. ఇట్లు బయలుదేఱి నన్నుఁ దనతల్లికి నప్పగింపఁ దలఁచెనుగాని యాయనను విడిచిన యెడ స్వర్గమైనను నాకు రుచింపదు. కావున రామునికంటె ముందే నేను బ్రయాణమైతిని. లక్ష్మణుఁడు మాకంటె

ముందే నారచీరలు ధరించెను. ఇట్లు మేము మువ్వురము దండకయందుఁ జరించుచుండ రావణుఁడు నన్ను దొంగిలి తెచ్చెను. ఇచ్చట దిక్కులేని దాననై యిట్టు లేడుచుచున్నదానను. నాకు రావణుఁ డిచ్చిన గడువులో రెండు మాసములు మిగిలెను. ఈలో నా ప్రాణేశ్వరుఁడు వచ్చి నన్ను రక్షించునని యాశతో దేహము నిలిపియున్నదానను. ఆయన రాకపోయెనా నాకు మరణమే శరణము అనిన హనుమంతుఁ డిట్లనియె.

తల్లీ! నీకు రామచంద్రుఁ డొక్క సందేహమంపఁగా వచ్చితిని. రామ లక్ష్మణులు సుఖమున్నారు. తమ క్షేమము నీ తోడ శ్రీరాముఁడు చెప్పుమనెను. లక్ష్మణుఁడు కన్నుల నీరుగాఱ నీకు నమస్కరించి నని చెప్పుమనెను. వారు నీ సేమ మెఱుఁగఁ గోరియున్నారు అనిన సీతాదేవి మేన గగ్గురు పొడువ సంతోషమున నుప్పొంగి యిట్లనియె.

**కం.** **తనువునఁ బ్రాణము లుండినఁ**
**గనుఁగొను నూఱేండ్లకైనఁ గడుహర్షంబున్**
**మనుజుండను సామెత ము**
**న్ననుకొనఁగా వింటి నది యథార్థము చూడన్.**

అని ప్రియువార్తఁ దెలిపిన హనుమంతుని యెడఁ బ్రీతిఁజూపి మఱికొంత సంభాషించెను. ఒకరినొకరు నమ్మి కొంత సంభాషణము జరగఁగా హనుమంతుఁడు మెల్లమెల్లన సీత సమీపమునకు వచ్చెను. తిన్నతిన్నగఁ దనయొద్దకు హనుమ వచ్చు కొలఁది సీతాదేవి రావణుఁడు మున్ను సన్న్యాసివేషముతో వచ్చినట్టు లిప్పుడు మాయక్రోఁతి వేషముతోఁ దన్ను మోసగింప వచ్చుచున్నాఁడని తలఁచి యయ్యో! యెంత మోసపోయితిని? రావణుఁడే యిటు వచ్చెనని యూహింపలేక వీనితో మాటలాడితిని. ఎంత ప్రమాదము? అని భయమున గడగడ వడఁకుచుఁ బట్టుకొన్న కొమ్మను విడిచి తటాలున నేలఁ గూలఁబడి హనుమంతుని దిక్కు చూడక యతనితోఁ బలుకక మౌనము వహించి యూరకుండెను. హనుమంతుఁడును రెండు చేతులు జోడించి నమస్కరించి యెదుట నిలఁబడెను. సీతయు

**చం.** **తెలిసితి లేర నిన్ను నిటు తెక్కలివేషము వేసి రావణా!**
**కలఁచెద వేలరా? శుభము గాదుర నీకిది, దండకాటవిన్**
**వలనుగ భిక్షురూపముగ వచ్చిన మాయలమారి నీవె దు**
**ర్బల నుపవాసదీనఁ దగవా యిటు కాఱియ పెట్ట రాక్షసా!**



అని తనలోఁ దానిట్లు తలంచెను. ఆలోచించి చూడ నితఁడు రావణుఁడు గాఁడనియును దోఁచుచున్నది. ఎన్ని వేషములు వేసినను రావణుఁడే వీఁడై యున్న యెడల వీనిమీఁద నాకుఁ బ్రీతి యుదయించుచున్నది. గావున వీఁడు రావణుఁడు గాఁడు. ప్రవాహము తీరమును దనలోని కీడ్చుకొనునట్లు వీని సౌమ్యాకారము నా చిత్తము నాకర్షించుచున్నది. పోనీ యితడు రామునిదూతయే యందునా యనిన నెక్కడి రాముదూత ఎక్కడి క్రోఁతి. సముద్రమెట్లు దాఁటెను? ఇక్కడ కెట్లు వచ్చెను? అదియును నమ్మరాకున్నది. కలయందునా? కలయును గాదు. కలలోఁ గ్రోఁతిని జూచినఁ గీడు కలుగవలయును. నాకు శుభశకునము లగుచున్నవి. ఏదియుఁ గాదు. ఇది నా మనస్సు కలవరపాటు. లేదా వాత లక్షణము. అది కాదనిన పిచ్చి. నాకుఁ బిచ్చి లేదనిన నిది యెండమావు. రాత్రులందు నెండుమావు కలుగునా? ఎండమా వెక్కడనైన స్థూల రూపము గలది యగునా? స్పష్టముగా వానరుఁడు కనఁబడుచున్నాఁడు. మాటలాడుచున్నాఁడు. నడచు చున్నాడుఁ ఆడినమాట లర్థము చేసికొని సరియైన ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు. నాకేమైన మతిభ్రమమా యన నాకును స్మృతి లెస్సయున్నది. కాఁబట్టి యేదియుఁ గాదు. కలకాదు. రాముని దూతయును గాఁడు. దొంగ రావణుఁడే యిట్లు కపిరూపతో వచ్చెను. నిజము. కావున వీనితో మాటలాడ రాదని యూరకుండెను. ఆమెకుఁ గలిగిన సందేహమును హనుమంతుఁ డెఱిఁగి యిట్లునియె.

తల్లీ! నీవు నన్నెవ్వనిగ దలఁచితివో యట్టి రావణుఁడను నేను గాను. నీ నిమిత్తమై వానిని వాని పుత్ర మిత్రామాత్య బంధువులను నిర్మూలింప సిద్ధపడియుండు భీకరకాండ ప్రకాండ సముద్ధండ కోదండ దండ ధరుండును, రాక్షసుల పాలిటి దండధరుండను, నీ మనోహరుండును నగు శ్రీరాముని దూతను. నా పేరు హనుమంతుఁడు. నేను వానర రాజగు సుగ్రీవుని మంత్రిని. వారిధి దాఁటితిని. లంక జొచ్చితిని. ఆ దురాత్ముఁ డైన రావణుతలపై నా యెడమకాలితోఁ దన్ని నిన్నుఁ జూడ వచ్చితిని. సందేహము విడువుము. భయము మానుము. విశ్వసించి మాట్లాడుము. నేను బడిన శ్రమమును వ్యర్థ పఱుపకుము. తల్లీ! నీ వూరకుండిన నేను ఏమని మరలి పోదును? పోయి రామలక్ష్మణులతో నేమని చెప్పుదును? వారేమని యిచ్చటికి వత్తురు? అమ్మా! నాపట్ల నీ సందేహమునకుఁ గారణము

లేదు. నీవు మనసిచ్చి మాటలాడుము. మగవారు సమీపమున లేనితఱి నిన్ను మోసగించి దొంగిలించి తెచ్చిన పాపాత్ముఁడు దుష్టుడు దొంగ నీచుడు. దాని ఫలమును శీఘ్రముననే యనుభవించును. నన్ను నమ్ముము.

సీ. **నీ వియోగంబున నెవ్వగ రాముండు**
**నీ సేమమడిగె నో నీరజాస్య**
**సౌమిత్రి దర్భక్తి సాష్టాంగ మెరఁగి నీ**
**కుశలంబుఁ గోరెమో కోమలాంఘ్రి**
**రాముని మిత్రుండు రాజు క్రోఁతులకెల్ల**
**సుగ్రీవుఁ డడిగె నీ శుభముఁ దల్లి**
**సౌమిత్రి సుగ్రీవ సహితుఁడై రాముండు**
**సంస్మరించును నిన్ను సతము దేవి**

తే. **రాక్షసులకును జిక్కియు రాజవదన!**
**భాగ్యవశమున నిందాఁక బ్రదికియున్న**
**దాన వింకిటఁ దూర్ణంబ తరుణి! కనెద**
**రాము లక్ష్మణు వానరస్తోమ విభుని.**

అనిన సీత రామలక్ష్మణు లెట్టివారు? వారిని నీవు తెలియఁ గారణమేమి కలిగెను? నరవానరులకుఁ జెలిమి యెట్లు ఘటిల్లెను? అన్నదము లెట్టి లక్షణములు గలవారు? తెలుపుమనిన హనుమంతుఁడు సంతసించి తల్లీ! నన్ను విశ్వసించి మౌనము చాలించితివి. ధన్యుడనైతిని. నీ ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరములు వినుమని సాముద్రిక శాస్త్రము ప్రకారము రామలక్ష్మణుల గుర్తులన్ని తెలిపి మఱియు నిట్లనియె.

నిన్ను రామలక్ష్మణులు వెదకుచు పంపాతీరమునకు వచ్చిరి. దాని సమీపమున ఋశ్యమూకమను పర్వతము గలదు. అందు సుగ్రీవుఁడు నలువురు మంత్రులతోడ నుండి మౌనివేషములు ధరించి శరచాపహస్తులైన రామలక్ష్మణులను జూచి భయపడి నన్ను వారి యొద్దకుఁ బంపెను. నేను బోయి వారితో సంభాషించి వారి నిద్దఱను మోచికొని సుగ్రీవునొద్దఁకు దెచ్చితిని. వారివారి స్థితిగతులు వారిరువురు మాటాడుకొనిరి. అందుఁ దనయన్నయగు వాలిచేఁ దఱుమఁ గొట్టఁబడి తాను బడు కష్టములన్నియు సుగ్రీవుఁడు దెలిపెను.



రాముఁడు తన దుఃఖమును సుగ్రీవునితోఁ జెప్పెను. సుగ్రీవుఁ డామాట విని చాలా దుఃఖించెను. నిన్ను రావణుఁ డెత్తుకొని పోవునపుడు నీవు చీరకొంగున ముడివైచిన యాభరణములు నేనెత్తి పదిలపఱిచి యుంచితిని. దానిని సుగ్రీవుఁడు రామునకుఁ జూపెను. అమ్మా! దానిని జూచి రాముఁడు పడిన పరితాపము ఏడ్చిన యేడ్పు నే నేమని చెప్పుదును. దుఃఖముచే మూర్ఛపోయి పడిన నీ భర్తకు నేనే యుపచరించి స్మృతి గలిగించితిని. వాలిని జంపి సుగ్రీవునకుఁ బట్టాభిషేకము చేయ రాముడుఁ బ్రతిన యొనర్చెను. నిన్ను వెదకించి వార్తఁ దెచ్చుటకును నిన్ను హరించిన దుష్టుని వధించుట యందు దోడ్పడుటకును సుగ్రీవుఁడు ప్రమాణము చేసెను. ఇట్లగ్ని సాక్షికముగ వారికి మైత్రి కుదిరెను. వాలిని జంపి రాముఁడు సుగ్రీవునకుఁ బట్టాభిషేకముఁ గావించెను. సుగ్రీవుఁడును నిన్ను వెదకుటకై నానా వానర సమూహములను దిక్కు దిక్కునకుఁ బంపియున్నాడు. అందు యువరాజకు నంగదునితోడ నేను మఱికొందఱము బయలు దేఱి దక్షిణదిక్కుగ వచ్చి యొకగుహలోఁ జొరఁబడి వెడలు మార్గము గానక తపించు చుండఁగనే సుగ్రీవుఁడు మాకు నియమించిన నెల గడువు గడచిపోయెను. ఆ గుహయందలి స్వయంప్రభ యను తపస్విని సాహాయ్యముచే వెలుపల వచ్చితిమి. గడువు మీఱుట చేతను నీ జాడ తెలియని చేతను మరలిపోయిన సుగ్రీవుఁడు దండించునని యందఱము ప్రాయోపవేశము చేసితిమి. అప్పుడా కొండపై నున్న జటాయు సోదరుఁడు సంపాతియను గృధ్రరాజు మమ్ముఁ దినుటకై వచ్చి మాలో మేము రావణుఁడు నిన్ను హరించుట, జటాయువును జంపుట, లోనగు వార్తలు మాటలాడుచుండ విని తమ్మునికై దుఃఖించి నీ విచట నున్నదానవని తెలిపెను. అప్పుడు అందఱు నన్నుఁ బొమ్మని పంపిన నేను సముద్రము దాఁటి వచ్చి యిచ్చట నిన్నుఁ గంటిని. నేను నిజముగ వానరుఁడను. వాయుదేవు ననుగ్రహమున అంజనా దేవియందు జనించిన వాఁడను. తల్లీ! నీకై రాముఁడు దుఃఖించు విధము నే నేమని చెప్పుదును. అగ్నులచే నగ్ని గృహమువలెఁ దపించుచున్నాఁడు. ఆహారము గొనఁడు. నిద్ర గానడు. ఎంత మనోహరమైన కుసుమములను జూచియు సంతసింపఁడు. నీకు నమ్మిక కలుగుటకై యింతయుఁ జెప్పితిని అనిన సీతాదేవియు నతఁడు నిక్కపు వానరుఁడని రాముని దూత యని విశ్వసించెను. ఆమె ముఖారవిందము ప్రసన్నమయ్యెను. దానిని జూచి హనుమంతుఁడు మరల నిట్లనియె.

అమ్మా! నన్ను నమ్మితివి గదా. ధన్యుఁడనైతిని. నేనిఁక జాగు చేయరాదు. మరలిపోయి రామునకు నీ వార్త దెలిపి వారల నెల్ల నిటకుఁ దోడి తేవలయు. కావున నెవ్వరెవ్వరికి నేమేమి చెప్పుమనెదవు? నావలన నీకుఁ గావలసిన దెయ్యది? చెప్పుము. వీఁడు క్రోతిపిల్లవాఁడు. వీడేమి చేయఁగలఁడని తలఁపకుము. నేను వాయుదేవుని పుత్రుఁడను. గావున నాయనజప బలగరిమలు నాకును గలవు. ఇప్పటికిని నీవు నన్ను నమ్మవేని యిదిగో రామనామాంకితమైన ముద్రికను. చూడుము. ఆనవాలుగా నీ పతి యీ కింకరుచేత నీకిమ్మని యిచ్చెను. దీనివలన నీ సందేహము తీరు ననియుఁ జెప్పెను అని రామముద్రిక యామె చేతి కిచ్చెను.

అమ్మణ్ణి : హనుమంతుఁడు పిచ్చిపని చేసినాఁడు. మొదటనే యీ యుంగరము చూపియుండిన సీత నమ్మి యుండును గదా. ఇంత శ్రమమేల?

రుక్మిణి : హనుమంతునకుఁ గాదు పిచ్చి నీకు. తొలుతనే దానిని చూపియుండిన అది గూడ రావణుని మాయ యని సీత తలఁచియుండును. లేక నమ్మెనా రావణుఁడు రామలక్ష్మణుల కేదియో కీడు చేసి తెచ్చె ననియైన నామె మఱింత యేడ్చుచుండును. ఇతర కారణములచే నమ్మిన తరువాత దానిని జూపుటవలన నమ్మిక బలపడెను.

రాముఁడు, కృష్ణుఁడు : రుక్మిణమ్మ చెప్పినదే సరి.

రంగన్న : శ్రీరాముల నాఁటికే యక్షరములు కలవా?

తండ్రి : లేక యేమి?

రంగన్న : అక్షరములు వ్రాఁత లేని కారణముచే వేదములు వినుటవలననే పూర్వము నేర్చుకొనుచుండిరని, దాని వలననే వేదములకు శ్రుతులను పేరు వచ్చినదని కొందఱందురే.

తండ్రి : అక్షరములు వ్రాఁత యుండినను లేకుండినను వేదములు గురుముఖముగా విని నేర్చుకొనవలయును. పుస్తకములలో నెన్ని క్రింద గీఁతలు పై గీఁతలు గీచినను అవి క్రొత్తగా నేర్చుకొనువానికిఁ బ్రయోజనపడవు. గురుముఖముగా నేర్చుకొనిన వానికే సాహాయ్యపడును. రాగము తాలము పేర్లుచెప్పి పాట వ్రాసి చేతికిచ్చిన



నెట్టివాఁడైనఁ బాడఁ గలఁడా? వాని నోటికి వచ్చినది వాఁడు పాడునే కాని కవి యుద్దేశమునకు సరిగ శుద్ధముగాఁ బాడఁజాలఁడు. ఆ కారణము చేతనే పుస్తకము చూచి నేర్చుకొనిన కొందఱు వేద వాక్యములను గర్ణకఠోరముగ వదరుచు వేదపురుషుని జంపి తాము నరకము పాలవుచున్నారు. సంగీతమునకు వలె వేదమంత్రములకు స్వరము ప్రధానము. స్వరము చక్కఁగ జెప్పిన మంచి ఫలములిచ్చు మంత్రములే స్వరము తప్పినపుడు విపరీత ఫలముల నిచ్చును. ఇంద్రుని జంపు కొడుకు పుట్టవలయునని యొకరు యజ్ఞము చేయఁగా మంత్రమున స్వరముతప్పు చెప్పుటచే నింద్రునిచేఁ జచ్చు కొడుకు పుట్టెను. మనువు కొడుకు పుట్టవలయునని యజ్ఞము చేయఁగాఁ గూతుఁరు పుట్టెను. ఏడవయేఁట నుపనయనమైనది మొదలు రేయిపగ లదే పనిగా నితర చింతలు విడిచి వేదము నేర్చుకొని బ్రాహ్మణాదులే స్వర మొక్కొక్క చోటఁ దప్పు చెప్పుచుండఁగా నితర కార్యములందు మనస్సుంచి దినమంతయుఁ గడుపువారు స్వరము తప్పక నేర్చుకొనుట సాధ్యమా? కావున వారు స్వరము తప్పు చెప్పి కీడు కలిగించు కొందురనియే వారి మేలెంచి కొందఱకు వేదాధ్యయనము నిషేధింపబడినది గాని యాసూయచేతఁ గాదు. తొలుత భగవంతుని వలన వినవచ్చినవి కావున శ్రుతులనఁ బడెను.

ఇట్లు హనుమంతుఁ డిచ్చిన తన పతిపేరు చెక్కఁబడి తన పతివ్రేల ధరించుచుండిన యుంగరమును సీత చూచనెరి తన ప్రాణవిభుఁడే యెదురుగ వచ్చినట్లు సంతోషించి యానందాతిశయమున మైమఱచి రాహువు పట్టి విడిచిన చంద్రబింబమువలె ముఖము ప్రకాశింపఁ దనపతి సేమము దెల్పుచున్న హనుమంతుని జూచి మెచ్చుకొనుచు నతని నిట్టు నుతించెను.

ఔరా! ఆంజనేయా! నూఱామడ సముద్రము నొక్కఁడవు గోష్పదమువలె దాఁటి లంకఁ జొచ్చి శోధించితివి కదా. నీవే శూరుఁడవు. నీవే ప్రాజ్ఞుఁడవు. కపీంద్రా! రావణుఁ డనిన నీకు భయము సంభ్రమము లేమిని నీవు సామాన్య వానరుఁడవు గావు. నా ప్రాణేశ్వరునకు దూత వగుటచే భాషింపఁ దగుదువు. ఏలన నా భర్త కార్యము సాధింపఁ బంపునపు డన్నివిధములఁ బరీక్షించి యోగ్యతగల వానినే పంపునుగాని హీనులను బంపఁడు. అదు నాయొద్దకుఁ బంపునపుడు సామాన్యునిఁ బంపునా? తండ్రీ! కౌసల్యానందనుఁ డానందమున

నున్నాఁడు కదా. అయ్యా! సౌమిత్రికి సేమమా? రాముఁడు సుఖి యయ్యెనేని నాకై కోపము వహించి యింకను భూమిని సముద్రమును దహింపలేదు గదా. అన్నా! నా పాపఫలము వలన వారింతవఱ కూరకున్నవారు గాని దేవతల నైన జయింపఁగల వారికి రావణుఁ డొకలెక్కా? నా గతి యిట్లుండనీ, నాకై యాయన దుఃఖింపకున్నాఁడు కదా.

సీ. **ఏమఱఁడే కదా యెల్లకార్యంబులు**
**దీనుఁడై సంభ్రాంతి వానరేంద్ర!**
**పురుషకారము లెల్లసరిగఁ జేయునుగదా**
**యా రాజనందనుం డాంజనేయ**
**సలుపునా మిత్రుల శత్రులయెడ రెండు**
**మూఁడుపాయంబులు మోసపోక?**
**గడవ సేయును గదా కడు మిత్రవర్గంబుఁ**
**జెలికాంద్రు రతనిఁ జింతించునొక్కొ?**

తే. **దేవతానుగ్రహమును జింతించునొక్కొ?**
**పౌరుషంబును దైవంబు పరఁగుచున్నె ?**
**కరము దన్వైన నామీఁదఁ గరుణగలఁడె?**
**ప్రోచునా నన్ను నీ బాధ త్రోచి తండ్రి ?**

అయ్యా! ఆ మహాత్ముఁ డాగర్భ శ్రీమంతుఁడు. పుట్టుభోగి. కష్టముల కనర్హుఁడు. అట్టివాఁడు నాకై శోకంబుననవయలేదు గదా! కౌసల్యయు సుమిత్రయు భరతుఁడు సుఖమున నున్నట్టు వార్తలు వచ్చుచున్నవా? భరతుఁడు నానిమిత్తమై యన్నకుఁ దోడుగా నక్షౌహిణిసేవనంపునా? సుగ్రీవుఁడిచ్చటికి నెపుడు వచ్చును? నానాస్త్రముల సౌమిత్రి రాక్షసులనఱకుటకు సిద్ధముగా నున్నాఁడుగా? తలలు తునిఁగి పడిన రావణు నేనెప్పుడు చూతునో! నాకిట్టి దుర్దశ సంభవించెనని నా పతి కొంచెమైన దుఃఖించుచున్నాడా? 'రామా! అడవికి పో' అని సవతి తల్లి చెప్పినపుడు త్రిమాట మీఱుట ధర్మహాని యని తలఁచి యేమియు ముఖవికారమునైన నొందనివాఁడు. నేను కాలి నడనడవిలో రాలలో ముండ్లలో వచ్చుచుండుట చూచియు వగవని ధీరుఁడు. నేఁడు దీనుఁడై ధైర్యము విడువలేదు గదా. సత్యము చెప్పుము. పద్మగంధమై యందమై నాకనులకు బూర్ణచంద్రబింబము వంటి దగు నా పతి ముఖకమలము నా విరహము చేత నీటిఁ బాసిన తామరవలెఁ గాలేదు కదా? ఆంజనేయా! నేనేమని చెప్పుదును.



నా యందున్న ప్రేమకంటె నా పతికిఁ దన తల్లిదండ్రుల యందును మిత్రులఁ యందును నెక్కువ ప్రేమము లేదు. సమానప్రేమ మునులేదు. ఆ కారణము చేతనే కదా యాయనవార్త తెలియు వఱకు దేహము నిలిపియున్న దానను అని సీత రాముని వార్త విను కోరికతో నేమియుఁ బలుకకుండెను. ఆంజనేయుఁడును సీతాదేవి కిట్టు ధైర్యము చెప్పెను.

అమ్మా! నీ విచ్చట నున్నదానవని రాముఁ డెఱుఁగఁడు. కావున ఆయన రాక తడ వాయెను. నేను బోయి చెప్పుటే కొఱఁత. వెంటనే వానర భల్లూక సేనలతోడ వచ్చి సముద్రము దాఁటి లంక ముట్టడించి రాక్షసులనెల్ల నీ భర్త శీఘ్రమున వధించును. భయపడకుము. నీ నిమిత్తమై వచ్చునపు డెట్టి వారడ్డపడినను వారిదిమ్ము వదలించును. విచారపడకుము. రామునకు నీ మీఁద ప్రీతి గలదో లేఁటయని సందేహించెదవే. ఆయన దుఃఖము నే నేమని చెప్పుదును.

కం. **సింగముచేఁ జిక్కిన మా**
**తంగమువలెఁ ద్వద్వియోగతా పార్దితుఁడై**
**యంగన! సుఖము నెఱుంగఁడు**
**పొంగతి కృశియించుఁ బూఁటపూఁటకు దేవీ!**

కం. **దోమలు నీఁగలుఁ బురుఁగులుఁ**
**బాములుఁదను వెరియ మీఁద బ్రాఁకుచునున్నన్**
**రాముఁడెఱుంగఁ డొకింతయు**
**భామిని! నీయంద యుంటఁ బ్రాణము లెల్లన్**

సీ. **నీ చక్కఁదనమును నీదు సౌశీల్యంబు**
**చెలువరో! ధ్యానంబు చేయుఁ జేయుఁ**
**జేయుచో నీ రూపు చెలువు కన్నులఁ గట్ట**
**సుందరీ! నివ్వెఱఁ జూచుఁ జూచుఁ**
**జూచినన్ బాసితే సుదతిరో! యంచును**
**గన్నులబడి నీరు గార్చుఁ గార్చుఁ**
**గార్చి నే వేరీతిఁ గనుఁగొందునో కదే**
**మెలఁత నంచును గడు మిడుకు మిడుకు**

**తే.**　**నన్నుమేది స్మరింపఁ దనంగబాణ**
**తాపమునఁ జేసి కనుమూయఁ దలఁపఁ డెపుడు**
**దలఁచెఁబో యంతలోన సీతా! యటంచు**
**నులికిపడి లేచు మదిలోనఁ గళవళించు.**

పండో పువ్వో మఱి యే మనోహర పదార్థమో మే మెవ్వరైనఁ దెచ్చి యిచ్చినను దానిని జూచి సీతా సీతాయని కన్నీరు గార్చునే కాని యుపయోగింపఁడు, దినదినము సాయంకాలమున నేదో యింత కాయో కసరో భుజించును! అనిన విని సంతోషించి సీతాదేవి యిట్లనియె.

జగత్ప్రాణనందనా! రాముఁడు నన్నే తఁలచుచున్నాఁడు; రాముఁడు నా నిమిత్తమై మిక్కిలి చింతచే నవయుచున్నాఁడను. నీ వాక్యము అమృతమును విషముతోఁ గలిపి యిచ్చినట్టు లయ్యెను.

**కం.**　**భూరితరైశ్వర్యముననొ**
**దారుణ దుఃఖమున నేనిదైవము త్రాటఁ**
**బూరుషుని గట్టి యాడ్చును**
**ధారిణిపై జీవికిని స్వతంత్రత గలదే?**

**ఆ.**　**విధిని దాఁటు జీవి విశ్వంబునను లేదు**
**వానరేంద్ర! యింతవట్టు నిజము**
**రామచంద్రవిభుని సౌమిత్రినిఁ నన్ను**
**నెట్లు పఱచెఁ గంటి వేక కదయ్య.**

**ఉ.**　**ఎప్పుడు వచ్చునొక్కొ మనుజేంద్రుఁడు? రాక్షసకోటిఁ బట్టితా**
**నెప్పుడు ద్రచ్చునొక్కొ? దనుజేంద్రుని గట్టి శరాలిపాలుగా**
**నెప్పుడు ద్రుంచునొక్కొ? యసురేంద్రుని నీటికి మూలముట్టుగా**
**నెప్పుడు దలంచునొక్కొ నను నెప్పుడు చూచెడి నొక్కొ పావనీ.**

హనుమంతా! నాకు రావణుఁడు సంవత్సరము గడువిచ్చెను. పదియవ మాసమిది చెల్లుచున్నది. ఇఁక రెండు మాసములే కొఱఁత. కావున నీ లోపలనే వచ్చుచున్నట్లును నన్ను రక్షించునట్లును నా పతిని దీనరింపుము. ఈ లోపల మంచిబుద్ధి పుట్టి రావణుఁడు నన్ను విడుచునని తలంపకుము. రావణు తమ్ముఁడు విభీషణుఁ డెన్ని విధములనో యతనికి బుద్ధి చెప్పెను. గాని చావనున్న వానికి బథ్యము రుచింపనట్లు ఆ మాటలు వానికి



కటువులాయెను. దురభిమానికి సాధువాక్యములు రుచించునా? విభీషణుని భార్య సరమ పతియాజ్ఞ బడసి తన కూఁతు రగు అనలచే నాకీ వార్త చెప్పి పంపెను. నా యంతరాత్మ నే నీ చెఱ నుండి నా పతిచే విడిపింపఁ బడుదునని దృఢముగఁ జెప్పుచున్నది. నా యంతరాత్మ పరిశుద్ధమైనచో నెన్నియో గుణములు గలవు. ఉత్సాహము, పౌరుషము, బలము, పరాక్రమము, దయ, కృతజ్ఞత, ఉదారత యీ గుణములన్నియు నా మగనియందే కలవు. ఆయన కసాధ్యమైనది లోకమున లేదు. పదునాలుగు వేల రాక్షసులను ఖరదూషణాది మహావీరుల తోడ తమ్ముని తోడుపాటును లేక యొక్కఁడే కదా పదాతియై సంహరించెను. ఆయన శక్తి నే నెఱుఁగుదును. కష్టము లెన్నియైనను ఆయన మనస్సును కలఁపజాలవు. ఆయన యెప్పుడు వచ్చును? నన్నెప్పుడు రక్షించును? ఎన్ని దినములని యిట్లు కష్టపడుచుందు ననిన అంజనా నందనుఁ డిట్లనియె.

తల్లీ! నేను పోయి చెప్పుటే యాలస్యముగా శ్రీరాముఁడు సకల సైన్యములతో నిటకు వచ్చును. అంతదాఁక నే నెట్లు సహింతు ననెదవా? నీకు దుఃఖము శీఘ్రముగ నశించు నుపాయము చెప్పెదను. నా వీపుఁపైఁ గూర్చుండుము. నిన్ను సుఖముగఁ దోడ్కొని పోయి నీ భర్త యొద్ద విడిచెదను అనిన సీత హర్ష విస్మయములతో నిట్లు వచించెను.

హనుమంతా! నీ పలుకులు విన వింతలు నీ వింతయైన లేవు. నన్నెట్లు కొని పోఁగలవు? సముద్రము నెట్లు దాఁటగలవు? నీ క్రోఁతి బుద్ధి తెలిపితివి గదా యనిన హనుమంతుడు'ఆహా స్త్రీచేఁ బరిభవింపఁ బడితిని' అని సిగ్గుపడి కానీ యీమె నా స్వరూపము బలము తెలియక యిట్లు పలికెను. నా స్వరూపము చూపెదనని మేరుపర్వత సమానమైన యాకారమును భయంకరదంష్ట్రలును దీప్తానల కాంతియుఁ గలిగి భయంకరాకారమున నామె యెదుటనిలఁబడి దేవీ! నేనల్పుఁడనని తలంపకుము. కోటలు ప్రాకారములు మేడలతో నీ లంక నంతయుఁ బెఱికి యెత్తుకొని పోవ శక్తి గలదు. సందేహింపక రమ్మనిన సీతాదేవి యిట్లనియె.

కపీంద్రా! భయంకరమైన నీ స్వరూపముఁ జూచి నీ బలాతిశయము వాయువేగము తేజము నెఱింగితి. నన్ను నీవు తీసికొని పోగలవనియు నమ్మితి. అయినను రావణు వధించుట, నన్నుఁ జెఱనుండి విడిపించుటయును నా భర్త పూనిన కార్యములెట్లు సిద్ధించునో దాని నాలోచించుట నాకును ముఖ్యము.

గావున నేను నీ వెంట రారాదు. నీ వీపుపైఁ గూర్చుండి వచ్చునపుడు నీ మహావేగమునకు నాకు దిగ్భ్రమ యొదవి క్రిందఁ బడుదునేమో. అటు పడకుండినను బెద్ద బెద్ద యలలు గలిగి భయంకరమైన సముద్రము మీఁదఁ బోవునపుడు తల తిరిగి నీటిలోఁ బడుదునేమో. అట్లు పడితినేని నన్నుఁ దిమి తిమింగిల తిమింగల గిలములు మ్రింగిపోవా? నా స్థితి యట్లుండ నీ స్థితియు సందేహాస్పదమే. నన్ను నీవు గొనిపోవునపుడు రావణ ప్రేరితులై రాక్షసులు నీ వెంటఁ బడకుందురా? వారికి నీకు ఘోర సంగ్రామము జరగకుండునా? వారు శూల ముద్గర ప్రాసాదిధరులు. నీవు నిరాయుధుఁడవు. వారే గెలుతురేమో. నీవు గెలుతువో గెలువలేమో? ఒకవేళ కడపట నీవే గెలిచినను వారి బాణములు దగులకుండ నన్నెట్లు కాతువు? వారితో యుద్ధమెట్లు చేయుదువు? వారి బాణములు నాకుఁ దగిలినఁ జత్తునేమో? ఒకవేళ బాణము తగిలి చావకుండినను క్రూరాకారములు గలవారు గుంపులుగుంపులుగ పైపడవచ్చినవారిని జూచి భయపడియే చత్తునేమో? ఒకవేళ చావననుకో. నీ మనస్సంతయు యుద్ధము మీఁదనే యుంచి పోరాడునపుడు నేను దటాలున వారిచేతఁ జిక్కితినా నన్ను వారె తునుకలు తునుకలుగా నఱికి వైవరా? నన్నుఁ జంప రనియే యనుకో. ఎక్కడ నెవరికిఁ దెలియరాకుండునట్లు నేలమాలిక లలో నెందైన దాఁచిరా తరువాత నన్నెవ్వ రెట్లెఱుఁగుదురు? ఈ స్వాతంత్ర్యము గూడ నాకుఁ బోవును గదా? నేను సముద్రమునఁ బడననునో. రాక్షసులకుఁ జిక్కకుండ నన్నుఁ గాపాడఁ గలవనుకో. అటులైనను ఆ క్రూరుల సింహనాదములు వారి బొబ్బలు వారి యట్టహాసములు, విన్నప్పుడే గుండెలు పగిలి చావనా? అట్లైనను నీ కార్యము వ్యర్థమే కదా?

మఱియొక విధముగ నాలోచింపుము. నీవు శూరుఁడవు. గావున నీవే గెల్చి నన్ను నా ప్రాణేశ్వరున కప్పగించింతివనుకో. లోకమే మనును? శ్రీరాముఁడు నిష్ప్రయోజకుఁడు దుర్బలుఁడు. రావణాసురుని దాను జయింపలేక హనుమంతుని బంపి సీతను దెప్పించుకొనెను. హనుమంతుని సాహ్యమున రాముఁడు దిరిగి సీతతో సంసారము చేయుచున్నాఁడని యపకీర్తి నా భర్తకుఁ గలుగదా? నా సుఖమునకై నేను తొందరపడి నా భర్త కపకీర్తి తేవచ్చునా? భర్త కపకీర్తి తెచ్చునది యాలుగాదు. తేలు. హనుమంతా! రాముని ప్రాణము నా క్షేమమును బట్టి యుండును. రామలక్ష్మణుల క్షేమమును బట్టి వారి వంశము వారి ప్రాణములుండును. కావున నిన్ని దినములు నేను ప్రాణములను



రక్షించుకొని భూమిపై నుండుట నా నిమిత్తమై కాదు. నా విషయమైన యాసను రామలక్ష్మణులు మానిరా యంతతో నిక్ష్వాకుకులము వానరకులము సరియని తలఁపుము. అదియునుఁ గాక!

**చం.** **వరపతి భక్తఁజేసి మగవానిని రాముని దప్ప నింక నె**
**వ్వరి స్పృశింయింపనొల్ల దశవక్త్రుఁడు దాఁకఁడె నిన్ను నంటినా?**
**పరవశురాల, దుర్బలను, బ్రాపును లేద, యనాథ, నొంటి నె**
**ప్పరునున నేమి నియఁగలఁ? బావని! నీవ తలంచి చూడుమా.**

నీవు భక్తుడవు. కింకరుఁడవు నగుట యెఱుఁగుదు. అయినను నిన్నుఁ దాఁకరాదు. తాఁకను. కావున నా యాలోచన వినుము. శ్రీరాముఁ డిచ్చటికే వచ్చి యిందే రావణాది రాక్షసుల నెల్ల దునిమి పరాక్రమమున నన్నుఁ జెఱ నుండి విడిపించుకొని పోవుటే యా మానధనునకు సముచిత కార్యము. 'యుద్ధమున జయాపజయము లెవ్వఁ డెఱుఁగునని నీవే యంటివిగదా. ప్రాణాపాయకరమైన యుద్ధమున నాయన నేల దించెదవు? గోటఁ బోవుదానికి గొడ్డలి యేల' యని యనకుము. ఆయన బలపరాక్రమములు నే నెఱుఁగుదును. ఆయన కీర్తి సుఖము నేను గోరుదానను. రణరంగమున రామునిఁ దాఁకి రాక్షసులు బ్రతుకఁజాలరు. కావునఁ దక్కిన యాలోచనలెల్ల వదలి నా ప్రాణభర్త నిచ్చటికిఁ దోడి తెచ్చు నుపాయ మొక్కటే యాలోచింపుము. నన్ను దుఃఖములనుండి రక్షింపుము. హనుమంతా! నీకుఁ బుణ్యమయ్యెడు మనిన హనుమంతుఁడు మిక్కిలి ప్రీతుఁడై మరల చిన్నవాఁడై సీతాదేవితో నిట్లనియె.

తల్లీ! నీవు చెప్పిన ముఖ్య కారణములలో నొకటి నీ స్త్రీ స్వభావమునకు, మఱియొకటి నీ పతివ్రతాశీలమునకుఁ దగియున్నది. ఇంత గొప్ప దానవయ్యు నాఁడుదానవు గావున భయపడి నీ స్త్రీ స్వభావము వెలిపఱుచుకొంటివి కదా?

రుక్మిణి : అప్పా! కాయకుఁ గాయ చెల్లుపోయినది.

తండ్రి : సరి. విను.

సాధ్వీమణీ! నీవు చెప్పిన రెండవ కారణము 'వాఁడెవ్వఁడైన నగుఁగాక పరపురుషుని దాఁకను' అని యంటివే యది రామునిభార్యకే చెప్పఁ దగినది. ఇంతటి కష్టదశయం దుండియు నిట్టిమాట నీవుగాక మఱియెవ్వతె చెప్పును? దీనివలననే నీ కులశృల మాహాత్మ్యము లెఱుకయయ్యెను. అమ్మా! యీ నీ మాట నీ భర్తకు వినిపించెదను. నేను నీతోఆ మాట చెప్పినందునకై నన్ను

క్షమింపుము. నీవు పడు పాటులు చూచి సహింపలేక రాముసందు నాకుఁ గల భక్తి పెంపున వచించితిని. జలధి దాఁట రానిది. లంక ప్రవేశింపరానిది. సంగ్రామమా సుకరము కాదు అని యాలోచించి శీఘ్రముగ మీ యిరువురఁ గూర్చి మీ దుఃఖములు పోఁగొట్ట నెంచి యట్లు పలికితిని. గాని మఱియొక తలఁపునఁ గాదు. అన్యథా యెంచకుము. క్షమింపుము. నేనిఁక నిచట నాలసింపరాదు. కావున నాకేదైన రాముఁడు విశ్వసింపఁగల గుర్తిమ్ము. నేఁ బోయెద ననినకనుల నీరు జలజల రాల సీతాదేవి యిట్లనియె.

తండ్రీ! లక్ష్మణునకుఁ గూడఁ దెలియని యొక విషయము గుర్తు చెప్పెదను. నా మాటలుగ నీవు నా భర్తతో నిట్లు చెప్పుము.

"ప్రాణేశ్వరా! చిత్రకూట పర్వతమునందు నీశాన్య దిక్కున మందాకినీ తీరమందు మన మాశ్రమముల వసించువేళ నీవు నేనొకనాఁడు వనవిహారము చేయునెడ బడలి నీ తొడమీఁద శిరముంచి పండుకొంటిని గదా? అప్పుడొక కాకి తటాలున వచ్చి నన్ను చుఱుక్కున ముక్కుతో పొడిచెను. నేను మంటిపెళ్ళ నెత్తి దానిని గొట్టితిని గాని యదిపోక యక్కడనే చుట్లు పెట్టుచుండెను. అప్పుడు దానిని దఱిమి కొట్టుటకై లేచి వెంటఁబోయి నా నడుమున నున్న యొడ్డాణము దీసితిని. నా చీర కొంచెము సడలిజాఱెను. నీవు నవ్వితివి గదా. కాని పొడిచెనను కోపముచేతను నీవు నవ్వితినను సిగ్గుచేతను చనుదెంచి గాసిపడి నీ తొడపైఁ గూర్చుంటిని. అప్పుడు కన్నీరు పెట్టుకొనుచున్న నన్ను నీవు నా కన్నీరు తుడిచి యూరడింప లేదా? ఆ పిమ్మట నీ తొడమీఁద శిరముంచి పండుకొని నిద్రించి వెంటనే లేచితిని.తరువాత నీవు నా తొడపై శిరముంచి నిద్రించితివి. మున్ను నన్ను గాసిపెట్టిన పలుగాకి కాకి మరల వచ్చి నాఱొమ్ముపైఁ బొడిచెను. నెత్తురు బొట్లు నీపైపడ నీవు మేల్కని యెవ్వడీ పాపి దండించెదఁ జెప్పుమనిన కాకినిఁ జూపితిని గదా. అప్పుడు నీవు దర్భాసనమున దర్భయొకటి దీని బ్రహ్మాస్త్రమున మంత్రించి కోపముతో కాకిపై వైచితివి. అది చూచి కాకి వేషమున వచ్చిన యింద్రుని కుమారుఁడు భయపడి పరువెత్తెను. అదియును వాని వెన్నంటెను. వాఁడు స్వర్గలోకమునకుఁ బోయి తండ్రి పాదములపైఁ బడెను. మూఁడు లోకములు దిరిగి యందఱ కాళ్లపైఁ బడెను గాని యెవ్వరును రామబాణము నుండి మేము రక్షింపఁజాలమనిరి. కడపట వచ్చి నీ శరణు చొచ్చెను. నా మాటవిని దాని రక్షించి "యోసి పలుగాకీ! నా యస్త్రమూరకపోదు. ఏమిచ్చెద" వనిన కన్నిచ్చి నిన్ను దశరథ రాజుగారిని



స్మరించి నమస్కరించుచుఁ బోయెను. నా నిమిత్తమై కాకిమీఁద బ్రహ్మాస్త్రము వేసిన నీవు నన్నిట్లు బాధపెట్టు రావణు సహించి యెట్లున్నావో" యని చెప్పుము.

హనుమంతా! దిక్కులేని నాయందు దలదలఁపు మనుము. నా యందాయనకు కరుణా లేశమే యుండిన నిన్నాళ్లిట్లు నన్ను నుపేక్షించి యుండునా? ఎందున్న నేమి యొక యస్త్రమును రాక్షసులపై విడువఁడా? పోనీ అన్న యనుజ్ఞ పడసి లక్ష్మణుఁ డైన నొక యస్త్రము విడిచి నన్ను రక్షింపరాదా? వారు నన్ను నుపేక్షించుట కేమి హేతువో? ఆంజనేయా? వారి నన్న దోషము. వారు దయామయులు. పగవారియందుఁ గూడ దయ తలఁచువారు. నా యందు దయ తలఁపకుండుటకు నా పాపమే కారణము అనిన హనుమంతుఁ డిట్లనియె.

తల్లీ! నీవి ట్లనవలదు. నీయునికి తెలియని కారణముచే వారాలసిం చిరి గాని మఱి యే కారణముచేతను గాదు. నీకై నీపతి భరింపరాని దుఃఖమునకుఁ బాలుపడి యున్నాఁడు. అన్న యవస్థ చూచి లక్ష్మణుఁడును శోక వ్యాకులుఁ డయ్యెను. నేను నీ వార్త చెప్పిన వెంటనే సేనలతో దాడి వెడలి లంకపై విడిసి రావణు వధించి నిన్నుఁ గొనిపోవుదురు. నే నిఁకఁ బోయెదను. నీ మాటలుగా శ్రీరామున కేమి చెప్పుమనెదవు? లక్ష్మణున కేమి చెప్పెదవు? సుగ్రీవునితో నేమి వచింతును? నా మిత్రులతో నేమందును? అనిన జానకి మిగులఁ బరితపించి తన కొంగున ముడిచి దాఁచియుంచిన చూడామణిని హనుమ కిచ్చి యిట్లనియె.

అయ్యా! దీనిని శ్రీరామున కిమ్ము. ఇది దివ్యరత్నము. సముద్రమునఁ బుట్టినది. దీనిని జూడఁగానే ఆయన నన్ను నా జననిని రాజుగారిని దలంచును. నిన్ను విశ్వసించును అని చెప్పిన హనుమంతుఁడు దానిని వ్రేల ధరించెను. అంతట సీత వెండియు నిట్లనియె. హనుమంతా! నా మాఱుగ నా ప్రాణభర్తకు సాష్టాంగనమస్కార మొనరించి కుశల మడిగితి ననుము. అన్న నిమిత్తమై కన్నతల్లిని తోడఁబుట్టినవానిని భార్యను సమస్త భోగమునలు వదలి యడవలుపాలయి యెన్నియో యిడుమలకు లోపడెను. తండ్రివలె నన్నను, దల్లివలె నన్నును భావించును. మేమేమి చెప్పినను మిక్కిలి వినయముతో భక్తితోఁ జేయును. మా మామగారితో సమానుఁడు. ఆయనను జూచి నా హృదయేశ్వరుఁడు తండ్రిని బాసిన దుఃఖమును మఱచెను. అట్టి గుణధన్యుఁడు వృద్ధసేవి మిక్కిలి దాక్షిణ్యము గలవాఁడు మిగులమెత్తని మనసువాఁడు సుమా

లక్ష్మణుఁడు. ఆయన క్షేమమును విచారించితినని చెప్పుము. ఆంజనేయా! నేనేమి చెప్పఁగలను? ఏ విధముగఁ జెప్పిన వారిచ్చటికి వత్తురో యన్ని విధములఁ దగినట్లు చెప్పి వారి నిచ్చటికిఁ దోడి తెచ్చు భారము నీది. నీ కుత్సాహము కలుగువిధముగఁ బలికితిని. తక్కిన యాలోచనము నీవే చేయవలయును.

**కం. వినుమా కుశలం బడిగితి**
**నను మా శ్రీరాముఁ దమ్ము నాప్త జనయుతుౝ**
**దినకరసుతఁ గపివృద్ధుల**
**హనుమా! ధర్మోక్తి సేమ మడిగితి ననుమా.**

**కం. నా చేతో విభుఁ డేగతిఁ**
**బ్రోచుౝ నే మేను విడక పూర్వమె నన్నుౝ**
**ధీచతుర! యట్లు పలుకుము;**
**వాచాపుణ్యంబుఁ జలుపు వానరవర్యా!**

అని వెండియు నిట్లనియె. పవననందనా! నీయందును నీకుఁ దోడై వచ్చు రామలక్ష్మణ సుగ్రీవ వానరసేనలయందును నాకొక పెను సందేహము గలదు. అది పోఁగొట్టుటకు నీవే సమర్థుఁడవు. లంకను జుట్టియుండు సముద్రమును దరింప నీవు గరుడమారుతలు గాక మఱెవ్వరు శక్తులు గారు. కావున రామలక్ష్మణులైనను సుగ్రీవ వానర సేనలైనను సముద్రమును దాఁటుటెట్లు? రావణు వధించు టెట్లు? ఈ కార్యమును సాధింప నీవొకఁడవె సమర్థుఁడవు. ఈ కీర్తియు నీకొకనికె రానున్నది. నీవు రావణాసురుని వధింపఃగల వనియుఁ దోచుచున్నది గాని యా కార్యము శ్రీరాముఁడే చేసిన నది నాకును గీర్తికరము. రామునకు నర్హము. దీనికేమి సమాధానము? చెప్పు మనిన నాంజనేయుఁ డిట్లనియె.

తల్లీ! నీ విట్టు సందేహింపఁ గారణము లేదు. నిన్ను బాధ నుండి విడిపించు విషయమున నెంత సేననైనఁ దెచ్చుటకును గావలసిన తోడ్పాటు ఆవించుటకును సుగ్రీవుఁడు బాస చేసి సైన్య సమేతుఁడై యున్నవాఁడు. ఆయన సైనికులు సామాన్యులని తలంపకుము. భూమి గగన జల పాతాళంబుల నైన సంచరింపఁ గలవారు. సుగ్రీవు నొద్ద నేనొఁడనే బలవంతుఁనని యెంచకుము. ఆయన సేనయం



దండఱు నాకంటె గొప్పవారును నాకు సమానులే కాని నాకంటె హీనబలు డొక్కఁడును లేఁడు. నేనే నిన్నుఁ గాంచితినఁట. ఇఁక వారి సమాచారము చెప్పనేల? రాజు శత్రువుల యొద్దకు బలిష్ఠుని దొలుత నంపఁడు. సామాన్యును పంపును. నేను బోయి చెప్పినంతనే వానరులందఱు లంకపై నొక్క దూఁకు దూకుదురు. ఒక్క గంతుతో నిచ్చటికి వత్తురు. వారు వచ్చుట తడవుగా రాక్షసు లందఱు చత్తురు. నీవు సందేహింప వలదు. భయపడవలదు. మా రాకకై యెదురు చూచుచుండుము. నీవు వారికి చెప్పవలసిన మాట లేవైన నుండినఁ జెప్పుమనిననామె యిట్లనియె. అయ్యా! నేను జెప్పవలసిన దంతయుఁ జెప్పితిని. ఇఁక నేనేమి చెప్పుదును? నా పతిని కాకాసురుని వృత్తాంతము స్మరింపుమనుము. నేను ధరించిన తిలకము చెమటచేఁ గరఁటిపోవఁ దాను మణిశిల రాచి తిలకముగ నుంచుటయును దలఁపుమనుము. మఱియు నిట్లనుము.

**కం. వరుణేంద్రోపమ విక్రమ**
**వరుఁడవు నీయట్టిఁ డాత్మపతిని దైత్యుల్**
**హరియించి బాధపెట్టఁగఁ**
**బరునట్టుల యూరకుంట భావ్యం బగునే?**

**ఉ. దాఁచితి నీరజంబుమణి దాశరథీ! యిది న మనోంబుజం**
**బాఁచికొనంగఁ జాలుట మహాత్మ! భవద్విరహానలంబు**
**నన్గ్రాఁచెడి వేళ నిన్గనిన కైవడి దీనిని గాంచి పొంగుదుౝ**
**సైఁచుట దోఁపదింక వెత సంద్రమునందును ఉగ్గఁబట్టుచుౝ.**

**ఆ. పడఁగ రానియట్టి పాటులు పడుచును**
**వాకొనంగ దాని వార్త వినుచు**
**గుండె జల్లు మనఁగఁ గూళరక్కెసలలో**
**నిన్నుఁ దలఁచి సైఁచి యున్నదాన.**

**చం. ఒకనెల యెట్టులైన మనియుండెద, నింతకు నీవు రానిచోఁ**
**బ్రకటముగాఁగఁ బ్రాణములుపాయును; రావణుఁ జూచి నంతటన్**
**దకతకలాడు గుండియలు, దైత్యుఁడు క్రూరుఁడు నాథ! నీ మనం**
**బకట! కరంగ దేని యదియంతయు నా దురదృష్టమే చుమీ**

అని వచింపుము. ఆంజనేయా! నిన్నుఁ జూచినది మొదలు నా దుఃఖమంతయు మఱచి ధైర్యము గలిగియున్నదానను. ఇంకొక పూఁట యీ చెట్లచాటున నెందైన నుండి మఱిపోరాదా. నాయనా! వలదు వలదు. పోయెదవేని పొమ్ము. నా నిమిత్తమై నీ వేలయిందుండ వలయును? అయినను మరలి నీవు వచ్చువఱకు ఈ దేహమునఁ బ్రాణములుండునో యుండవో. ఎట్టైనఁ గానిమ్ము. నేనేమి చేయఁగలను?

**కం.** **హనుమా! కుశలం బడిగితి**
**ననుమా శ్రీరాము నతినియనుజు సుమిత్రా**
**తనయు సహామాత్యుని నిన**
**తనుజాతుని నందునున్న తక్కినవారిన్**

**కం.** **అన్నా! రాఘవుఁ డెట్టులు**
**నన్ను విపత్సాగరంబునం జెడకుండన్**
**జెన్నారఁ బ్రోచు నా గతి**
**మన్నన మెయిఁ బలుకవన్న మఱవకు మన్నా!**

**కం.** **ఇన్నీ  చరాక్షసావళి**
**నన్ను భయము పఱుచు విధము నానావ్యసనా**
**పన్నత నేఁ గుందెడిగతి**
**విన్నప మొనరింపు నాదువిభునకుఁ దండ్రీ!**

ఆంజనేయా! మార్గమున నీకు శుభమగుగాక. పోయిరమ్ము అని సెలవిచ్చిన నాంజనేయుఁడును ఆలోచించి రావణునకు రణరంగమునఁ దన పరాక్రమము చూపి భయపఱిచి సీతను రామున కిచ్చునటులు చేయవలయును. లేక వీని బలసారమై నను గనుఁగొన వలయునని దేహము పెంచి యశోక వనము  నాశమొనర్చి యుద్ధమునకు వచ్చిన రాక్షసులనెల్ల వధించి  రావణుఁడు పంపిన మంత్రి కొడుకుల నేడ్వురను మండోదరి రెండవకుమారు నక్షుని జంపి యింద్రజిత్తు బ్రహ్మాస్త్రముచేఁ గట్టుపడి రావణుని జూచి వానికి బుద్ధి చెప్పిన వాఁడు కోపించి హనుమంతుని తోఁకఁ గాల్పించెను. అప్పుడు సీతాదేవి యా వార్త విని,

**తే.** **భర్తృ శుశ్రూష నొనరించు పడఁతి నేనిఁ**
**దపములను నిష్ఠ సలిపిన తరుణి నేని**



**నేఁ బతివ్రత నగుటయు నిక్కమేని**
**హనుమయెడ శైత్యమూను మీ యగ్నిదేవ!**

**కం.** **ఇనకుల తిలకం డగురా**
**మునకున్ నామీఁదఁ గరుణ మొనయున యేనిన్**
**గన భాగ్యశేష నేనియు**
**హనుమయెడన్ శీతలుండ వగుము హుతాశా!**

**తే.** **ఘనమతి రామునికూటమి**
**ననవరతముఁ గోరుదాన ననుచున్ శుభశీ**
**లనటంచు నతఁడు నమ్మిన**
**హనుమయెడన్ శీతలుండవగుము హుతాశా!**

**వే.** **సత్యసంగరుఁ డైన భాస్కరసుతుండు**
**సరగ సుగ్రీవుఁ డిటవచ్చి సతము నన్ను**
**ముంచు శోకాబ్ధి నుండి దాఁటించు నేని**
**హనుమయెడ శైత్యమూనుమీ యగ్నిదేవ!**

అని అగ్నిహోత్రునిఁ బ్రార్థించెను. ఆంజనేయుఁడును తనతోఁకయందు ధగద్ధగాయమానముగ జ్వాల లెగయుచు నగ్ని మండుచుండియుఁ దనకుఁ జందనశీతలుఁడై యుండుట కాశ్చర్యపడి యిది శ్రీరాముని మహిమయు సీతాదేవి కరుణయు నని వారిఁ దలఁచి నమస్కరించి లంకయంతయు దహించి సముద్రము మరల దాఁటి తోడి వానరులఁ గలసి శ్రీరాముఁ గాననేగి సర్వవృత్తాంతము వినిపించెను. శ్రీరాముఁ డును ఆ మధ్యాహ్నమునందే అభిజిల్లగ్నమున దండయాత్ర బయలు దేఱి మఱునాఁడు సముద్రతీరమున విడిసెను.

రుక్మిణి : అప్పా! హనుమంతుఁడు లంక గాల్చిన విదము శ్రీరాములతో నేమేమి చెప్పెనో యది యంతయుఁ జెప్పక పోయితివే.

తండ్రి : అది యంతయు హనుమంతుని చరిత్రమందుఁ జెప్పెదను. అప్పుడు హనుమంతుని బలపరాక్రమములు బుద్ధి చాతుర్యము స్వామిభక్తి సీతారాముల యందలి భక్తిఅన్నియుఁ దెలియును.

ఇట్లు శ్రీరాముఁ డపార సేనావారముతోఁ బారావార తీరమున దిగి శరణు వేఁడిన రావణు తమ్ముఁడగు విభీషణున కభయమిచ్చి సముద్రమందు

సేతువు గట్టి వాన సేనతోడ దాఁటి దక్షిణతీరమున దిగి లంక ముట్టడించెను. రావణుఁడు తన మేడ యెక్కి వానర సేనను జూచి భయపడి సీతను మోసగించి వశపఱుచు కొనవలయు నని తలఁచి విద్యుజ్జిహ్వుఁడను రాక్షసుని బిలిచి శ్రీరాముని శిరమువంటి శిరమును ఆయన విల్లు బాణముల వంటి విల్లు బాణములను గల్పించి నేనుండు చోటికి తెమ్మని యాజ్ఞాపించి తాను సీతను గాననేగి భయంకర రాక్షస స్త్రీ పరివృతయై దుఃఖించుచున్న సీతతో నిట్లనియె. ఓసి సీతా! యింకను రాముఁడని యేల యేడ్చెదవు? నీ రామునకు నిన్నటి రాత్రితో నూఱేండ్లు నిండెను.

**శా. ఎంతో నిన్ బతిమాలుకొంటిఁగ తన్వీ! నన్నుఁ జేపట్టఁగాఁ**
**జింతాకంతయు నానుడిన్ వినక ఛీఛీ యంటి వెవ్వానిపై**
**స్వాంతంబంతయు నుంచి యట్టి భవదీయ ప్రాణనాథుండు నీ**
**కాంతుం డాఖరహంత రాముఁడు సతీ కన్యాఁడ జంపంబడెన్.**

**ఉ. మోడిగ నీదు నేడు పె సమూలము నాశముఁ జేసె నీపతిన్**
**వీడఁగఁ గొట్టినాఁడఁ గద నీ తలక్రొవ్వును మూలముట్టుగా**
**నేడువు మెంత యేడ్చెదవొ యిష్టము దీరఁగ, దిక్కులేక నీ**
**వేడుచుచైన నాదు హృదయేశ్వరి వయ్యెదు నీవ చూడుమీ.**

**ఉ. చచ్చినవానిఁ గట్టుకొని చారువిలోచన యేల యేడ్చె దీ**
**పిచ్చితనంబు మానుమిఁకఁ బేరిమి మీఱఁగ మత్సతీతతిన్**
**బచ్చగ రాణివై మనుము పండితమానిని! యల్పపుణ్య! యో**
**మచ్చరికత్తె! స్వార్థహితమారిణి! బాలిశురాల! దుర్మతీ!**

కండకావరము చేత నీవు తెలియఁ జాలవు ఆని నాతో విరోధించి బ్రతకువాడుఁ మూఁడు లోకంబులఁ గలఁడా? నీ మగఁడు చచ్చిన విధము చెప్పెదను. చెవులార వినుము. రాముఁడు సేనాసముదయముతో సముద్రము నుత్తరతీరమున దిగియుండెను. ఆ వార్త నా చారులు చెప్ప విని ప్రహస్తుఁడు బలవంతులైన రాక్షసుల తోడ నిన్నరాత్రి మాయధరించి పోయెను. అప్పుడు రాముఁడు నిద్రించుచుండెను. తటాలున ప్రహస్తుఁడు పైపడి కఱకు కత్తితో నీ మగనితల కఱకఱ నతికి వైచెను. లక్ష్మణుఁడు క్రోఁతులలోఁ గలసి పరువెత్తి తప్పించుకొని పోయెను. విభీషణుని మావారు పట్టి కట్టిరి. ఇట్లు వానర సేనయంతయు చెల్లాచెదరై దిక్కా మొగమై పరువెత్తిపోయెను. నా మాట



యసత్యమని తలఁపకుము అని యచ్చటనున్న భటులఁ బిలిచి విద్యుజ్జిహ్వునితో రాముని తల శరచాపములు తీసికొని రమ్మంటినని చెప్పుము అని యాజ్ఞాపించెను. వెంటనే విద్యుజ్జిహ్వుఁడు ఆ శిరము శరచాపములు సీతముందుల నుంచెను. తన పెనిమిటి శిరమును ఆయన శరచాపముల వంటి శరచాపములను సీతాదేవి చూచి యవి శ్రీరామునివే యని నమ్మి పట్టరాని దుఃఖంబున నానావిధముల విలపించెను.

**ఉ. హా జగదాలమారికయికా! నెఱవేతెనుగా త్వదీప్సితం**
**బో జగజంత! వంశకలశోదధి చంద్రుఁడు గ్రుంకె, వంశ స**
**ద్బీజము పాడుచేసితివి తెంపరివై, యిఁక మీఁద హాయిగా**
**నేజడ నింతలేక సుఖియింపుము గుండియ నిర్భరమ్ముతోన్**

ఓసి ధనాశాపాతకురాలా! నీకు రాముఁ డేయప్రియంబును గావించెనని యింత ఘోరపాపమున కొడిగట్టి నారచీరలు గట్టించి యడవులకు వెడలఁ గొట్టితివి? దేవీ! నా పాపము బలిష్ఠమైయుండ నిన్నన నేల? ప్రాణేశ్వరా!


రావణు మాయా శిరస్సు జూపి సీత దుఃఖించుట

యిట్టి నీ చరమావస్థ నేను గనులారఁ జూడవలసి వచ్చెఁ గదా! తొలుతఁ బతి చచ్చుటకు వానిభార్య చేసిన పాపమే కారణమని బెద్దలు చెప్పుదురు. అది సత్యము. నేను ప్రాణముతో జీవించియుడcగా నా పాపము చేత నీవు మరణించితివి. నా పాపమే నిన్నుఁ జంపెననుటకు సందియమును గలదా? నేను దుఃఖసముద్రమున మునిఁగి దిక్కుగానక యల్లాడుటకు నా పాపమే కదా కారణము. అట్టి పాపాత్మురాఇకి నీవు మేలు చేయవలయునని పూనుటచే నా పాపమే నిన్నుఁ ద్రుంచెను. నా పాపము నీ కోరిక యేలకొన సాగింపఁ జేయును? ప్రాణేశ్వరా! శాస్త్రవేత్తలు నీవు దీర్ఘాయువనిరే. వారి వాక్యములయిన నిన్ను నాయుష్మంతుని చేయరాదా? నా పాపము వారినిగూడ నసత్యవాదులఁ జేయవలయునా? పతీ! నీకుఁ దెలియని నీతిధర్మశాస్త్రములు గలవా? తెలిసి తెలిసి యెట్లు నిద్రించితివి? నా పాపమే నిద్రయను పేర నిన్నుఁ గ్రమ్మి మతిమఱపు కలిగించెc గాcబోలు. వల్లభాఔ నేను మహానర్ధయురాలను. రౌద్రను. మహాపాపినిని. నీ పాలి కాళరాత్రిని. ఇట్టి నన్ను నీవు చేరcదీయుటచే నీకే నేనపమృత్యువనైతిని. అయ్యో! యీ పాడువార్త నా యత్త వినిన నెంత తల్లడిల్లునో కదా.

కం. **రామునకు నంత వగవ౯ ।**
**సౌమిత్రికి నంత వగవ జననికి వగవన్**
**నామాత్ర కేడ్వఁ గౌస।**
**ల్యామహిత తపస్వినికి నలందురు దానన్.**

కం. ఎప్పుడు వ్రత మీడేఱునొ
యెప్పుడొకో కనుదుసీతనే రామునితో
నొప్పెడి లక్ష్మణు నని మది
నెప్పుడుఁ జింతించుఁ ద్రోవ లెదురుం జూచున్.

ఒంటికొడుకు గలది గొడ్డురా లనుమాట నిజమాయెనే. అత్తా! నీ కడుపు దుఃఖము నీవెట్లు సహింతువో. నీ కడుపు చలువయైనను నీ పుత్రుని గాపాడరాదా? నీ దీవనలైన ఫలింపరాదా. నీవు కట్టిన రక్ష గూడ వ్యర్థమాయెనా? ఆహా నా పాపమెంత బలిష్ఠము. దైవమున కేది యడ్డము. హృదయేశ్వరా! ప్రతి దినము నేను గదానీ కోదండమును గంధ పుష్పాదులచే నలంకరించి పూజింతును. అట్టి చాపము నేఁడీ గతిఁ బట్టెనా? నా పూజాఫలమా యిది?



నా మనస్సు నిర్మలము కాదేమో. జీవితేశ్వరా! నాకు మామగారై నీ యందుఁ బ్రీతిగల తండ్రితోఁ జేరి సుఖముగ నున్నావా? ఆకాశమున నక్షత్రమవై నీవంశము వారినిచూచుచున్నావా?

మత్త. **బాలికం గద బాల్యమందున ప్రాప్తనైతిని వల్లభా**
**శీలినిన్ సహచారిణిన్ శుభశీల భార్యను బత్నినిన్**
**బాళి నన్గనవేల? మాటయుఁ బల్కవేటికి? నేమి కాం**
**తాళమా? హృదయేశ మత్కృత దారుణాఘమ చెప్పుమా.**

సీ. **పాణిగ్రహణవేళఁ బాయ ని న్ననినట్టి**
**బాసను మఱచితే ప్రాణనాథ!**
**నీతుల్య సుఖదుఃఖరీతుల నేఁ గాన**
**నీతోడఁ గొనిపొమ్ము నీరజాక్ష !**
**నీ ప్రాణకాంతను నే నిటు దుఃఖింప**
**వీడిపో న్యాయమా విదితచరిత !**
**నా దిక్కు నీవెకా నాయకా! పరలోక**
**మర్హమా యొంటిcబో న్యాయ్యశీల!**

తే. **సారఘనసార సమ్మిశ్రచందనముల**
**నవ్యభూసణముల నొప్పి నాయొకర్త**
**యంకపాళి సుఖించు మేనయ్యొ కంక**
**గృధ్రముల పాలు పడియోనా నృపవసంత!**

నాథా! నిశ్చయముగ నేను పూర్వజన్మమున నుత్తమ కన్యాదానమునకు విఘ్న మొనరించితిని. దానిచేతనే లోకోత్తరున కాలనయ్యు నిట్టి వియోగదుఃఖముచేఁ బరితపించుచున్నదానను. రావణా! నీకు పుణ్యమగును. నాకొక యుపకారము చేయుము. నన్ను వధించి శ్రీరామునిపై వైవుము. అటైన సతీపతులఁ గూర్చిన పుణ్యము నీకుఁ గలుగును అని యనేక విధములఁ బలవించు చుండ నింతలో మంత్రులు వచ్చి రాజకార్యము గలదని రావణుని బిలుచుకొని పోయిరి. వాcడు పోయినతోడనే మాయా శిరము ధనుర్బాణములు మాయమై పోయెను. దుఃఖాతిశయముచే మూర్ఛిల్లి నేలcబడిన సీతను జేరి యామెను రక్షింప రావణాసురుచే నాజ్ఞాపింపcబడిన సరమ యను స్త్రీ యిట్లనియె.

సీతా! దుఃఖింపకుము. దుఃఖింపకుము. రావణుఁడు నిన్ను మోసగించి బెదరించిన విధము నీవు ప్రత్యుత్తర మిచ్చిన విధము నాకాశమున నెవరికిఁ గానరాక నిలిచి వినుచుంటిని. "రావణుఁ డెటిఁగిన నీకు ప్రాణాపాయము కాదా?"యందువేమో. నీకై నా ప్రాణము పోయినను జింతలేదు. పతివ్రతా రక్షణమందుఁ గలుగు మరణము పరమ శ్రేయస్కరము. నా మాట నమ్ముము. నిద్ర పోవు వేళయం దైనను నీ పతిని జంపుటకు నెట్టివారికి సాధ్యపడదు. నీ యత్తగారు కట్టిన రక్షయు విశ్వామిత్రుని యస్త్రములు సర్వదా యతనిఁ గాచి యున్నవి. నేను జూచి వచ్చితిని. సకలసేనలతో లక్ష్మణ సుగ్రీవులతో నీ భర్త సుఖమున్నాఁడు. నీకుఁ గనఁబఱిచిన శిరస్సు బాణ కోదండములు కల్పితములు. శ్రీరాముఁడు సముద్రము దాఁటి యీ యొడ్డున దిగియున్నాఁడు. లంక ముట్టడించియున్నాఁడు. అందఱు యుద్ధ సన్నద్ధులై యున్నారు.

సీ. **చూడక పోదునా సుందరీ! జితవైరి**
**నీపతి కుశలమున నీవు గులుక**
**విడువకపోదువా వెలఁది! కాంతునిఁ గ్రుచ్చి**
**కౌఁగిట ముద్దాప్పుకణము లెదను**
**బతి చిక్కుదీయు నే పదములంటెడు నిన్ని**
**నెలలుగఁ బెనఁగొన్న నీదుజడను**
**బాయక యుందువా పాము కుబుసమునాఁ,**
**బతిఁ జంద్రముఖుఁ జూప వ్యసనమెల్ల**

తే. **రావణాసురుఁ దూర్ణంబ రామచంద్రుఁ**
**డనని వధియించి ప్రియురాల వైన నిన్నుఁ**
**గదిసి సౌఖ్యార్ణ్వుఁ దెల్లభోగములఁ దేలు**
**సంతసింపఁ గదమ్మయో జానకమ్మ!**

అని యూరడించెను.

తరువాత రామ రావణ సేనల కఠోర సంగ్రామము విరామము లేక యే డహోరాత్రములు జరిగెను. రావణాసురుఁడు పుత్రమిత్ర బాంధవామాత్య సేనలతోఁ జచ్చెను. శ్రీరాముఁడు లంకకు విభీషణుని రాజుగ పట్టాభిషేక మొనర్చి యాంజనేయునిఁ బిలిచి హనుమంతా! నీవు సీతాదేవి యొద్దకుఁ బోయి నా విజయవార్త దెలిపిప్రత్యుత్తరము గొనిరమ్మనిన నతఁడునుచివాలున లేచి, హర్షము లేక దుఃఖపడుచు యుద్ధ వార్త తెలియమికిఁ దల్లడిల్లుచు నుండు సీతాదేవి యొద్దకుఁ బోయి మిక్కిలి వినయమున నణఁగి నణఁగి రెండుచేతులు జోడించి సాష్టాంగ నమస్కారముఁ గావించి తనపేరుచెప్పి నిలఁబడెను. సీతయు నతినిఁ జూచి మున్నతఁడు చేసిన కార్యము స్మరించి యానందమున మునిఁగి యేమియుఁ బలుకక యుండెను. హనుమంతుఁడును అమ్మా! సపరివారముగా రావణాసురుని వధియించి నీ పతి తమ్మునితోను సుగ్రీవ విభీషణులతోను సుఖముగ నున్నాఁడు. మాతా! ఆ శుభవార్త నీతోఁ జెప్పుమని నన్ను నీ పతి పనిచెను. ఆయన మాటలు వినుము "దేవీ! నీకు నే ననురక్తుఁడును. నా భాగ్యము కొలఁది యింతదనుక బ్రతికియున్న దానవు. నా పరాక్రమమువలన మనకు జయము గలిగెను. రావణుఁడు చచ్చెను. నీవు స్వస్థచిత్తవు గమ్ము. ఇది రావణుగృహమని భయపడకుము. మన మిత్రుఁడగు విభీషణుఁడు లంకకు రాజై యున్నాఁడు. నిన్నుఁ జెఱనుండి విడిపింపవలయునని ప్రతిన చేసి సముద్రములో సేతువు గట్టి లంకఁ జొచ్చి శత్రువులనెల్ల వధించితిని. ఇది నీ సొంతయిల్లుగాఁ దలఁచి నిబ్బరంబున నుండుము. ఇప్పుడే విభీషణుఁడు నీ యొద్దకు వచ్చును" అని చెప్పిన విని సీత దిగ్గున లేచి నిలఁబడి యేమియుఁ జెప్పక చేయక హనుమంతుని ముఖముఁ జూచుచు నిలఁబడి యుండెను. ఆంజనేయుడును ఆమె యభిప్రాయము గ్రహింపఁ జాలక తల్లీ! యేల నాతోఁ బలుకవు. ఇట్లూరకుండఁ గారణమేమనిన జానకి యిట్లనియె.

ఆంజనేయా! నా ప్రాణేశ్వర విజయవార్త నీవు చెప్పగా విని యానందపరవశనై యొక్కింతయుండి తెప్పిఱి యింతటి శుభవార్త చెప్పిన నీకుఁ దగినట్టు లేమి ప్రత్యుత్తమర మిత్తును. ఏమి బహుమతి చేసిన నీ యోగ్యతకుఁ దగియుండునని యెంత దూరమో యాలోచించితిని. ఈ లోకమున నానారత్నములు గాని లోకమునఁ గల వెండిగాని బంగారుగాని తుదకు బంగారు కొండగాని యొక్కటియు సరిగాదు. ఈ యాలోచనచేఁ బలుకనైతిగాని మఱేకారణము లేదనిన నాంజనేయుఁడు మరల నమస్కరించి తల్లీ! యిటువంటి స్నేహపూర్ణ వాక్యములు పలుక నీకే చెల్లును. పతి విజయము చెప్పిన వానికి నీఁదగిన వస్తు వీలోకమున లేదని నీవు చెప్పినమాట యీ లోకమందలి సమస్త రత్నములకంటెను, స్వర్గలోకముకంటెను శ్రేష్ఠమైనది. జయమొంది నీతోడ సుఖముగా నుండు శ్రీరాముని జూచుటే నాకు రాజ్యప్రాప్తికంటెను మిక్కిలి సంతోషకరము అనిన సీతాదేవి కనుఁగొనలఁ బ్రమదాశ్రువులు గురియ

మారుతనందనా! లక్షణ సంపన్నము అతి మధురము యష్టాంగయుతముగఁ బలుక నీకే తగును. బలము శౌర్యము సత్త్వము శ్రుతము కాంతి పరాక్రమము ధైర్యము క్షమ వినయము దాక్షిణ్యము లోనగు సద్గుణము లెల్ల నీయందు నిలుచుటచేఁ బ్రకాశించుచున్నవి అనిన హనుమంతుఁడు మరల నమస్కరించి తల్లీ! యొక మనవి. పతియే దైవముగ నెంచి నీవిచట దుఃఖపడుచుండ నిన్ను మఱింత పలువిధముల దుఃఖపెట్టిన యీ రాక్షసస్త్రీల నందఱ మోకాళ్ల మోచేతులఁ దన్ని గ్రుద్ది చెవుల త్రెంచి వెండ్రుకలు లాగి మొగములు బఱికి కొఱికి నఱికి యెగిరి దూఁకి పడఁద్రోచి బఱబఱ యీడ్చి పండ్లురాలఁ గొట్టెదను. అనుజ్ఞ యిమ్ము అనిన సీతాదేవి యిట్లనియె. ఆంజనేయా! రాజాశ్రయమున బ్రదుకుచు రాజాజ్ఞకు లోపడి చిక్కి తమ కిష్టముండినను లేకుండినను రాజుకార్యము లొనర్చు నీ దాసీజనములను దండింప నీవు కోరఁదగునా? రావణాసురు నాజ్ఞచే నన్ను వీరు బాధించిరిగాని వీరు స్వబుద్ధి పూర్వకముగా నామీఁద గలుషించి బాధించిరా? నా యభిప్రాయము వినుము తాను జేసిన పుణ్య పాపములను బట్టియే తనకు సుఖ దుఃఖములు వచ్చునుగాని నిష్కారణముగ రావు. ఇది నిశ్చయము కావున నేనేదో పూర్వము చేసిన పాపము ఫలము నిట్లు అబలనై యనుభవించితిని. 'ఇది యక దశాకాలము. ఈ కష్టము మన మనుభవింప వలసినదని విధిగా నున్నది. కావున ననుభవింత'మని తలఁచి వీరి యదరుల బెదరులు సహించితినిగాని యొండుగాదు. అన్నిటికిని కాలము కారణము. కాల మనుకూలమైన నన్నియు ననుకూలములే. కాలము ప్రతికులమైన నన్నియు, బ్రతికూలములే.

**కం. తన కపకార మొనర్చిన**
**మనుజునకపకృతి నొనర్పమదిఁ దలఁపఁడు స**
**జ్జనుఁ డీ నియతిం బ్రోఁవగఁ**
**బొనరున్; సజ్జనులు శీలభూషణు లెందున్.**

అని పూర్వమొక భల్లుకము వ్యాఘ్రమునకు నీతి బోధించెను. ఇఁక నా యట్టిది ఆ నీతిని దప్పవచ్చునా? అదియునుఁ గాక పాపాత్ములు గాని పుణ్యాత్ములుగాని వధ్యు లైనప్పుడు వారియందు దయ చూపుటే సజ్జనలక్షణము. అపరాధుల నందఱ దండింప వలయున్న లోకమున నపరాధము చేయనివారును గలరా? అపరాధుల నందఱ దండింపఁ బూనిన నిఁక దయవలనఁ బ్రయోజనమేమి? నిరపరాధులకు మన దయతో నేమిపని? పాపము చేయుట, లోకులను బీడించుట, రాక్షసులకు సహజకృత్యములు. వారి కది నిర్దోషమనియే నా తలంపు. నీవు దండించి నంతమాత్రమున స్వభావము మాఱదు. వారివలన నితరులకు బాధ కలుగకుండునట్లు మాత్రము చేసి వారికి జ్ఞానము కలుగఁజేయుట మేలు. కావున వీరికిఁ గీడు చేయ రాదనిన తల్లీ! నీవే రామునకుఁ దగిన భార్యవు. ఇఁక నేను శ్రీరామునికడ కేగెదను. ఆయనతో నేమి చెప్పుమనెద వనిన నాపతిని జూడఁ గోరుచున్నాని సీత పలికెను. ఆంజనేయుఁడును సెలవు తీసికొని రామునికడ కేగి యవ్వార్త తెలిపెను.

అమ్మణ్ణి : సీతారములలో నెక్కువ దయ గలవారెవ్వరు?

రుక్మిణి : సీతాదేవియే. సీతాదేవి కపరాధము చేసిన కాకాసురుఁడు శరణు వేఁడఁగా నామె రక్షింపుమని చెప్పినను గంటిగ్రుడ్డు లొట్టగొట్టి శ్రీరాముండు రక్షించెను. సీతాదేవి తన్నంత బాధపెట్టిన రాక్షస స్త్రీల నొకమాటయైన ననక రక్షించెను.

తండ్రి : తరువాత శ్రీరామునాజ్ఞ గొని విభీషణుఁడు సీతాదేవి యొద్దకు వచ్చి నమస్కరించి అమ్మా! నీకు మంగళస్నానము గావించి యలంకరింపించి నీ భర్తతోడి తెమ్మనెనన విని నా పతిని నేనిట్లులే చూడఁగోరెద నని యామె చెప్పెను. పతియాజ్ఞ సతులకుఁ గర్తవ్యము గదా యాలోచింపుమని విభీషణుఁడు పలుక వల్లెయని యాయె యంగీకరించెను. విభీషణుఁడు తన భార్యతోఁ జెప్పి యామెకు స్నానము చేయించి వస్త్రభూషణములు ధరింపనిచ్చి పల్లకి యందుంచి రాముఁడున్నచోటికి తోడి తెచ్చెను. వినయమున తలవంచుకొని తన యెదుట నిలఁబడిన సీతను జూచి ప్రీతిలేనివాఁడై శ్రీరాముఁ డిట్లనియె.

సీతా! నా మాట వినుము. నా కవమానమును గలిగించిన శత్రువును, అవమానమును నేకకాలమున నణంచితిని. నా బలపరాక్రమములచే నిన్నపహరించిన రావణు వధజంచి నా శౌర్యబలములు లోకముల కెఱింగించి కీర్తిని గంటిని. నా వాక్యమును బాలింపఁ గలిగితిని. జలనిధి దాఁటుట లంకఁ జొచ్చుట లోనగు హనుమంతుని శ్రమము నేఁడు సఫలమయ్యెను. వానరసేనతోడఁ దోడుపడిన సుగ్రీవుని కష్టము నేఁడు ఫలించెను.

తోడఁబుట్టినవాని వదలి నా ప్రక్కఁ జేరి నాకు సహాయ్యమొనర్చిన భక్తుఁడగు విభీషణుని శ్రమము సార్థకము. దైవముచేఁ గలిగిన పరాభవము పురుషకారముచే నివర్తించితిని. ఇఁక నా మాట వినుము. దీనిని జక్కఁగ నాలోచించి చెప్పుచున్నాను. నేనింత శ్రమపడి రావణు సంహరించినది నీకై కాదని తెలిసికొనుము. నాకును నా కులమునకును గలిగిన యపవాదము పోఁగొట్టుకొనుటకని యెఱుఁగుము. ఇన్ని దినములు దుష్టుఁడగు నా పగవానియింట నుంటివి. జనశంకిత చరిత్రవైతివి. కనుక లంకవాని యెదుటి దీపమువలె నీవు నాకుఁ జూడరాకున్న దానవు. పరునింటనున్న స్త్రీని మానముగల వాఁ డెవఁడు మరల నా భార్యయని గ్రహించును?

ఉ. **దుష్టుఁడు చూచె నిన్నుఁ గడుదోసపుఁ జూడ్కులచేఁ దదంకసం**
**భ్రష్టవునైతి విట్టినను రాజకుమారిక! వంశశీలతన్**
**శిష్టుఁడ నంచుఁ జెప్పికొను నే నెటు వెండి గ్రహింప నేర్చెదన్**
**గష్టము మానహానికర కార్యము రాముఁడు చేయఁ డెన్నఁడున్.**

అన్ని దినములు తన యింట నున్న నిన్ను రావణుఁ డూరక విడిచెనా? కావున నీతో నాకిఁకఁ బనిలేదు. నీ యిష్టము వచ్చినట్టు పోవచ్చును. అనుజ్ఞ ఇచ్చితిని. నీయందు నా కనురాగము లేదు అనిన మును పెన్నఁడు రామునివలన విననట్టియు అప్రియ వాక్యముల కర్ణూరాలు కానట్టియు సీత దారుణ భాషణ బాణములచేఁ గొట్టఁబడి కన్నీరు కాల్వలు గాఁ దడిసిన ముఖమును బైఁటకొంగునఁ దుడుచుకొనుచు గద్గదకంఠముతో నీరెలంగున నిట్లనియె.

ఉ. **క్షుద్రుఁడు క్షుద్ర నాడుగతి శ్రోత్ర విదారణ రూక్షవాక్యముల్**
**భద్రచరిత్ర! పల్కఁ దగవా ననుబోఁటిని? నీ వదేమిగా**
**ఛిద్రము సంశయించితివి శీలమునం? దటువంటి దానిఁగా!**
**హృద్రస నెంచఁబోకు సుచరిత్రముపై శపథంబు చేసెదన్.**

ఉ. **స్త్రీలను నీతిహీన లగు చెన్నఁటిఱాఁగల నాత్మనుంచి యో**
**షాళులజాతి యంతయును నట్టిదిగాఁ దలపోయనేల? మ**
**చ్ఛీలపరీక్ష నీవు మును చేసియ యుండిన నిట్టి శంకలన్**
**బోలఁగ వీడుమా, కతము పుట్టదుపో యిటువంటివానికిన్.**

కం. **నే వివశగ వ్రాలినచో**
**నావపు వతఁడంటెఁ గాని నా సమ్మతిఁ గా**
**దీ విషయంబునఁ జూడఁగ**
**దైవంబే దోషకారి తథ్యము నాథా!**

కం. **మానసము నా యధీనము**
**మానక నీయంద నిలిచె మానధన! పరా**
**ధీనవుగ్రాతము నెడ నో**
**ప్రాణేశ్వర! యనద నేమియగు నొనరింపన్.**

చం. **చిరముగఁ గూడియుండితిమి చిత్తము లేక ముగాఁగ, హాళిమై**
**తిరిగితి మొక్కటై, పెరిగితి న్నినుఁగూడి, పరస్పరంబు దాఁ**
**పుర మొకయింత లేద, యిటు పొల్పుగనుండియు నాదుశీలమే**
**యరయవ యేని నీవు హతనైతి హృదీశ్వర! శాశ్వతంబుగన్.**

సీ. **నీ చిన్నఁదనమున నేఁ జిన్నదాననై**
**వఱలుచు నిన్ను వివాహమగుట**
**నాఁటఁ గోలెను నిన్ను నాథ దైవంబుగఁ**
**దలపోసినే భక్తి సలుపుచుంట**
**యిద్దఱహృదంబ లేకంబుగా నుష్టఁ**
**గలసియు మెలసియుఁ గ్రాలుచుంట**
**నీ కష్టసుఖములే నా కష్టసుఖములం**
**చన్ని యవస్థల ననుసరించి**

ఆ. **నేను దిరుగుచుంట నిర్మలశీలంబు**
**నీ వెఱుంగనివియె నీరజాక్ష!**
**యేల యొక్కొ యిప్పు డిన్నియు వెనుకకు**
**నెట్టి శంకనొందె పట్టితీవు?**

ప్రాణేశ్వరా! నీ మనస్సులోని యీ విషయము నింతదనుక నేల దాఁచితివి? ఆనాఁడే లంకకు హనుమంతుని బంచినపుడు చెప్పి పంపియుండరాదా? అప్పుడే నీవు విడిచినట్లు, ప్రాణములును నన్ను విడిచియుండుఁ గదా. నేను దేహమును బాసి యుండిన నీకింత ప్రాణాపాయ కరమగు శ్రమము లేకుండునే. నీవు గాసిపడుటయే గాక నీ మిత్రులకును నీ హితులకు నాకు నెంత నిష్ఫలమైన శ్రమము గలిగించితివి.

ఉ. కేవల కోపమూనుటను గీడును మేలు దలంపలేక యో
భూవర! నీచమానవుని పోలిక నాఁడుతనంబు నొక్కటే
భావన చేసెదే జనకు వ్యాజమునం ధరనుండి పుట్టుటల్
నావలపున్ సువృత్తము దలంపవు వృత్తవిధిజ్ఞ! యేమనన్.

కానీ నాథా నిన్నన నేల? నా గ్రహచారబల మిట్టిఫలము నొసఁగుచున్నది అని పలికి దుఃఖాక్రాంతుఁడై కన్నీరుమున్నీరుగాఁ గాఁఱఁ దలవంచియున్న లక్ష్మణుఁ జూచి "సౌమిత్రీ! మగనిచే ననుమానింపఁ బడిన యీ దేహము నిఁక నేను నిల్పరాదు. కావున చితి పేర్పుము. అదియె నా గాఢశోకమున కౌషధము.

కం. నుతగుణతతులన్ మెచ్చని
పతిచేఁ బేరోలగమునఁ బరిహృతయగునా
సతికిన్ యోగ్యంబగు నా
గతిఁ జనెదన్ వహ్నిఁజొచ్చి కాకుత్థ్సవరా!

అనిన లక్ష్మణుఁడు రాముని మోముఁజూచి యాయన యింగితం బెఱిఁగి వెంటనే యొక పెద్దచితి పేర్చెను. నాలుకలు గోయుచు జ్వాలలాకసమున కెగయ మండుచుండు నగ్ని హోత్రునిజూచి సమీపించి చేతులు మోడ్చి ప్రదక్షిణించి

కం. సత్యంబుగ నా హృదయము
నిత్యంబుగ రామునంద నిలిచి తలఁగదేన్
బ్రత్యయగతి నెల్లెడలం
దత్యంతముఁ బ్రోచు నన్ను హవ్యవహుండున్.

కం. శిష్టచరిత్రను నన్నున్
దుష్టఁగ భావించె విభుఁడు దుష్టను గానేన్
స్పష్టముగ లోకసాక్షి య
నిష్టముఁ దొలఁగించిద హనుఁ డెల్లెడఁ గాచున్.

అని నిశ్చలయమైన మనస్సుతో యజ్ఞాగ్నిలోఁ బడు నాజ్యమో పుణ్యక్షయమున నాకసమున నుండి నేలఁద్రెళ్లు దేవతాస్త్రీయో యన మంటలోఁ బడెను. చూచుచున్న బాలకులు వృద్ధులు స్త్రీ పురుషులు గడగడ లాడిరి. అయ్యో అయ్యో యనువారును హాహాకార మొనర్చు వారును బాష్పములు





సీత అగ్నియందు ప్రవేశించుట

కార్చువారునై యచట మూఁగిన వానర రాక్షస దేవతావరులు తల్లడిల్లిరి. ఆ యేడ్పు ధ్వనులు వినలేక రాముఁడు కన్నులనిండ నీరు పెట్టుకొని తనలోఁ దానే చింతలో మునుఁగుచుండెను. అంత కొంతసేపటికి బ్రహ్మ శివుఁడు ఇంద్రుఁడు వరుణుఁడు లోనగు దేవతలందఱు గుంపుగూడి వచ్చి శ్రీరాము ననేక విధముల నుతించి సీతాదేవి నిర్దోషురాలనియు ఆమెను నుపేక్షించుట తగవు గాదనియు మానవభావముతోఁ జేయవలసిన రావణవధ ముగియుటచే నిఁక మాయామానుష చరిత్రము మానవచ్చుననియుఁ జెప్పిరి.

అగ్నిహోత్రుఁడును నరరూపముఁ దాల్చి వాడని మాల్యములు, వీడని సరములు, చెక్కుచెదరని మేను, చిక్కువడని కుంతలములు రక్తాంబరముగల సీతను బిడ్డ నెత్తుకొన్నట్టు లెత్తుకొని వచ్చి రాముని యెదుట నిల్పి యిట్లనియె.

రామచంద్రా! యీమె నా భార్య వైదేహి. ఈమె యందు లవమాత్రమైన నే దోషము లేదు. పరమ పవిత్ర. మనోవాక్కాయకర్మంబుల సదా నిన్నే



అగ్నిహోత్రుడుఁ సీతను శ్రీరామున కప్పగించుట

ధ్యానించి చరించుచుండెను. ఈమె మూర్ఛపోయిన తరుణమున రావణుఁడు బలత్కారమునఁ బట్టి తెచ్చెను. వాఁడెంతో యాసవించెను. మోసగించెను. భీతిముంచెను. ధిక్కరించెను. క్రక్కసించెను. ఏమి చేసినను మనమునన్నైన నీమె వానిని స్మరించినది గాదు. వానిని తృణమువలెఁ జూచెను. కావున నా మాటఁ బట్టియైన నీమెను మరల నేలుమనిన శ్రీరాముఁడిట్లనియె. ఈమె శీలము నేనెఱుఁగని వాఁడఁగాను. ఈమె నిర్దోషురాలని యెఱుఁగుదు. తన పాతివ్రత్యముచేఁ దన్నుఁ దాను రక్షించుకొనఁగలదని సముద్రము చెలియలికట్టను మీఱనేరనట్టు రావణుఁ డీమెను నతిక్రమింప నేరఁడని మండెడు మంటనుపోలె నీమెను ధిక్కరింపలేఁడని ఎండ సూర్యునివలె నన్నీమె విడిచియుండఁ జాలదనియు నెఱుంగుదు. ఇన్ని దినములు దుష్టునింటనున్న యువతిని బరీక్షింపక గ్రహించిన దశరథపుత్రుఁడు రాముఁడెంత కామి మోహియని లోకులు నిందింతురని యపవాదమునకు వెఱచి యిట్టి నిర్దయమైన పని చేసితిని. లోకము నోరు మూయ మూకుడు కలదా? అని సీతను గ్రహించి సంతుష్టుఁడయ్యెను.



పదపడి సీతారామలక్ష్మణులు సమస్త వానర సైన్యముల తోడను విభీషణాదులతోడను బుష్పక మెక్కిపోవుచు మార్గమధ్యమున కిష్కింధలో వానర నాయకుల భార్యల నందఱ నందెక్కించుకొని చక్కఁబోయి యొక పూఁట భరద్వాజాశ్రమమున నుండి మఱునాఁడు నంద్రిగ్రామముఁ జేరి భరతుఁ గలసికొనిరి. ఆవల సీతారాములకు పట్టాభిషేక మహోత్సవము జరగెను. శ్రీరాముఁడు వానరుల కందఱకు బహుమతు లిచ్చెను. సీతాదేవి తన మెడలో నున్న యమూల్య హారమును హనుమంతునకుఁ కానుక యిచ్చెను. శ్రీరాముఁడును సీతతోఁ గూడి ధర్మహాని లేకుండ రాజ్యమును బరిపాలించుచుండెను.

రుక్మిణి : అప్పా? సీతాదేవి యెంత కష్టపడెను? అద్భుత మద్భుతము.

తండ్రి : అయ్యో! ఆమె వృత్తాంత మింకను ముగియలేదు. తక్కిన చరిత్ర మంతయు రేపు చెప్పెదను. అది వినినఁ గాని సీతాదేవి మహిమ యంతయుఁ దెలిసిన దానవు గావు.

రుక్మిణి : అట్లైనఁ గొంచెముండుము. సీతాదేవికి టెంకాయ కొట్టి కర్పూరము హారతి యెత్తి పాటలు పాడుదుము.

తండ్రి : శుభము. కానిండు. ఎప్పటికైనను సీతారాముల కిరువరకు పూజలు చేయుఁడు. సీతను విడిచి రాముని మాత్రము కోరితిరా శూర్పణఖవలెఁ జెడుదురు. రాముని విడిచి సీతను మాత్రము కోరెదరా రావణువలెఁ జెడుదురు. వారి నిద్దఱను గొలుచువారు సుఖపడుదురు.

అమ్మణ్ణి : ఇంకను మేము పండుకొనువేళ కాలేదు. ఈ దినమొక కథ చెప్పెదనని నిన్న చెప్పితివే ఆ కథ చెప్పుము.

ఉత్తర హిందూస్థానమున నొక గ్రామములో నొక యింట భార్యాభర్త లొకచోటఁ బండుకొని నిద్రపోవుచుండిరి. దీపము వెలుగుచుండెను. ఇట్లుండ నర్ధరాత్రమున నింటి కప్పులో నుండి యొక పుడక వానిమీఁదఁ బడెను. వాఁ డులికిపడి లేచి చూడనా పుడక తటాలున పామై యతని భార్యను గఱచి పరువెత్తెను. ఇది యేమి యాశ్చర్యమని యతఁడు భార్య నచ్చటనే బంధుల యొద్ద విడిచి యాపాము వెంటఁ బోయెను. ఆ పాము కొంచెము దూరము

పోయి నక్కయై యప్పుడ యింటిలో నుండి వీథిలోనికి వచ్చిన యొక బాలుని కఱచి యా పల్లెవిడిచి పరువెత్తెను. ఇట్లు మఱియొక గ్రామమునకుఁ బోయి యా నక్క పిచ్చికుక్కయై యిద్దఱు బాటసారులను గఱచి చంపెను. బ్రాహ్మణుఁడిది యంతయుఁ జూచుచు నేమి వింతయని కానరాకుండ దానివెంటనే పోవుచుండెను. ఇంతలో నుదయమయ్యెను. అంతట నా పిచ్చికుక్క దున్నపోతై వీథుల వెంటఁ బరువెత్తుచు మఱికొందఱఁ బొడిచి త్రొక్కి చంపెను. ఇట్లు చంపి రాచబాటను బడి కొన్ని క్రోసులు పోయి యచ్చట నొక చెట్టు క్రిందఁ బదునాఱు సంవత్సరముల యాఁడు పిల్లయై నిలిచెను. ఈ బ్రాహ్మణుఁడును జెట్టు మఱుఁగున నుండి చూచుచుండెను. ఇట్లుండ నా త్రోవన నిద్దఱు రాజపుత్ర కుమారులు గుఱ్ఱము లెక్కి పోవుచు నత్యద్భుతమైన సౌందర్యము గల యీ చిన్నదానిని జూచి యచ్చెరువుపడి యొంటిగ నీ చిన్న దిందేల యున్నదని యాలోచించి గుఱ్ఱములు దిగి వచ్చి బాలికా! నీ వెవ్వతెవు? ఇందొంటిగ నీవేల యున్నావని యడిగిరి. అదియును బ్రత్యుత్తర మేమియుఁ జెప్పక వాడిన ముఖముతో నెండిన పెదవులతో దప్పియగు చున్నది, మంచినీరు కావలయునని సైఁగ చేసెను. వారును దాని స్థితికిఁ బరితాపపడి యొకని నందుంచి మఱియొకఁడు దూరమందున్న కొలనికిఁ బోయి నీరు దెచ్చెను. వాఁడు రాఁగనే యా సుందరి కోపముచే నెఱ్ఱనైన కన్నులతో "అయ్యా మీరు పెద్ద మనుష్యులనుకొంటిని. నీ వటుపోఁగాఁ జూచి నన్నీ పాపాత్ముఁడు బలాత్కరించి చెఱుపఁ బ్రయత్నిందచెను. రాజపుత్రులై యుండియనాథల రక్షింప వలసినవారై యుండి యిట్టి యాగడము చేయవచ్చునా? నీవిప్పుడు రాకుండిన వీఁడు నా సిగ్గుదీసి యుండును" అని చెప్పెను. వాఁడా మాటలు విని యాగ్రహించి యోరి పాపాత్ముఁడా యెంతకు వగ చెడితివిరా యని కత్తిదూసి వానిపైఁబడి కొట్టఁబోయెను. వాఁడు ప్రత్యుత్తరము చెప్పుటకైన నవకాశము లేక చావు దప్పించుకొనుటకై తానును గత్తి దూసెను. ఈ ప్రకార మిరువురు కలహించి యిరువురు చచ్చి దాని కాళ్ళ యొద్దనే పడిరి. అచ్చట నుండి యా చిన్నది పోయిపోయి యొక యడవి ప్రవేశించి ముసలి బ్రాహ్మణుఁడుగా మాఱెను. ఈ పిల్లబ్రాహ్మణుడు తటాలున నతని యొద్దకుఁ బోయి యయ్యా నీవెవ్వఁడవని యడిగెను. వాఁడేమియు బ్రత్యుత్తరము చెప్పక విసవిస పోవుచుండెను. పిల్ల బ్రాహ్మణుఁడు డడ్డమునిలిచి యతని పోనీయక నీవెవ్వరవు? నిజము చెప్పుము అని యడిగెను. వారి కిరువుర కిట్లు సంభాషణము జరగెను.



పిల్లబ్రాహ్మణుఁడు : నీవు నా భార్యను జంపినది మొదలు నీవు చేసిన కార్యము లన్నియుఁ జూచుచు వచ్చితిని. నీవెవ్వఁడవు? నిజము చెప్పుము.

వృద్ధబ్రాహ్మణుఁడు : నే నెవ్వఁడనైన నీకేమి? ఊరక నీ త్రోవనుఁ బొమ్ము. లేకున్న నీ ప్రాణములు నీవి గావు.

పిల్లబ్రాహ్మణుఁడు : నాకుఁ బ్రాణభీతియే యుండిన నీవెంట నీ ఘోరారణ్యము నకు నొంటిగ వత్తునా? ప్రాణభయము నాకు లేదు. నీవు చెప్పకపోయితివా? యిప్పుడు నీ కాళ్లపైఁ బడి ప్రాణములను నేనే విడిచెదను అని రెండుకాళ్లు గట్టిగఁ బట్టుకొనెను.

వృద్ధబ్రాహ్మణుఁడు : లేలెమ్ము. చెప్పెదను. నేను యమకింకరుఁడను. లోకములో సాధారణ మార్గముల రోగాదులచే జనులు చచ్చుటకు వలను లేనపుడు ఆకస్మికముగఁ గొందఱును జంపవలసి నపుడు మేము దూతలము యముని యాజ్ఞ శిరసావహించి వచ్చి యీ ప్రకారము దేవకార్యము నిర్వహించుచుందుము. తెలిసినదా. ఇఁక నీ త్రోవ నీవు పొమ్ము.

పిల్లబ్రాహ్మణుఁడు : తెలిసినది. ఇంకొక్కమాట. నేనెక్కడ నెట్లు మరణింతునో చెప్పుము.

వృద్ధబ్రాహ్మణుఁడు : నీ యేఁబదవ సంవత్సరమున నీవు గంగలో స్నానము చేయుచుండ నిన్ను మొసలి చంపును.

ఆ మాటలు విని బ్రాహ్మణ కుమారుఁడు భయపడి గంగయను పేరే వినరాని యొకయూరికి దక్షిణదేశమునకు వచ్చి యందునొక భాగ్యవంతునింటఁ గుదురుకొనెను. ఆతఁడా యింటికి రాఁగానే యా మఱుసటి నెలయందే యాయన భార్యకు ముట్టు నిలిచి సంవత్సరము లోపలనే గుమ్మడిపండువంటి కుమారుడు పుట్టెను. ఆ కారణముచే నా దంపతుల కాతని యందుఁ బ్రీతి యెక్కువయ్యెను. ఆ పిల్లవానికి నీ బ్రాహ్మణుఁడే చదువు సంధ్య యంతయు నేర్పుచుండెను. ఆ పిల్లవాఁడును వానియందుఁ బంచప్రాణము లుంచుకొని యొక నిమిషమైన నెడఁబాయక యుండెను. ఇట్లొక పది సంవత్సరములు జరగెను. అప్పుడు గంగా పుష్కరము వచ్చెను. అందఱు గంగ యందు స్నానము చేయవలయునని పోవుచుండ ధనవంతులైన యీ కుటుంబము వారును

పోవc బ్రయాణమైరి. ఈ యుపాధ్యాయుcడు తాను రానని తనకుc గల భృతి చెప్పెను. అయ్యా! నీవు గంగయందు స్నానము చేయకుండినc బోనీ. పిల్లవాని వెంటరమ్ము. నీవు రాక వాcడును రాcడనిన సరియని యంగీకరించి వారివెంటc గాశికిc బోయెను. అందఱు స్నానము చేయుచుండ నతcడు మాత్రము తీరమునc గూర్చుండెను. చూచినవారందఱు ఎవ్వడీc చండాలుcడు గంగయందు స్నానము చేయకున్నాcడు? అని కొందఱు తిట్టిరి. కొందఱు నవ్విరి. అప్పుడా గృహస్థు అయ్యా నీవు భయపడకుము. ఇనుపకమ్ములు చుట్టు కట్టిన స్థలములో మాతోడ స్నానము చేయుము. చుట్టును మనుష్యులను గావలి యుంచెదనని యతని నీటిలోనికి మెల్లగ దింపెను. అతcడు నీటిలో మునిగెనో లేదో ప్రక్కనుండిన బాలుcడు తటాలున నీళ్లలోc బడి మొసలియై యతనిమెడను బట్టుకొని నీళ్లలోని కీడ్చుకొని పోయి రహస్యము నీకుc జెప్పినందుకు నాకెంత కష్టమిచ్చితివి చూచితివా యని చెప్పి యతనిc జంపెను.

## మూడవ భాగము

రుక్మిణి : నిన్న రాత్రి జాము ప్రొద్దుండcగనే మేలుకొంటిని. అప్పుడు నీవు నిన్న చెప్పిన సీతాదేవి చరిత్రము జ్ఞప్తికి వచ్చెను. ఆ విషయమే యాలోచించుచుంటిని. ఆమె యెక్కడ సీత అబ్బా! ఆమె ధైర్యమేమి! స్థైర్యమేమి! నిబ్బరమేమి! పాత్రివ్రత్యమేమి! మాహాత్మ్యమేమి! ఆశ్చర్య మాశ్చర్యము!! అంత కష్టములోc గూడ నామె కెంత యోర్పప్పా!

తండ్రి : జ్ఞానవే బలము. పూర్వుల నిశ్చయమింతే. మనము పూర్వజన్మమునc జేసిన పుణ్యపాపముల కొలcది మనకుసుఖము దుఃఖము కలుగుచుండును. అవి మనము రమ్మనినరావు. పొమ్మనినc బోవు. వచ్చినపుడు అనుభవించి తీరవలయును. కాcబట్టి మేలునకై సంతోషపడి లాభమేమి? కష్టమునకై శోకించికార్యమేమి? వారింపరాని దానిని సహింపవలయును. ఈ జన్మమున మనముచేయు పుణ్యపాపముల కొలcది మనకు మఱుజన్మమున సుఖదుఃఖములు గలుగును. ఇప్పుడేమి చేయుటకు మనము స్వతంత్రులము గదా. కావునc బుణ్యమే చేయుదము అని పూర్వు లాలోచించి సత్కార్యములే చేయువారు.



రాముcడు : ఇప్పటి యాcడు వారివలె ననుకొంటివా మునుపటివారు. "వ్రేలి మీcద గోరు మొలచినది. వెఱ్ఱిమగcడా వేఱుందము రా" అని యేమి కొంచెము నొప్పి తగిలినను ఆకాశము విఱిగి నెత్తిమీcద బడినట్టు ఇప్పటివారు కొందఱు కొంప చించి పందిలి పెట్టుదురే.

అమ్మణ్ణి : ఓరి పిచ్చివాడా! రౌతు కొలcది గుఱ్ఱమురా. ఇప్పటికైనc బోయి యీ యూర నింటింటc జూడుము. మగవారి జాత్యభిమానముగాని మతాభిమానముగాని లేక యనాచారముల పాలు దురాచారముల పాలయి, దేహమే దేవుcడని తలcచి తాము చెడి యాcడువారిని కూcడc దప్పు త్రోవలc ద్రిప్పిన కొంపలలోc దప్పc దక్కిన చోట స్త్రీలే యాచారవతులుగాను భక్తిశ్రద్ధలు గల వారుగాను నున్నారు. మగవారే తాc జెడ్డక్రోcతి వనమెల్లc జెఱిచినట్టు స్త్రీలకుc గూడ దుర్బోధములు చేయుచున్నారు. తెలిసిన స్త్రీలు మీ పాడెట్లయినc బొందని తమ మంచిమార్గములోనే యున్నారు. చెప్పువారు లేక మంచి చెడ్డ తెలియని పిల్లలు మగవారితో పాటు చెడుచున్నారు. స్త్రీలు చెడిపోవుటకు బాగుపడుటకుc బురుషులే కారణము. అత్తవలన దొంగతనము మగనివలన ఱంకుతనము క్రొత్తకోడలు నేర్చు కొనుననుట వినలేదా? మగc డింట నెందో మూల నుండి పెండ్లమును విచ్చలవిడి వీథులవెంటc దిరుగనిచ్చుచు, పోరాని చోటులకు నొంటిగc బోనిచ్చుచుc దినరానివి తిననిచ్చును, చేయరానదివి చేయనిచ్చుచు దుర్మార్గములు మరపిన నది దానికి క్రోcతికి సారాయము పోసినట్టయి సివమెత్తి యెదురుతిరిగి వాని నెత్తిపై మిరియాలు నూఱిన అబ్బా ఆడువారు చెడ్డవారనుచుందురు. మంచివి నేర్పినవారు నేర్చుకొనమనిరా?

తండ్రి : అమ్మణ్ణి ! నీవు చెప్పినది సత్యము. ఆ నిమిత్తముగనే మీకీ కథలు చెప్పుచుచున్నాను. ఎన్నియో వేల సంవత్సరములనాcడు పుట్టిపోయినవారి పేర్లు మన మిప్పటికి నేల జ్ఞప్తియం దుంచుకొని వారిని గౌరవించుచున్నాము? వారియందేమి గొప్పతనము కలదు? అని బుద్ధిమంతు లాలోచించి వారి చరిత్రములు తెలిసికొన వలయును. కాcబట్టి యే విధముగ నడచుకొనుటచే మన పూర్వులు శాశ్వతమైన సత్కీర్తిని సంపాదించిరో యావిధముల నన్నిటిని ఉన్న

వున్నట్టు చెప్పుచున్నాను. ఆ ప్రకారమే మీరు నడచుకొనిన మీకు నట్టికీర్తి పుణ్యము గలుగును. మంచి చెడ్డ చెప్పునట్టివారు లేక పిల్లవాండ్రు చెడుచున్నారంటివి కదా. మీకుఁ గావలసిన వన్నియుఁ చెప్పువంతు నాది. ఆ ప్రకారము నడచుకొను వంతు మీఁది. కాఁబట్టి స్త్రీ ధర్మమెట్టిదో, పురుష ధర్మ మెట్టిదో, బాలకుల ధర్మమెట్టిదో, వృద్ధులధర్మమెట్టిదో మీకుఁ దెలియఁ జెప్పెదను. మీకు బాగుపడు వ్రాఁత యుండెనా యవి మీకు రుచించి యా ప్రకారము నడచుకొందురు. మీ పాపము బలముగా నుండి చెడిపోవు వ్రాఁత యుండెనా యవి మీకు రుచింపవు. పంది బురద మెచ్చును గాని పన్నీరు మెచ్చునా?

రుక్మిణి : ధర్మ మనఁగా నేమి? అధర్మ మనఁగా నేమి? ఏ యాధారమును బట్టి యిది ధర్మమని యిది యధర్మమని చెప్పెదవు?

తండ్రి : నీ వడిగిన ప్రశ్న చిన్నదే కాని ప్రత్యుత్తరముగ ధర్మముల పట్టిక చెప్పవలయు ననిన నొక గ్రంథమగును. అయినను మీకుఁ దెలియునట్లు ధర్మ లక్షణ రహస్యము సంగ్రహముగా నిప్పుడు చెప్పెదను. దానిని జ్ఞప్తియందుంచుకొంటిరా యేది ధర్మమో యేది యధర్మమో మీకు తెలియును. ఇదిగో వెన్నెల కాంతి నిచ్చు గాజుకుప్పె గల యీ దీప స్తంభమును జూడుము. నీకు మొట్టమొదటఁ గనఁబడునది యేది? దీపస్తంభము గాజుకుప్పె కదా. వాని లోపల నేమున్నది? దీపము. ఆ దీపమున కేమి యాధారము? వత్తి. దీపము దేనివలన వెలుఁగును? చమురు చేత. దీపము గాజుకుప్పెయీ రెంటిలో నేది ముఖ్యము?

రుక్మిణి : రెండును ముఖ్యములే. గాజుకుప్పె లేకుండిన దీపము నిలువదు. దీపము లేకుండిన గాజుకుప్పె యుండి ప్రయోగజనము లేదు.

తండ్రి : చక్కఁగనే చెప్పితివిగాని యీ గాజుకుప్పె పగిలి పోయిన మఱియొక గాజుకుప్పె యిటువంటిదో యింత కంటె మంచిదో లేక వేఱురంగు కలదో దీనికిఁ బెట్టవచ్చునా పెట్టకూడదా?

రుక్మిణి : పెట్టవచ్చును.



తండ్రి : దీప మాఱిపోయె ననుకో. దీపము కాక మఱియేదైన గాజుపెంకో మిరపకాయో యుంచిన నిట్టికాంతి యుండునా?

రుక్మిణి : దీపానికి మె బదులేమున్నది? దీప.

తండ్రి : ఇప్పుడు చెప్పుము. రెంటిలో నేది శ్రేష్ఠము?

రుక్మిణి : తేజస్సు లేని దానికంటెను దేజస్సు గలది శ్రేష్ఠముగదా. కావున దీపమే శ్రేష్ఠము.

తండ్రి : ఒక్కొక్కసారి దీపము చక్కఁగా వెలుఁగదే యేల?

రుక్మిణి : కొడిగట్టినను వెలుఁగదు. వత్తి దుమ్ము నిండియో మఱి యే కారణము చేతనో చెడిపోయినను వెలుగదు. చమురు మంచిది కాకుండినను వెలుఁగదు.

తండ్రి : దీపము బాగుండినను బయట వెలుతురు బాగుండదేల?

రుక్మిణి : గాజుకుప్పె పొగచూరుట చేతనో దుమ్ము నిండుట చేతనో మురికిగా నుండినఁ బ్రకాశముండదు. గాజుకుప్పెను బాగుగ కడిగి తుడిచి యుంచిన వెలుతురు బాగుండును.

తండ్రి : కుండలో దీపము పెట్టిన?

రుక్మిణి : వెలుతురే యుండదు

తండ్రి : కాబట్టి దీపమును కుప్పెనుగూడఁ జక్కఁగ నుంచుకోవలయును. రెంటిలో దీపము శ్రేష్ఠము. ఒక గాజుకుప్పె పోయినను మఱియొక కుప్పె దొరకును గనుక దీపమును విశేషశ్రద్ధతో రక్షింపవలయును. నీ వెపుడైనఁ బీనుఁగును చూచితివా?

రుక్మిణి : చూచితిని.

తండ్రి : వాఁడు చచ్చినాఁ డనఁగా నేమి?

రుక్మిణి : కదలలేక, మెదలలేక, యేమి చేసిననుఁ దెలిసికొనలేక, మాటాడలేక, వినలేక, కనలేక, శ్వాసములేక, ముఖమున కాంతిలేక, నాడి నిలిచిపోయి యుండిన వానిని చచ్చినవాఁడని యందురు.

తండ్రి : వాఁడేల యట్లులయ్యెను?

రుక్మిణి : ప్రాణము పోయెను. అట్టయినాఁడు. అంతమాత్రము తెలియదా?

తండ్రి : ప్రాణమనగా నేమి?

రుక్మిణి : అదేమో.

తండ్రి : ఇప్పుడు చెప్పెదను. విను. గాజుకుప్పె తోడి స్తంభము వంటిది మన దేహము. దీపశిఖ వంటిది మనలోనుండు జీవుడు. వెలుతురు వంటిది ప్రాణము. ధ్యానము చేయు మనస్సు వ్రత్తి. చమురు దేవుఁడు అనుకో. దీప మాఱిపోయినపుడు గాజుకుప్పె యందుఁ దేజస్సు లేనట్లే జీవుఁడు పోఁగనే దేహము తేజోహీనమై పోవును. మనలోని తేజశ్శక్తి జీవునిదిగాని దేహముది గాదు. ఆ తేజస్సు ఉండునంత వఱకే మనము కదలుట వినుట చూచుట మొదలైనవి చేయగలము. ఆవిరి లేకపోయినఁ బొగబండి యేమగును? మనుష్యుఁడు త్రొక్కకున్నఁ ద్రొక్కుఁడుబండి యేమగును? అట్టులే మన దేహము కూడ. మనకుఁ గనఁబడు దేహమొకటి యున్నది. దీనిలో మనకు బటకికిఁ గనఁబడక దాని నాడించుజీవుఁడున్నాడు. ఒక కుప్పెపోయిన మఱియొక కుప్పె వచ్చునట్లు జీవునకు ఈ దేహము పోయిన మఱియొక దేహము వచ్చును. కాఁబట్టి దేహము పోఁగనే వచ్చిన విపత్తు లేదు. మంచి వ్రత్తి చమురైననే దీపముచక్కఁగ వెలుగునట్లు మన ధ్యానము దేవునియందుండిననే మన జీవుఁడు నిర్మలుఁడుగా నుండును. వ్రత్తి మఱికి లేకుండిననే దీపము చక్కఁగ వెలుఁగును గావున మనస్సు ధ్యానము పాపచింతలచే మఱికిపడునట్లు చేయరాదు. గాజుకుప్పె పరిశుద్ధముగ నుండిననే వెలుతురు బాగుండునట్లు మన దేహమును స్నానాహారాదుల చేతను త్సహవాసము సచ్చింతనము చేతను బరిశుద్ధముగ నుంచుకొనిన నే జీవుఁడు చక్కఁగ బ్రకాశించును. జీవుని ప్రకాశ మెక్కువగ గోచరమగునట్లు చేయు కార్యమేదో యది ధర్మము. ఈ ధర్మము జాతికొలది యుండును. ఉత్పత్తి యయిన వానికన్నిటికి దేహము జీవుఁడు రెండు నుండును. అన్ని దీప స్తంభములలోను దీపమొక్క విధమగునట్లు అన్ని జంతువులలోను జీవుఁ డొక్కవిధమే. నానా విధము లయిన స్తంభములు కుప్పె లున్నట్లు దేహములు వేఱువేఱు రూపములుగా నుండును. వారివారి పుణ్యపాపముల కొలఁది మంచి



చెడ్డ దేహములు గలుగును. జ్ఞానము లేని పులులు జంతువులఁ జంపును. వాని కది ధర్మమే. జ్ఞానము గల మనుష్యులు ఆ ప్రకారము చేయుట అధర్మము. పిల్లవాండ్రు దోఁగాడుట ధర్మము. పెద్దవాండ్రు దోఁగాడుట యధర్మము. తక్కువ జ్ఞానము కలవారుచేయుట యధర్మము. పశువులు పక్షు లేవైనఁ దినును గదా యని మనుష్యులుఁ దినరాదు. పశువులలో ఆలుమగఁడు అను వివాహ నియమము లేదు కదా యని మనుష్యులట్లు వర్తింపరాదు. నాలుగు జాతులలో నొకరికి ధర్మమైనది మఱియొకరికి ధర్మము గాకుండవచ్చును. అట్లే నాలుగాశ్రమములందును. ఇదంతయుఁ జక్కఁగ బరిశోధించి యెవరెవ రెట్టుట్లు వర్తించిన బాగుండునని యాలోచించి స్త్రీ ధర్మమని పురుషధర్మమని బ్రాహ్మణ ధర్మమని క్షత్రియ ధర్మమని బ్రహ్మచారి ధర్మమని గృహస్థ ధర్మమని వానప్రస్థ ధర్మమని సన్యాసిధర్మమని పెద్ద లేర్పఱిచి యున్నారు. ఎవరెవరు యే స్థితిలో నున్నారో వారు వారాయా ధర్మములందు వర్తించిన బాగుపడుదురు. లేని యెడలఁ జెడిపోవుదురు. ఇప్పుడు నల దమయంతులు చంద్రమతి హరిశ్చంద్రులు శకుంతలా దుష్యంతులు సావిత్రీ సత్యవంతులు సీతారాములు ద్రౌపదీ యుధిష్ఠరులు దేహ సుఖములాశించి వర్తించిరో ఆత్మసుఖము నాశించి వర్తించిరో యే నిమిత్తము వారన్ని పాట్లు పడిరో మీరే యాలోచింపుఁడు. దీపము నుపమానము పూర్ణమైనదిగాదు. మీకు కొంచముగఁ దెలియుటకై యిప్పటికి దీనినిఁ జెప్పితిని.

రుక్మిణి : అగ్నిలో దూఁకినప్పుడు సీతాదేవికి దేహమేల కాలలేదు?

తండ్రి : ఈ చల్లనిగాజు కుప్పెపై నెఱ్ఱఁగఁ గాలిన యినుప కాడ నుంచిన నేమగును?

రుక్మిణి : గాజుకుప్పె పగులును.

తండ్రి : దీపపు వేఁడిమికి గాజుకుప్పె యెఱ్ఱగాఁ గాలియుండిన దనకో. అప్పుఁడు కాలిన కాఁడ నుంచిన నేమగును?

రుక్మిణి : ఏమికాదు.

తండ్రి : అట్టులే తక్కువ వేఁడిమి యెక్కువ వేఁడిమిని నేమియు జేయఁ జాలదు. సీతాదేవి పాతివ్రత్యమును తపస్సు చేత భగవంతుని తేజస్సు దన దేహమందుఁ దల వెండ్రుకలు మొదలు గాలిగోరు వఱకు నిండి నిబిడీకృత మగునట్లు చేసికొని యున్నది. భగవంతుని తేజస్సును కట్టెనిప్పు కాల్పఁ గలదా? ఆమెకుఁ గోపము వచ్చిన నగ్నిహోత్రునిఁ గూడఁ గాల్పఁ గలదని హనుమంతుఁడు చెప్పలేదా?

అమ్మణ్ణి : ప్రశ్నము లన్నియు కడపట నొకసారిగ నడుగుదుము. తక్కిన సీతాదేవి కథ చెప్పుము.

## సీతాదేవి చరిత్రము

శ్రీరాముని పట్టాభిషేకమైన పిమ్మట సుగ్రీవాది వానరులును, విభీషణాది రాక్షసులును, జనకాది మహారాజులును గొన్ని నా ళ్లయోధ్యయందుండి రామునిచే ననుజ్ఞ వడసి తమతమ జనగమునకుఁ జనిరి. రాముఁడును ధర్మయుక్తముగ రాజకార్యములు జరుపుచుండెను. తల్లివలె రఘురాముఁడు పోషించుచుండ నెట్టి బాధలు విచారములు లేశమైన లేక ప్రజలు సంతోషించుచుండిరి.

ఇట్లు బంధువుల నెల్లనంపి వారిని బాసిన విచారము దీఱ సీతారాములుద్యాన విహారమునకుఁ బోయిరి. ఆ యుద్యానవనము నానావిధములయిన ఫలవృక్షముల చేతను, పెక్కు తెఱఁగులైన పూలచెట్లచేతను, పలురంగులుగల యాకుచెట్లుచేతను బ్రకాశించుచుండెను. చక్కని బాటలు దీర్పఁ బడి యుండెను. బాటల కిరువంకల నానారూపముల తీఁగ పొద లల్లింపఁబడి యుండెను. శ్రమము చెందినపుడు కూర్చుండుటకై యందు మనోహరములైన పీఠము లమర్పఁబడి యుండెను. అందందు దామరకొలఁకులు దృష్టి నాకర్షించుచుండెను. కేళాకూళు లింపుదళు కొత్తుచు నుండెను. ఒక్కొక్క యెడఁ గృతకాంద్రులు నిర్మింపబఁడి యుండెను. అది వసంత కాల మగుటచే వృక్షము లెల్లఁ జిగురులతోను బూవులతోను బూప పిందె కాయ పండ్లతోడను నిండి కనుల పండువుగ నుండెను. వాని నిమిత్తమై చిలుకలు లోనగు పక్షులు గుంపులు గుంపులై వచ్చి వ్రాలి దిక్కులు పిక్కటిల్ల ధ్వనులు చేయుచుండెను. కోకిలలు నెమళ్లు కూయుచుండెను. క్రోవుల నుండి నెగయు నీటిబిందువులు చూడఁజూడ నుల్లాసము గొలుపు చుండెను. ఆ వనమునఁ గన్నుల కింపు నింపని పదార్థము, వీనులకు విందు సేయని రవము, ఘ్రూనసుఖ మొదవింపని



వస్తువు, సుఖస్పర్శముల గూర్ప నిద్రవ్యము లేదు. కమ్మనిగాలి నిమ్మళముగ వీచుచు ఘ్రాణపర్వ మొనర్చు చుండెను. ఇట్టి యుద్యానమందు సీతారాములు విహరించుచు నచ్చటి వినోదము లొకరికొకరు చూపుచు వేడుకగను బరిహాసముగను మాటలాడుచుండిరి.

ఈ విధముగ సంచారము చేయుచుండిరి. గాని వారి మనస్సుల నా వనలక్ష్మి యాకర్షించెనో లేదో సౌందర్యముతో సరిపోలు పదార్థ మొకటియు నా వనమందు శ్రీరామునకుఁ గానరాదయ్యె. ఏ జిగురు గాని పూవుగాని గుత్తిగాని కమలముగాని యందలి తుమ్మెదలు గాని యొకటియు సీత యవయవములతో చక్కఁదనమున నెనరాఁ జాలమిని నామెనే శ్రీరాముఁడు చూచుచుండెను. కోకిల గానముగాని చిలుకల పలుకులు యామె కంఠస్వరమున కీడుగాని నామెను బలుమాఱు పలుకరించి యా మాటలే వినుచుండెను. సీత చక్కఁదనము చూచు శ్రీరాముని కన్నులకు నందనమును చైత్రరథమును పోలుచు నందము చిందుచున్న యా వనమందలి సుందరతయెా కిలింత కలిగించుచుండెను. అట్టులే సీతయు నభ్యాసవశమునను శ్రీరాముని కేలూఁత గొనుటను ద్రోవ తప్పక నడచుచుండెనుగాని యా యుద్యానవనమున నొక పదార్థమైన నామె కన్ను విచ్చి చూచెనో లేదో. ఆమె మనస్సు దృష్టియంతయు శ్రీరాముని మీఁదనే యుండెను. అంతకంటెను రమ్యము మనోహరమైన దామెకు గోచరింపలేదు. ఆ యా రామమంతయు నామెకు రామమయముగా నుండెను. నీలకాంతి యంతయుఁ దన భర్త దేహకాంతి యనియుఁ దెల్లపుష్పములన్నియుఁ దన ప్రాణేశ్వరు మందహాసమనియుఁ దలంచుచు నాయననే కనుఱెప్ప వెట్టక చూచుచుఁ గొంచెమెడమైనను సహింపక భుజము భుజ మొఱయునట్లు పోవుచుండెను. పైఁట కొంగడ్డమయినఁ బ్రానమే పోవునను కొంగువ్రేలాడ విడువక చక్కఁగ జెక్కికొను యుండెను. ఎంతో వింతయిన పూవో పండో చూచిన రాముఁడు దానిని దెచ్చి సీత కిచ్చును. సీతయు నట్టులే యపురూపపు వస్తువు దొరికిన దానిని రామున కర్పించునే గాని తా నుపయోగింపరాదు. రామా! లోకములో నీ పేరు మిక్కిలి రుచిమంత మని పలుమాఱు పలుకుచుందురు. చిలుకలు గూడ రామరామ యనుచుండునే. అందఱ కంత మంచివాఁడవయ్యు నీ పేరు నేను బిలువఁగానే యాకూయుచున్న కోకిల యేల భయపడి కూఁత చాలించెను అనిన సీతా! నా భయమువలనఁ గాదు. నీ కంఠధ్వని విని సిగ్గుచే నోరు మూసికొనెను అని రాముఁడు ప్రత్యుత్తరము

చెప్పెను. ఈ తుమ్మెద లేల మన మీఁద వ్రాలుటకై యింత దగ్గఱకు వచ్చి గిఱుక్కున వెనుకకు మరలిపోయెను? అని సీతయడుగ నీ ముఖము కమలమని భ్రమించి వచ్చి నీవు చంపక నాసవగుట చూచి పరువెత్తును అని యీ రీతిఁ బ్రియంబులు పలుకుచు వారు విహారంబులు సలిపి యుద్యాన పాలురకుఁ దగిన బహుమతు లొసఁగి మరలఁ దమ సౌధంబునకు విచ్చేసిరి. భోజన మజ్జనాదికములు ముగిసిన పిమ్మట రాత్రివేళఁ జంద్రకాంత శిలలచే సొబగైన వేదికపయిఁ గూర్చుండిరి. అప్పుడు సీతాదేవి యుబుసుపోక్కకై రామాజ్ఞ ప్రకారము లక్ష్మణుఁడొక పటము వ్రాయించి తెచ్చెను.

రాముఁడు : లక్ష్మణా! యేమది నీ చేతియందు.

లక్ష్మ : వదినెగారికి వనోదార్థము పట మొకటి తమ యాజ్ఞ ప్రకారము వ్రాయించి తెచ్చితిని.

రాముఁడు : ఏమి వ్రాయించితివి?

లక్ష్మ : తమ చరిత్రమునే బాల్యప్రభృతి వ్రాయించితిని.

రాముఁడు: ఎంతవఱకు వ్రాయించితివి?

లక్ష్మ : వదినెగారు హుతావహుని యందు శుద్ధురాలగు వఱకు.

రాముఁడు: పాపము శమించును గాక.

**ప. వెలయ౯ జన్మపవిత్రకు నేలా**
**వలయు౯ వేఱొక పావన విధులు౯ ?**
**గలవే వేఱుగఁ గ్రాలెడి శుద్ధుల్**
**దెలియ౯ వహ్నికిఁ దీర్థంబులకు౯ ?**

దేవీ! యజ్ఞభూపుత్రీ! ప్రసన్నురాల వగుము. ఈ లోకాపవాదము నీ జీవితముతోనే విడువఁ గలదు.

సీత : నాథా! అది యుండనిండు. మీ చరిత్రమును దొలుతఁ జూడ వేడుకగు చున్నది. లక్ష్మణా! ఆ పట మిటు దుమ్ము.

లక్ష్మ : ఇదో పటము

సీత : నాథా! ఈ మునీశ్వరు లెవరు. మామాగిరిని గోపదృష్టిని జూచు చున్నారు.



రాముఁడు: మా గురువులు విశ్వామిత్రులు.

సీత : ఔనౌను. నా వివాహ కాలమునఁ జూచితిని. మామగారిపై వీరికేల కోపము?

రాముఁడు: తన యజ్ఞమును రక్షింప నన్నుఁ బంపఁ గోరిరి. పుత్ర వాత్సల్యముచే నన్ను విడువఁ జాలక మా తండ్రిగారు తపించుచున్నాను. తొలుత నేమి యడిగినను ఇచ్చెదనని చెప్పి నన్నియ్యక పోయెనని కౌశికులు కోపించుచున్నారు.

సీత : మామగారికి ముందు మాట చెప్పుట వెనుకఁ దపించుట యాచారమైనది. అదియే కడకు వారికి మృత్యువాయెను గదా?

రాముఁడు : సత్యమునకంటెఁ బ్రాణము శ్రేష్ఠము గాదు.

సీత : ఇది మీ ప్రథమ వనవాసము కదా. మీ ప్రథమ వనవాసమున మీరు మువ్వురు.

రాముఁడు : నీ ప్రథమ వనవాసమున మనము మువ్వరము.

సీత : నాథా! యిది యెవ్వతె? శూర్పణఖకు అక్కగా నున్నదే?

రాముఁడు : ఇదితాటక యను రాక్షసి. మారీచుని తల్లి.

సీత : మఱఁదిగారు దీనికి ముక్కు సెవులు గోయుచున్నారే.

రాముఁడు : తొలుత దానిని జంపుట కిష్టము లేక గాయపఱిచినఁ బోవునని తలఁచితిమి. అటుపోక మీఁదికి వచ్చుటచేఁ జంపితిమి.

సీత : (నవ్వుచు) మఱఁదిగారికి ఆఁడువారి ముక్కు సెవులనిన నరఁటి పండ్లు.

లక్ష్మ : వదినె! యిదో మిథిలావృత్తాంతము.

సీత : ఏది? ఏల క్రొత్త నల్లకలువల కాంతులు దిశల నల్లుకొన జలుపాలు ముద్దు గూర్పనుండు యా యన్నగారిని మా తండ్రి విస్మయముచేఁ గనుఱెప్ప వెట్టక చూచుచున్నాఁడు. ఇదో యవలీలగ శివుని విల్లు పెట్టెలోనుండి వెలికిఁ దీసి పుటుక్కున విఱిచిన యా యొయ్యారము నేఁటికిని నా కనుల మ్రోల మెదలుచునే యున్నది.

రాముఁడు: ప్రీతియున్నచోట మఱపేల యుండును?

లక్ష్మ : వదినె! యిదో వివాహ మండపము.

రాముఁడు:

**ఉ. అల్లదె నాఁడు గౌతమమహర్షి ముదంబున నంది యీయఁగ౯**
**మెల్లన నా గృహీత కమనీయ ల సత్కటకంబు నీదు కే**
**లుల్లసిలంగఁ జేసెను మహోత్సవమే యిటు దాల్చె రూపన౯**
**బెల్లుగ నన్ను; నా సమయమే సుముఖీ యిపుడంచుఁ దోఁచెడి౯**

మీ తండ్రి "రామచంద్రా! ఈ సీత నా కూతురు. నీకు సహధర్మచారిణిగా నిచ్చుచున్నాను. పాణిని బాణిచే గ్రహింపు" మని కంకణాలంకృతమైన నీ కర మానాఁ డిచ్చినది నేఁ డిచ్చినట్లున్నది.

సీత : మీరు మీ తండ్రి వాక్యమును వలె నా తండ్రి వాక్యమును నేను బరిపాలించుచున్నాను గదా.

రాముఁడు: పాలించితివి. పరిపాలించుచున్నావు. సంపరి పాలింపఁ గలవు.

సీత : నా యందు మీకట్టి విశ్వాసముండుటచే నెట్టికష్టములు నాకుఁ గష్టములే కావు. లక్ష్మణా! యీమె మాండవి యీమె శ్రుతకీర్తి యీమె యెవతె? అని యడిగిన ఊర్మిళ పేరు తనచేఁ జెప్పించి పరిహసింప నెంచినదని తనలో నవ్వుకొనుచు లక్ష్మణుఁడు వదినె! యిదో యీయనను జూడుము.

సీత : అమ్మా! యీ పరశురామునిఁ జూచిన భయమగుచున్నది.

లక్ష్మ : అన్నా! చూడుము చూడుము. ఈయననే కదా మీరు....

రాముఁడు : అదియుండనీ, ఇంకను జూడవలసిని చాల నున్నవి.

సీత : లక్ష్మణా! మీ యన్నగారి వినయసంపద చూడుము. పెద్దవారిని విధిలేక తిరస్కరించినను మరల దానిని దలఁప రాదని వారి యభిప్రాయము.

రాముఁడు : ఇదో అయోధ్యకు వచ్చితిమి. అయ్యో! దేవీ! కాలమెంత మాఱిపోయెను.



**తే. ధరణి జీవితుఁడై యుండఁ దండ్రిగారు**
**నూతనములైన పెండ్లి వినోదములను**
**దల్లులెల్లరుఁ బ్రేముడిఁ దన్ప మనకు**
**నట్టి దినములు కటకటాయరిగెఁ గాదె?**

లక్ష్మణ : ఏనాఁడు మే లనినఁ జిన్ననాఁడే మేలని తల్లిదండ్రులచే నిర్వ్యాజ ప్రేమంబున లాలింపఁబడు దినములే పుణ్యదినములు. అప్పటి మీ వదినెగదా యీమె. లేజాజుల వలె సన్నములును కొంచె మెడములును దగ్గఱ దగ్గఱ పుట్టుటచే మొగ్గలవలె మనోహరములును నగు దశన కుసుమములచే మనస్సు నాకర్షించు నందము గలిగి యీ ముఖము శిశుత్వమును దెలుపుచున్నది. మిక్కిలి సుకుమారములును సహజ విలాసములును స్వభావ మధురములును చంద్రికా ప్రాయములు నగు నంగకములచే నా యవయవములకు కౌతూహలము కలిగించెను.

లక్ష్మణ : ఇదో మంథర

రాముఁడు : అది పోనీ! జానకీ! దీనిని జూచిన జ్ఞప్తి యున్నదా.

**కం. మును శృంగిబేర పురమున**
**మన కెచ్చట గుహునితో సమాగమ మయ్యె౯**
**ఘనమైత్రిని మైథిలనం**
**దిని! యియ్యది యల్ల యింగుదీ పాదప మౌ.**

ఆనాఁడు మేము జడలు ధరింప నిలిచిన గారెచెట్టు ఇదే సుమా.

సీత : అమ్మా! సుతులను రాజ్యమున నిలిపి మీ పెద్దవఱ లిక్ష్వాకు లేవన వాసవ్రతమును వార్ధకమునఁ జలిపిరో యిట్టి పుణ్యవ్రతమును మీరు బాల్యమందే సలిపితిరి గదా. ఔరా! ఈమె పుణ్యసలిలయుఁ బ్రసన్నయు నగు భాగీరథి గదా.

రాముఁడు: రఘుకుల దేవతా! భాగీరథీ! నమస్కారము. దేవీ యీమెకు నమస్కరింపుము. సగర కుమారులు యజ్ఞాశ్వమును వెదకుచు భూమిని ద్రవ్వి కపిలుని కోపముచే భస్మము కాఁగా భగీరథుఁడు ప్రార్థింప నీమెయె కదా వారి దేహతాపము నణంచి స్వర్గస్థులఁ జేసెను.

లక్ష్మణ : అన్నా! యిదో భరద్వాజ మహర్షి చెప్పిన యమునా తీరమందలి శ్యామవట వృక్షము.

సీత : ఇది మీకు జ్ఞప్తియందున్నదా. నాథా!

రాముఁడు: అదెట్లు మఱతునే?

**చం.** **కర మలసంబులై మృదుతఁ గ్రమ్మములై కడు సుందరంబులై**
**తరుణిరొ నీదు సంగములు దారిఁ ద్వరఁ నడువంగదయ్యుటఁ**
**భరముగ వాడి దుర్బల మృణాళుల రీతిని సొక్కి సోల నే**
**నురువుగ నిండు కౌఁగిళుల నొత్తి శ్రమంబును బాప వాని నా**
**యురమున మోపి నిద్దురను నొందితి విచ్చుటఁ గాదె కోమలీ.**

లక్ష్మణ : ఇఁక వింధ్యారణ్య ప్రవేశము. వీఁడే విరాధుఁడు.

సీత : నాథా! ఎండ వేఁడిమికి నా ముఖమున నూరక చెమట ధారలుగాఱ మీరు గొడుగువలె పట్టుకొని వచ్చిన తాటి యాకు విసనకఱ్ఱ చూఁడగానే వింధ్యారణ్య ప్రవేశ మని చెప్పకయే తెలిసెను.

లక్ష్మణ :

**తే.** **ఈ తపోవనముల సెలయేళ్ళఁ దరుల**
**నమరుతరువుల వైఖానసాశ్రమములు**
**యతుల నిటఁ గొల్చు నివ్వరియన్న మిడుచు**
**నతిథి సత్కార పరగృహస్థాశ్రమములు.**

సీత : నాథా! యీ యాశ్రమములను జూచిన నాకొక కోరిక కలుగుచున్నది. అన్ని సంవత్సరము లా ఋషీశ్వరులతోఁ గలసి మెలసి యుంటిమిగాని మన యోగ్యతకుఁ దగినట్టు వారిని సత్కరింపమైతిమి. అప్పుడు మనము వారితో పాటుంటిమి. ఇప్పుడైనను సత్కరింపకుండినఁ గృతఘ్నత గదా. కావున గంగాతీర వాసులగు ఋషుల పత్నులను జూచి వారికిఁ దగిన వస్త్రాభరణాదు లిచ్చి రా మన సయ్యోడి.

రాముఁడు : అవశ్యము తేపే పంపెదను.

లక్ష్మణ : అయ్యో వదినె! కోరక కోరక యెట్టి కోరిక కోరెదవమ్మా.



రాముఁడు : కోరక కోరక భార్యలు కోరినపు డ దెట్టిదైనను పురుషులు నెఱవేర్చవలసిన వారే. అందుగ.... (సీతాదేవి లజ్జతో రాముని నోరు మూయును). దేవీ! యీ గోదావరీతీరమును జూడుము. ఎడము లేక పెరిఁగిన చెట్ల దట్టపు నీడల నీలములై యెట్టు లున్నవో. ఆ పర్వతమును జూచితివా.

**మత్త.** **అ మ్మహీధరమందు లక్ష్మణుఁ డాచరింప సపర్యలఁ**
**నిమ్మళంబుగఁ బ్రొద్దుపుచ్చుట నీకు జ్ఞప్తిని నున్నదే?**
**నెమ్మదిం దలపోయు దే మధునీర హారిణి గౌతమిఁ**
**అమ్మహిఁ మననాఁటి చర్యల నన్నియుఁ స్మరింతువే?**

**మత్త.** **ఏమొయేమియొ తిన్నదిన్నగ నెంతొ లాలస యుక్తిమై**
**భామ! యవిరళమైన చెక్కులఁ బల్కు చక్రమరీతులఁ**
**శ్యామ! యొండొరు కేలిపై బిగియారు కౌగిఁట నుండఁగా**
**జాములెట్లొ యెఱుంగ రాకయె సాగినన్ జనె రాత్రియే.**

ఇదైన మఱవవుగదా.

లక్ష్మణ : ఇదో శూర్పణఖ.

సీత : హా నాథ! ఇంతవఱకే కద మనకు నొద్దిక.

రాముఁడు : దేవీ మన వేఱుపాటు దలఁచి భయపడె దేల? ఇది పటము గదా?

సీత : నాథా! దర్జును లే రూపముల నున్నను ఎన్నినాళ్లకైనను భయపెట్టువారే.

లక్ష్మణ :

**సీ.** **తల్లిరో యల జనస్థానంబు నాఁ డట్లు**
**పాపాత్మ శూన్యమై పాడువడిన**
**నసురులు కాంచన హరిణమన్ నెపమున**
**జరగించినట్టి యా చరితమునకు**
**నన్న గారును దగినట్టి రీతిని బ్రతీకారంబు**
**కారంబు సలిపిరి గాని నాకు**
**నానాఁటి వృత్తంబు నన్న గారి యవస్థ**
**స్మృతికి వచ్చిన గుండె చీలిపోవు**

**తే. ననఁగ నేటికి నా భంగిఁ గనినయింత**
**గోలుగోలున నేడ్వవే కొండసెలలు**
**పిడుగునకు నైన హృదయంబు పెటిలి పడదె?**
**యెవరు దానిని నకట సహింపఁ గలరు?**

సీత : రఘునందనా! నా వలన మీకెంత కష్టము.

లక్ష్మణ : అన్నా!

**చం. జలజల రాలు బాష్పముల చాలులఁ జిందెడి బిందువుల్ సరం**
**బులఁ దెగి రాలు ముత్యములఁ బోలి యివే నెరసెఁ ధరాస్థలిఁ**
**బలితపువేదనన్ వణఁకు వా తెఱ నాసపుటంబుచేతనే**
**తెలియఁగ నయ్యె దుఃఖభర తీవ్రత మీ రది యెంత దాఁచినఁ.**

గతించిన దానికి మీరిప్పు డేల శోకించెదరు?

రాముఁడు: నాయనా?

**ఉ. ఆపదముస్నుచో జనితమైన సుఖీమణి విప్రయోగ సం**
**తాపము దుస్సహంబె యయినఁ బ్రతికారము వాంఛ మోపితిఁ**
**సైఁపగ దుఃఖకీలల భృశంబగు నారటపాటు నోపనే**
**నాఁప విపచ్యమాన హృదయ వ్రణమట్టుల యిప్పుడేఁచుటఁ.**

సీత : అమ్మా! యది తలఁచుకొలఁది నాథా! నేను మిమ్ముఁ బాసియున్నట్లే మనస్సున నారట ముదయించుచున్నది.

లక్ష్మణ : అన్నా! అది పోనిండు. ఈ గృధ్రరాజు జటాయువును జూడుఁడు.

సీత : హా తండ్రీ! యీ బిడ్డమీఁద నీకెంత వాత్సల్యము!

రాముఁడు : లక్ష్మణా! ఇటువంటి పుణ్యాత్ముఁడు పవిత్రచరిత్రుఁ డెందుండును?

లక్ష్మణ : అన్నా! వీఁడే కబంధుఁడు. ఈమె పుణ్యస్త్రీ శబరి. ఇది ఋశ్యమూక పర్వతము. ఇది పంపాసరస్సు.

సీత : ప్రాణేశ్వరా! యిచ్చటనే కద మీరు సిగ్గు బిడియము ధైర్యము విడిచి నాకై దుఃఖించినది.

రాముఁడు : దేవీ! యీ సరోవర సౌందర్యము నే నేమని చెప్పుదును.



**చం. చెలువ మదర్థమై రుతముసేయక క్రొవ్విన మల్లి కాక్షముల్**
**బలముగఁ బక్షఘాతముల లావగు తూఁడుల నోలలూఁచెడిన్**
**గలువ వనంబుఁ గాంచితిని గన్నుల నశ్రులు రాలుచుటకున్**
**గొలుకుల వెండిబాష్పములు గూడుటకున్ నడుమంతరంబునన్.**

లక్ష్మణ : అన్నా! యిదో మహానుభావుఁడైన యాంజనేయుఁడు.

రాముఁడు : దేవీ !

**కం మనమును భువనంబులు నే**
**యనఘు బలంబునను గృతుల మైతిమొ యతఁడీ**
**ఘనబాహు పరాక్రముఁ డం**
**జనందనుఁ డిదిగొఁ జూడు జనకతనూజా !**

సీత : లక్ష్మణా! దండిగ వికసించిన కుసుమములచే నిండిదెసలు ప్రతిధ్వను లీనఁ గూయు మయూరముల కాకరమైన యీ వృక్షముల క్రింద ధూళిచే బ్రుంగిన మేనితో మీయన్నగారు మూర్ఛపోయి పరుండ నీ వుపచరించుచున్నావే యీ గిరిపేరేమి?

లక్ష్మణ : వదినె.

**ఉ. నీలము స్నిగ్ధమైన వననీరదవారము గప్పమద్దిపూల్**
**చాలుల కమ్మతావి వెదజల్లు నగం బిది మాల్యవంత మౌ.**

రాముఁడు : లక్ష్మణా !

**చాలుర చాలురయ్య యిఁక ఓఆ్మతనయా కటు విప్రయోగ మీ**
**వేళను వెండి గల్గినటు వేదన పెట్టె సంహిపలేనురా.**

లక్ష్మణ : అన్నా! వదినె చాల బడలినట్లు తోఁచుచున్నది. ఇఁక మీరు విశ్రమించుటె బాగు.

రాముఁడు : దేవీ! నీ కోరిక నెఱవేర్చుటే నాకుఁ బ్రియము. ఱేపె నినుఁ బంపెదను. నీవు చాల బడలియున్న దానవు. ఇదో యీ కిటికీల నుండి చల్లనిగాలి వచ్చుచున్నది. ఇందుఁ గూర్చుండుదమా.

సీత : నాకు నిద్ర వారింపరాక. యున్నది. ఇందుఁ గూర్చుండుదమా.

రాముఁడు : దేవీ! నన్నుఁ గౌగిలించి పరుండుము.

**కం. ఐందవకర చుంబిత ని**
**ష్యంద్యైందవ రత్నహారసంపద శ్రమభీఁ**
**జిందెడి చిఱుచెమటల కేల్,**
**పొందించుచు మెడను మనుపు పూఁబోఁడి ననున్.**

అని యామె చేతులను దనపై వైచికొని, ప్రియురాలా! యేమిది నేనేమియు నిశ్చయింప లేకున్నాను. ఇది సుఖమో దుఃఖమో విబోధమో, నిదురో, విషవ్యాప్తియో మదమో కాని నీవు నన్నుఁ దాఁకఁగాఁ దాఁకఁగా నింద్రియములు వానివాని వ్యాపారములం దసమర్థములై కలఁత చెందిన చైతన్యమును జక్రమువలెఁ ద్రిప్పుచున్నవి.

సీత : మీ మనస్సు నిర్మలము. అంతకంటె మఱేమున్నది.

రాముఁడు: దేవీ! యెంత చక్కఁగఁ జెప్పితివి.

**ఉ. అంబుజనేత్ర! నీదు వచనామృత ధారలు వాడు జీవపు**
**ష్పంబులకున్ వికాసములు, సమ్మద మేతువు లింద్రియాళికిన్**
**ఇంబగు మోహనంబులు, రహిఁ శ్రవణామీత బిందుపాతతు**
**ల్యంబులు వెండిమానస రసాయనముల్ గదె కీరవాణిరో.**

సీత : ప్రియంవదుడా! యింకఁ బరుండెదను

అని యిటునటు వెదక నామెను జూచి రాముఁడు "ఓసీ యేమట్లు వెదకెదవు?

**చం. పరిణయమాది లేఁ జిగురుఁ బ్రాయమునందును యౌవనంబునం**
**దరువుగ నింటనైన వనమందున యేని యుపాశ్రితంబునై**
**కరమును నీదు నిద్దురకుఁ గారణభూతముగాఁ దనర్చుచుం**
**గురువగు రామబాహు విదిగోఁ దలదిండగు నీకుఁ గోమలీ.**

సీత : అట్టులే కానిమ్ము (అని పండుకొని నిద్రించెను)

రాముఁడు : నాయం దీ సతి కెంత స్నేహము. వేఱుపాటు సహింపమిని వక్షమునందే శిరము మోపి నిద్రించు చున్నది.

**ఉ. ఇంటను నీమె కల్మి చెలి, దృక్కులకో యమృతంపు ప్రత్తినా**
**యొంటికీ నీమె నంటుటయె యుత్తమ చందనచర్చ, తన్వి కే**



**ల్గంట మదీయ కంఠమునఁ జల్లని నిద్దపుమంచి ముత్తెపుం**
**గంటసరంబు; నిష్టమెది గాదొకొ నేఁ జేలిఁ బాయకుండినన్.**

అని యామెను చూచుచు నామె స్నేహమును దలఁచుచు, నామె గుణము లగ్గించుచు నానంద సుఖపరవశుండై రాముఁడుండెను.

అతఃపురమందును సంచారము చేయ స్వాతంత్ర్యము గల భద్రుఁడను వేగులవాఁడు వచ్చి జోమారొనర్చిన, భద్రా! యేమివార్త? నగరంబునను బల్లెలయందును నన్నేమి యను కొనుచున్నారు. రాజగువాఁడు ప్రజలు తన్ను నేమిగఁ దలంచునది యెఱింగి వారికి ప్రీతియు విశ్వాసముగలుగఁ బాలింపఁ దేని యతఁడు రాజను నామమున కర్హుఁడా యని రాముఁ డడిగెను. ఇంతలో నిద్రించుచున్న సీతాదేవియు వల్లభా! వల్లభా! యెందున్నారు? అని కలవరించెను. రాముఁడును చిత్రపటమును జూచిన యుద్వేగ మీ కోమలికింకను వదలలేదు. దేవీ! నిన్ను విడిచి నే నెందుఁ బోఁగలను. పోయి యేమి సుఖమనుభవింపఁ గలను?

**సీ. అన్ని యవస్థల ననుగుణ మగుచును**
**సుఖదుఃఖముల నొక్క చొప్పుగలిగి**
**ముదిమియం దేనియు వదలక హృదయవి**
**శ్రామంబు గలిగించు ప్రేమ కలిగి**
**పరిణయ మాదిగా ధర దేహమును వీడు**
**నందాఁకఁ బరిణయమైన నాఁటి**
**స్నేహంబుఁ బోలిన స్నేహ సారంబునఁ**
**గలఁగని స్థిరమైన కలిమి కలిగి**

**తే. పరఁగు చుండెడి మేలి దాంపత్యమునను**
**గలుగు నైక్యంబు ముఖ్యమై వెలయుచున్న**
**క్షేమ మెయ్యదొ దానిచేఁ జెలఁగుచుండఁ**
**గోరువాఁడను సర్వ ప్రకారములను.**

అని యనుకొనుచు భద్రునిఁ జూచి వార్త చెప్పుమనిన నతఁ డిట్లనియె.

రుక్మిణి : భార్యాభర్తలకుఁ బరస్పర మెంత యనురాగమప్పా?

తండ్రి : అది యేల చెప్పెదవులే. తరువాత విను.

భద్రుఁడు : దేవా! పట్టనంబునను బల్లెల యందును నాగరులు జానపదులు బాలురు వృద్ధులు నందఱు నీ యద్భుత వార్తలే సర్వదా చెప్పుకొనుచుందురు. ఎక్కడ విన్నను నీవు రావణాసురుఁ జంపుట సేతువు కట్టుట సత్య పరిపాలనము చేయుట లోనగునవియే లోకులు వర్ణించుచున్నారు.

రాముఁడు: ఓయీ యీ ప్రీతిమాట లుండనిమ్ము. ఉన్నదున్నట్టు సర్వము చెప్పుము. నా నడవడిఁ గూర్చియుఁ బాలనము విధముఁ గూర్చియు నేమి మేలనుకొనుచున్నారు? కీడేమి యనుచున్నారు? లక్ష్మణు గుఱించి యెవ్వరే మనెదరు? సీతా విషయమై లోకాభిప్రాయ మెట్టిది?

భద్రుఁడు : రాజేంద్రా! కలది కలట్టు చెప్పుమని యాజ్ఞయైనపుడు చెప్పక తప్పదు. నా యుద్యోగధర్మ మట్టిదై యున్నది. నేనేమి చేయవచ్చును. లోకు లెవ్వరి విషయమై యేమియు ననుకొనుట లేదు. రాముఁడు దేవదానవుల కసాధ్యమౌ సేతువును గట్టి రావణుని గొట్టి వానర రాక్షసుల నేలి జగత్ప్రసిద్ధుఁ డయ్యెను గాని యేమి ప్రయోజనము. కాముకుఁడై పరుఁడు తన భార్య నపహరించుకొని పోవుట మఱచి యట్టిదానిని మరల మరగినాఁడు.

**మ. బలవంతంబుగఁ జేర్చి స్వాంకమున దేవద్వేషి కొంచేగె; నా**
**ఖలుఁడే లంక నశోకవాటి నునిచెం గాపుంచె స్వస్త్రీల న**
**చ్చెలువం గ్రమ్మఱఁ దెచ్చి యింటమనిచెన్ సీ! యాత్మ గర్హింపఁ డా**
**పొలఁతిం గూడి నృపుండు మోహమున సంభోగింపనే సౌఖ్యమో.**

**కం. తామసుఁడగు రాక్షసు గృహ**
**సీమను జిరకాల మట్లు చెఱఁబడిన సతిన్**
**రాముఁడు రోయక కూడెడిఁ**
**గాముకు లగువారి కెందుఁ గన్నులు కలవే.**

**కం. రాజానుమతము ధర్మము**
**రాజువిధం బనుసరింపఁ బ్రజ కర్హంబౌ**
**రాజువలె మనకు నాత్మస**
**తీజన చర్యలు సహింపఁ దీరగు నింకన్.**



అని వారువారు నోరికి వచ్చినట్లు వదరుచున్నారు. ఇది యన్ని ప్రదేశము లందును నెరసియున్నది అనిన రాముఁడు ముఖము వెలవెలఁ బోవ నతనికి సెలవిచ్చి పంపి నిర్విణ్ణుండై కొంతసేపుండి హా యెటువంటి పిడుగుమాటలు వినవలసి వచ్చెను.

**శా. అయ్యో జానకి యుండె నన్యగృహమం దన్నట్టి యా నిందలన్**
**వ్రయ్యం జేసితి నద్భుటంపు టుపమన్; దౌర్భాగ్యమూలంబుచే**
**నొయ్యం గ్రమ్మఱ నిట్టు లల్లుకొనెఁగా నుర్వీతలం బెల్ల న**
**న్యాయ్యప్రక్రియఁ బిచ్చికుక్కవిష మట్లాహా యిఁ కేమందునో.**

లోకులు కాకులనుట యెఱింగియేకదా నేనాఁ డట్లు కాఠిన్యము వహించి యీమెను బరీక్షించితి. బ్రహ్మాది సకల దేవతలు, వానరులు, రాక్షసులు నందఱు చూచుచుండ నగ్నిహోత్రు డీమె పవిత్రురాలని చెప్పెఁ గదా. నేఁటి కదియంతయు నేటఁ బెట్టిన మాన్య మాయెను. ఎంత కష్టకాలము! ఎంత నిర్భాగ్యుఁడను! లోకము నోరు మూయ మూకుడు కలదా? ఏమి చేయవచ్చును? వారి నన దోషము. ఎక్కడనో లంకలో జరగిన విషయము లోకమున కేమి తెలియును. విను కలివలనఁ దెలిసెను బో నమ్ముటెట్లు? అగ్నిలో దుమికి బ్రతికిన దనిన పామరలోకము నమ్మునా? తమ శక్తికి మీఱినది మఱియొకరు చేసిరనినఁ దాము కనులారఁ జూడక మూఢులు నమ్మరు. అది స్వభావము. దానిని నే నెట్లు మార్పఁ గలను. నిర్దోషురాలని యెఱిఁగి యెఱిఁగి కట్టుకొనిన భార్యను, ప్రాణమునకుఁ బ్రాణముగా నుండిన యిల్లాలిని గృహలక్ష్మని నెట్లు విడుతును? విడువకుండిన లోకులకు ననుమానము మఱింత యెక్కువగును గదా. దాని వలన నా కపకీర్తి గదా. నా కొక్కనికైన నెట్లయినఁ గాని మ్మందునా, వంశమునకే యపకీర్తి.

**మ. కబలాప్తాన్వయ రత్నదీపకులు లోకశ్రేష్ఠు లౌ ధారిణీ**
**రమణీనాథుల సచ్చరిత్ర మతిచిత్రంబౌఁ గదా చూడఃగా**
**నమలంబై యది మన్నిమిత్తమగు లోకాపప్రథన్ దోషసం**
**క్రమితంబైనను ఛీఛి నా బ్రతుకె వ్యర్థం బిస్సి నిర్భాగ్యుఁడన్.**

ఇప్పుడేమి చేయవచ్చును. చేయ నేమున్నది?

**కం. మానుగ లోకారాధన**
**మే నియమం బార్యులకు నదెన్ని విధములన్**

**దాని నెఱవేర్ప నన్నుం**
**బ్రాణంబుల నాదు తండ్రి పాసెను గాదే.**

ఆయనయే నాకు మార్గదర్శి అనిన సీతాదేవిని జూచి హా యజ్ఞ వేది సంభవా? హా స్వజన్మానుగ్రహమున వసుంధరను బవిత్రనుఁ జేసినదానా? హా నిమి జనకవంశనందని! హా బ్రహ్మర్షి ప్రముఖులచేఁ బ్రశంసింపఁబడినదానా! హా రామమయజీవితా! హా మహారణ్యవాస ప్రియసఖీ! హా ప్రియాస్తోకవాదిని! హా నీ కెటువంటి దశ ప్రాప్తించెను?

తే. **జనులు నీచేతఁ బుణ్యులై తనరుచుండ్రు**
**జనులె నిన్ను నపుణ్యోక్తులనుట గలిగె**
**నీవె దిక్కు గదా లోకనికరమునకు**
**దిక్కు లేనట్టు లాపదఁ జిక్కితీవు.**

అయ్యో! యెంత నిర్దయుఁడను! ఎంతటి ఘోరకార్యముఁ దలపెట్టితిని.

ఉ. **పిన్నట నాఁట నుండియును బ్రేముడి పెంచినదాని స్నేహసం**
**పన్నత నా తలంపె తన భావముగాఁ గలదాని, సాధ్వియౌ**
**నన్నును నాత్మకన్నఁ బ్రియమా చెలి, మోసము చేసి మృత్యువా**
**త న్నిరసింతుఁ బెంపుడు పతంగము బోయ కొసంగు కైవడిన్.**

ఛీ! నా యట్టి పాపాత్ముఁ డీ సతి నంటుటకును యోగ్యుఁడు కాఁడు. నేను దాఁకి యీమె నేల యపవిత్రురాలిని జేయవలయును? అని తన్నుఁ గౌఁగిలించుకొని యుండిన సీతాదేవి హస్తములను మెల్లగఁ దీసి యామెను బాన్పుపైఁ బరుండబెట్టి,

ఆ. **కరుణ లేనియట్టి కర్మ చండాలుండు**
**మున్ను లేఁడు ముగ్ధ! నన్ను విడుము**
**దుర్విపాకమైన దుష్టవిషాంగంబుఁ**
**జందనంపు భ్రాంతిఁ బొందితీనె.**

అయ్యో! యీమె నెడఁబాయ నిశ్చయించుకొనిన నాకు నన్నియు విపరీతములై తోఁచుచున్నవి. రాముని జీవప్రయోజనము నేఁటితో ముగిసెను. ప్రపంచమే నా పాలికి పాడడవి యయ్యెను. ఇఁక సంసారము నిస్సారము. దేహధారణమే దుఃఖకారణము. దిక్కు లేనివాఁడ నైతిని. అయ్యో యేమి



చేయుదును? ఏమిగతి? ఇంకను ప్రాణము లీ దేహమున నేల యున్నవో తెలియదు గదా. తెలియకేమి? రాముఁడు పుట్టినదే దుఃఖానుభవమునకు. కావుననే ప్రాణములు వజ్రపు ములుకులవలె స్థిరములై మర్మఘాత మొనర్చుచున్నవి. హా వసిష్ఠ విశ్వామిత్రులారా! హా తల్లీ! హా తండ్రీ! హా జనకరాజేంద్రా! హా యగ్నిహోత్రా! హా భగవతి భూదేవీ ! హా పరమోపకారీ విభీషణా! హా ప్రియసఖా సుగ్రీవా! హా సౌమ్య హనుమంతా! హా సఖి త్రిజటా! మీ కందఱకు నా వలన నవమానము కలిగెఁ గదా. ఛీ. కృతఘ్నుఁడను దురాత్ముఁడను దయాహీనుఁడు నగు నేను వారి పవిత్రనామము లుచ్చరించుటకును యోగ్యుఁడను గాను. ఎట్లు యోగ్యుఁడ నగుదును.

ఉ. **వ్రాలి యురాన నమ్మి నిదురం గొనుదానిని నిండుచూఁటి యి**
**ల్లాలిని, నింటికెల్లను నలంకరణం బయి యొప్పుదాని, లోఁ**
**దాలుచు భీతిచే నడలుదానిని, నన్నె స్మరించుదాని, నా**
**భీలపలాశి సంతతికి వే బలిగా దయమాలి ద్రోసెదన్.**

దేవీ! యిదియే కదా నిన్నుఁ గడసారి స్పృశించుట. ఇఁక దుర్లభువే కదా. హా! యెంత కష్ట మెంత కష్టము. హా భగవతీ సకల భూతధాత్రి రత్నగర్భాదేవి! నీవె యిఁక నీ పుత్రికి దిక్కగుము. ఇఁక నీ కడుపులోఁ బెట్టుకొని నీవే రక్షింపుము.

అని మెల్లగ లేచి కొలువు కూటంబునకు వచ్చి లక్ష్మణ భరత శత్రుఘ్నులను బిలిపించి వారికి సీతా విషయకమైన లోకాపవాదము తెఱఁ గెఱిఁగించి యిట్లనియె. నేనా లోకఖ్యాతులైన యిక్ష్వాకుల వంశమునఁ బుట్టితిని. సీతయు మహాత్ములలో శ్రేష్ఠుఁడగు జనకుని కూతురు. ప్రాకృత స్త్రీలవలె జనించినది గాదు. అట్టి సతి దైవికముగా మున్నాపద తటస్థించి దశకంఠునింట బందిలో నుండెను. నేను వానిని సంహరించి యట్టి యపఖ్యాతి వచ్చునని తలంచి పరీక్షించితి. నా నమ్మమున్నకై దేవి యగ్నిలోఁ బడెను. అగ్నిదేవుఁడును సీత పతివ్రతయని చెప్పెను. దేవతలు ఋషీశ్వరులు నందఱు సీతపతి వ్రతయని చెప్పిరి. లక్ష్మణా! యిది యంతయు నీవు కనులారఁ జూచితివి గదా.న ఇంతేకాదు. నా యంతరాత్మయును సీత నిర్దోషురాలనియే చెప్పుచున్నది. కాఁబట్టియే కదా యా సతిమరల నింటికిఁ దెచ్చితిని. ఇప్పు డపకీర్తి లోకముల మా యిరువురి పట్లను నెరసియున్నది. ఏమి చేయుదును? దేహములు శాశ్వతములు గావు. కీర్తియే శాశ్వతము.

**చం. ఎవని యకీర్తి లోకమున నెందనుక౯ వినఁగల్గునో యథో**
**భువనములందు నందనుకఁ బూరుషుఁ డుండెడు బాపభోజియై**
**దివుజు లకీర్తినిం దెగడి దెల్చుచు నుంద్రు సుకీర్తిఁ గాన మా**
**నవుఁడు సుకీర్తిఁ గోరియె యనారతముం బనులొప్పుఁ జేయఁగ౯.**

కావున నీ యపవాదముఁ బాపుకొన నుపమ యాలోచింప వలసియున్నది. మనము నిర్దోషుల మని స్పష్టముగఁ దెలిసినపు డెవ్వరేమనిన నేమని బుద్ధిమంతు లూరకుండరాదు. లోకములోఁ బ్రతి మనుష్యుఁడు ప్రతి విషయము స్వయముగ నాలోచించి కార్యము చేయఁడు. ఒకరు పోయిన మార్గమునఁ దక్కిన వారు పోవుట మనుష్యస్వభావము. గృహమునఁ బెద్దవారును, మతమునందు గురువును, రాజ్యమునందు రాజును, మార్గదర్శులుగా గ్రహింప బడుదురు. తెలిసి చేసినను, దెలియక చేసినను సకారణముగఁ జేసినను, నిష్కారణముగఁ జేపినను, వీరు చేయునది సరియని వారి నాశ్రయించి యుండువారు వారియందలి విశ్వాస గౌరవములచే తలంచుచు ననుసరింతురు. అట్టు లగుట మతిమంతులగు పెద్దవారు తమ్మాశ్రయించిన వారికి శుభకరములగు మార్గములందే తమ కిష్టముండినను లేకుండినను, తమకు బ్రయోజన ముండినను లేకుండినను, కష్టమైనను సుఖమైనను, తాము ప్రవర్తింపవలయును. అట్లు ప్రవర్తింప రేని యాశ్రితులను దప్పు త్రోవలఁ ద్రిప్పి వారిని జెఱిపినవారై యా పాపమునఁ దామును దుర్గతులకుఁ బోవుదురు. రాజెట్టివాడో ప్రజలట్టివారే యగుదురు. కావున రాజు మిక్కిలి హెచ్చరిక కలిగి ప్రవర్తింపవలయును. సీత నిర్దోషురా లని నాకును మీకును దేవతలకును తెలియును. ఏమి ప్రయోజనము? లోకు లెఱుఁగరు. సీత దుష్టునింటఁ గొంతకాల ముండె గావున చెడియే యుండునని వారి నమ్మకము. అందఱు బావిలోని కప్పవలె తమ శక్తి సామర్థ్యము కొలఁదిని బట్టియేయెదుటివారిని గణింతురు. తమకు సాధ్యము కానిది లోకమున నెట్టివారికైన నసాధ్యమనియే వారి తలంపు. కావున సీత పాతివ్రత్యముచేఁ దన్నుఁ దాను కాపాడుకొనఁ గలదని యగ్ని ప్రవేశమొనర్చియు బాధ నొందలేదని చూచినవారు చెప్పినను వారు నమ్మరైరి. దాని ఫలమేమిగాఁ బరిణమించును? దుష్ట స్త్రీ లందఱు పతివ్రతలుగా భావింపఁబడి కాముకులగు భర్తలచే భరింపఁబడు చుందురు. పేరు లోకు లెఱుఁగని యూరిలో నా యిల్లాలు సలసల క్రాఁగిన యుక్కు త్రాగెనని యొకఁడనిన దీనిని విచారించువారెవరు? ఎన్నియని విచారింపనగు.



విచారింపకుండిన లోకము జారిణులతో నిండిపోవును. విచారింపఁ బూనిన సీత చేయలేదా రాముఁడు గ్రహింపలేదా యందురు. ఇది సహ్యామా? దీనికి నేనొక యుపాయ మాలోచించితిని. దానిని మీరౌఁ గాదనరాదు. నా జీవితచరణముల పై నొట్టు. నే నింకను నింటఁ బెద్దగను, రాజ్యమునకు రాజుగను నుండవలయునని మీ యభిప్రాయమేని నేను బెద్దవాఁడను రాజను అను గౌరవము మీకుండెనేని లక్ష్మణా! నేనుఁ జెప్పినట్టు నీవు చేయవలయును. దీనికిఁ బ్రత్యుత్తర మిచ్చినవారిని రాజాజ్ఞ మీఱినవారిగను, నా శత్రువులుగను దలంతును. లక్ష్మణా! మీ వదినె గంగాతీరమున నుండు నాశ్రమములఁ జూడఁగోరెను. ఆ నెపమున నీవు సీతను ఉదయముననే పిలుచుకొని పోయి తమసానది యొడ్డున వాల్మీకి యాశ్రమము సొంత విడిచి రమ్ము. ఆ కార్యము చేసి వచ్చి కాని నన్ను మరలఁ జూడకుము. ఇఁకఁ బండు అని వారి కాజ్ఞ యిచ్చి పంపి మిక్కిలి దుఃఖితుడై తపించుచుండెను.

లక్ష్మణుఁ డుదయము కాఁగానే సుమంత్రుఁ బలిచి సీతాదేవి వనముల దర్శింపఁ గోరెనఁట. రాజుగా రామె నిపుడు గంగాతీరమునకుఁ బిలిచికొని పొమ్మని నాకాజ్ఞాపించిరి. తేరు వేగిరము తెమ్ము. అందు రాజగృహంబునుండియే పఱుపులు తెచ్చి పఱువుము అనిన నతఁ డట్లు చేసి తెలుప లక్ష్మణుఁడు జానకీదేవి యొద్దకుఁ బోయి “వదినే! నీవు ఋష్యాశ్రమంబులకు బోవఁ గోరితివట. రాజుగారు నిన్నుఁ బిలుచుకొని యిపుడే పొమ్మని నా కాజ్ఞ యిడిరి. పోదము వేగిరమ్ము లేలెమ్ము”అనిన నేమియు నెఱుఁగని సీత సంతోషముచే వికసించిన ముఖారవిందము గలదై,

**కం. నిన్న నె చుమి లక్ష్మణ! మీ**
**యన్నను నే డుగ నట్టులౌఁ గా కనియెన్**
**ని న్నింతలోనె పుచ్చెనె?**
**వెన్నగదే నాదు ప్రాణవిభు హృదయంబున్.**

లక్ష్మణా! నిన్న యేదో మాటలో మాటగా నడిగితినో లేదో అప్పుడే నా కోరిక మీయన్న సఫలము చేయఁ బూనెను గదా! నామీఁద నెంత ప్రీతియో మీ యన్నకుఁ గంటివి కదా! అట్టి దయాళుని నట్టి మనోహరుని విడిచి ఱెప్పపాటు కాలమైన నుండ మనసొప్పదు. అయినను ఋషీశ్వర భార్యల దర్శింపఁ గోరిక కలదు. ఉత్త చేతులతో నేమిని వారలఁ జూడఁబోదును. వారికి యోగ్యమైన భూషణములు వస్త్రములు పదార్థములు తీసికొని యిదో వచ్చెదను అని లక్ష్మణా!

యివి వారు తీసికొందురుగదా. ఇవి మన యోగ్యతకు నీయఁ దగినవే కదా. ఇవి మంచివే గదా. ఏమి లక్ష్మణా! పలుకవు. అవును కాదనికూడఁ జెప్పవే అనిన నతఁడు పట్టరాని దుఃఖము ‌మ్రింగుచు, అవును అవును సరి సరి ఊఁ ఊఁ యనుచుండెను. సీత ప్రయాణమునకై యెంతెంత యుత్సాహము వహించెనో యెంతెంత తన పతి ప్రీతిని గుఱించి చెప్పుచుండెనో యంతంత సౌమిత్రికి శోక మతిశయించుచుండెను.

తరువాత లక్ష్మణుఁడామె తీసికొనిన పదార్థములను ఆమెను రథముపై నెక్కించి తాను గూర్చుండి సుమంత్రా! రథము పోనిమ్మన నతఁడును నట్లే చేసెను. ఇట్లు కొంతదూరము పోఁగానే సీతాదేవి లక్ష్మణుఁ జూచి యిట్లనియె. లక్ష్మణా! నాకు మహోఽ వశకునము లగుచున్నవి.

**కం. కుడిక న్నదరెడి నేటికొ**
**యడలు వణంకెడిని జిత్తముదిలగొనెన్ నా**
**యెడఁ దయుఁ దటతటలాడెడిఁ**
**గడcకయుఁ జెడె నేమి కీడు కలుగంగలదో.**

మనస్సు నిబ్బరము చెడి పలుపలు విదముల ప్రీలిపోవు చున్నది. నిబ్బరము చెడెను. కళవళపాటు హెచ్చెను. కడుపులోఁ జేయి పెట్టి కలcచినట్లున్నది. నిష్కారణముగc కనుల నీరు గాఱుచున్నది. లక్ష్మణా! యేదియో కీడు మూcడc గలదు. అన్నా లక్ష్మణా! మీ యన్నకు సేమమే కదా. మా యత్తలందఱు సుఖమున్నారు గదా? దేవతలారా! యీ శకునముల వలనc గలుగు కీడు నా భర్తకు మఱcదులకు నా యత్తగార్లకు నా తల్లిదండ్రులకుc గాకుండc జేయుcడు. మీకు నమస్కరించెదను. దయామూర్తియైన నా ప్రాణ భర్త యేమి కోరెద వనిన అయ్యో యెంత పాపపుc గోర్కిc కోరితిని. మును పన్ని సంవత్సరములు కా లీచcబడc దిరిగిన వనులు గావా? ఆ ఋషిపత్నులు గారా? ఏల నా కట్టి దుర్బుద్ధి పుట్టెను? వినాశ కాలమునకు విపరీతబుద్ధి యందురే యది నిజమగునేమో.

**ఉ. నా సఖు, నా మనోహరుని, నాప్రభు, నా రఘురామ దేవుని≡**
**బాసి వనాళి నున్న మునిపత్నుల జూచెదనంచు నేల పే**
**రాస వహించి వచ్చితి, హితాహితచింతలు లేనివారు గా**
**రే సతులందచు మాన్ప నతc డేమిటికి స్వరమిచ్చె లక్ష్మణా.**



ఎంత చెడుకాలము! ఎంత చెడుకాలము! వెనుకకు మరలి పోదునా? ఏమి పోదును? ఏలని పోదును? పిఱికిదానా! యని నా పతి నవ్వునేమో? విన్నవా రేమందురు? నిండు చూలిదానను. అత్తగార్లతో నైనc జెప్పక యేమియో మునిcగి పోయినట్లు వచ్చితినే? వారేమందురు?

లక్ష్మణా! నేనింత తహతహలాడుచున్నను నీ వొకటైనc బలుకకున్నావు గదా, యనిన లక్ష్మణుc డేమియు మాటాడక యూరకుండె. సీతయుc దనలోc దానే యేదో నిబ్బరముc దెచ్చుకని యూరకుండెను. ఇంతలో రథము గోమతీనదిని దాcటి గంగాతీరముc జేరెను. సీతా లక్ష్మణులు రథంబు దిగిరి. ఆమెను జూచి లక్ష్మణుcడు హెూయని యేడ్వ సాగెను. అది చూచి సీత లక్ష్మణా! యిది నీకుc దగునా? నే నెన్నిదినాల నుండియో యీ ఋషికన్యల నర్చింపవలయునని కోరిక యుండుటc గా మీ యన్నను గోరితిని. ఆ కరుణానిధియును గోరక కోరక కోరితినని నా కీవర మిచ్చి పంపెను. పరమపావని యగు గంగను జేరియు దుఃఖింపc దగునా?

**కం. సంతోషకాలమున నిటు**
**లింతగ నేడ్చుచును నాకు నెంతో మదికిన్**
**నవంత గలిగింపc దగునే,**
**వింతాయెను జూడ నీదువిధము మఱంది.**

**ఉ. ఎప్పుడు రాముకొల్వుc ద్రుటియేనియుc బాయవు నే నెఱుంగుదు≡**
**దప్పె ద్వీరాత్రముల్ నిజము, దానికి నింతగ నేడ్చెదన్న, నా**
**కప్పురుషోత్తముండు విను ప్రాణముకంటెc బ్రియుండ యయ్యు నే**
**నిప్పగిది న్వెతం గొనితినే, విడు లక్ష్మణ! బాలిశత్వము≡.**

సౌమిత్రి! నా యుత్సాహమునకు భంగము గలిగించుచు నీవు దుఃఖించుట సరిగాదు. ఆడుదానను నేనే నిబ్బరించుకొని యున్నదాననే. నీవు సహించుకొన లేవా? నే నిక్కడ స్థిరముగా నుండవచ్చితినా? ఒక రాత్రియే కదా. ఈ రాత్రి ఋష్యాశ్రమముల నుండి యుదయము కాcగనే పోదము. దీని కింత యడల నేల? పడవలు వేగము తెప్పింపుము. గంగ దాcటుదము అనిన లక్ష్మణుcడు పడవల వారి కాజ్ఞాపించిన వారు మంచి పడవ తెచ్చిరి. నఅందు సీతాలక్ష్మణులు కూర్చుండి గంగ దాcటి యావలి యొడ్డున దిగిరి. అచ్చట సీతాదేవిని జూడcగనే లక్ష్మణునికి దేహమెల్ల

వడఁకెత్తెను. కన్నీటిధారచే శరీరమంతయుఁ దడసెను. మనసు విహ్వాలమయ్యెను. ఇట్లు ఆయన యేడ్చిన నివ్వెఱపడి సీతాదేవి యిట్లనియె.

ఉ. అన్న! యనేక దీనదశ లానిన వేళలనైన ఈనవు ము
న్నెన్నఁడు నింతవంత వహియింపవు; ధైర్యము డింప; వేల నేఁ
డిన్నెగులొంది కుందెద? వహీనగుణాంబుధి వంచు నీ గుణం
బెన్ను దు రంద ఱెవ్వరికి నెగ్గు దలంచితి వుగ్గడింపవే.

చం. పరసతులెల్లఁ దల్లులుగ భావన సేయుదు వెల్లవేళలన్
బరధన మన్న హాలహల భంగిగఁ జూతువు; బొంక వెన్నఁడు౯;
బరుషము లాడ నెవ్వరిని; బ్రాహ్మణ భక్తియు రాముసేవయున్
దిరమగు నీకుఁ దండ్రి జననిందిత కృత్యము లెవ్వి యియ్యెడన్.

కం. మన్నన దొలంగి నిను మీ
యన్న నిరాకరణ చేసి యాడెనొగి? నీకా
యన్నపయి భక్తి దొలషగెనొ
కన్నాయమ నేమియైనఁ గారించితివో.

కం. ఓడితివో శత్రువులకు
నాడితివో సాధుదూషణాలాపములన్
గూడితివో పరసతులను
వీడితివో మానధనము వీరులనడుమనం.

కం. తప్పితివో యిచ్చుదనని
చెప్పితివో కపటసాక్షి చేసిన మేలుం
దప్పితివో శరణార్థులు
రొప్పితివో ద్విజులఁ బసుల రోగుల సతులన్.

కం. అడిచితివో భూసురులను
గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా?
విడిచితివో యాశ్రితులను
ముడిచితివో పరులవిత్తములు లోభమున౯.

కం. రామాజ్ఞ లేకయే నను
దీమసమున నిందుఁ దోడితెచ్చితొ నాపై



స్వామిమతి యెడసి యున్నదొ
యేమిటి కడలెదవు తండ్రి, యెఱిఁగింపఁగదే.

ఉ. విన్నఁదనంబు మించెఁ బురి వెల్లడినప్పటినుండి నీ మొగం
బున్న తెఱంగుఁ గాంచి దిగులొందుచునుందు నిదేమొ యంచు; మీ
యన్నకుఁ దత్సహోదరుల కాప్తులకు౯ శుభమే కదన్న నీ
కన్నుల నేల యశ్రువులు కాఱెడిఁ దెల్పఁగదన్న లక్ష్మణా.

చం. అడవికిఁ దొల్లి శ్రీదొరఁగి యన్నను గొల్చుచు వచ్చునప్పుడు౯
గడుసరి యింద్రజిత్తుని ముఖాముఖిఁ గయ్యము సేయునప్పుడు౯
జడుఁడగు రావణాసురుని శక్తియురంబున నాటినప్పుడున్
బొడుమదు కంటినీ రిపుడు పుట్టె నదేటికొ తెల్పు లక్ష్మణా.

శా. సౌమిత్రీ భయమయ్యెడిన్ నుడువునూ క్ష్మాదేవిజామాత యా
శ్రీ మత్పద్మ దళాక్షుఁ డారఘుకులక్షీరాబ్ధి పూర్ణేందుఁడున్
హేమక్ష్మాధరధీరుఁ డాయసురమత్తేభేంద్రహర్యక్షుఁడా
శ్యామాంగ ప్రభుఁ డా మహాప్రభుఁడు లెస్సై యున్నవాఁడే పురి౯.

లక్ష్మణా! కారణము చెప్పక యేల దుఃఖించెదవు? రాదా మృత్యువని విలపించెదవు. అంతటి పాపకార్యము నీవేమి యొనర్చితివి? పురము విడిచినది మొదలు నా ప్రక్కఁ జూచుటకు నీకు మనస్సొప్పకున్నది. నీవు చెప్పుము. చెప్పక తప్పదు. ఆజ్ఞగా భావింపుము. చెప్పకుంటివా మీయన్న పాదములపై నానయని యొత్తి యొత్తి యడిగిన లక్ష్మణుఁడు నిఁకఁ జెప్పక తప్పదు అని గుండెనిబ్బరము తెచ్చుకొని కన్నుల నీరు గార మాటలు తడఁబడుచుండఁ దలవ్రేలవైచి యిట్లని విన్నవించెను.

తల్లీ! నన్నేమని చెప్పుమనెదవు? ఏమి సంతోషమని నా ముఖము వికాసము వహించి యుండును? రావణుఁడు చచ్చియు మనలను సాధించుచునే యున్నాఁడు. వచ్చిన నింద చచ్చినఁగాని పోదను సామెత నిశ్చయమాయెను. పట్టణములందు పల్లెలయందును నిన్నుఁ గూర్చి వినరాని వార్తలు పుట్టినవని తాను విని రాముఁడు లోకాపవాదము దొలఁగించుకొనుటకై యుపాయము వెదకి నన్నింటికిఁ బిలిపించికొని యేవేవో వార్తలు చెప్పెను. అవన్నియు నేను నీకుఁ జెప్పరాదు. నీ మాహాత్మ్యము నీ శీలము నేను గన్నారఁ జూచి యున్నాఁడను. రాముఁడును నెఱుఁగనివాఁడు గాఁడు. ఎఱిఁగియు

నపవాదమునకు వెఱచి నిన్ను నీ భర్త పరిత్యజించెను. అపవాదము కారణమే కాని మఱి నీ విషయమై యే యనుమానము లేదు. నీవు మఱియొక రీతి దలంపవలదు. నిన్నిచట డించి రమ్మని రామునాజ్ఞ. రాజాజ్ఞ. నీ భర్త యాజ్ఞ. రాముఁడు నీవేఁ కటికోరిక సాకుపెట్టి నిన్నిట్టు నట్టడవిఁ ద్రోచెను. ఇవే గంగాదీర వనులు. అదిగో దూరము నందు దశరథమహారాజుగారి సఖుఁడు వాల్మీకి యను తపస్వి యుండు యాశ్రయమున్నది. అమ్మా! నీవిఁక యాయనకుఁ బరిచర్య సలిపి దినములు త్రోయుము. శీలము మఱవకు మని నేను నీకుఁ జెప్ప నక్కఱయే లేదు.

సీ. **మితిలేని యీమిడి మేలంపు మొకములు**
**సకియల బలఁగమే జనని! నీకుఁ?**
**బరికింపరాని యీ బలుమల ల్నవరత్న**
**మయచంద్ర శాలలే మాత! నీకుఁ?**
**గడుభీతి ముంచు నీ గహనము ల్విహరింపఁ**
**దగిన పూఁదోఁటలే తల్లి! నీకు?**
**ఘోరనక్ర భుజంగ కోటితో మలయు నీ**
**హ్రదములు కొలఁకులే యంబ! నీకు?**

తే. **బంధురములైన యీ మహాప్రస్తరంబు**
**లిందు మణివేదికలె జనయిత్రి నీకుఁ?**
**గటకటా యెంటి నిచ్చోట నెటుల నిల్చె**
**దమ్మ నీ యున్కి కేమందునమ్మ నేను?**

మ. **జననీ! నీవు మహా పతివ్రతవు నీ సౌశీల్య మిల్లాంద్ర కె**
**ల్లసు మేల్బంతి రఘూద్వ హాంఘ్రియుగళీ లగ్నాత్మనై యుండు మీ**
**యని నే నెవ్వఁడ విన్నవింపఁ? బతిఁ బాయంజేసి నిన్నొంటి డిం**
**చిన పాపాత్ముఁడ నూరి కేగు మనుచున్ సెల్విమ్ము సాధ్వీమణీ!**

తల్లీ! యింతటి కష్టకార్యమొనర్చుటకు శ్రీరామునకు నేను దొరకితిని. వీఁడు దయాదాక్షిణ్యములు లేనివాఁడు. ఎంత ఘోర కార్యమైనఁ జేయు ఱాతిగుండె వాఁడని తలఁచి కాఁబోలు నన్నీ పని కాయన నియమించెను. అమ్మా! నాదేమి కష్టకార్యము! నీ మనశుద్ధి యెఱిఁగి యెఱిఁగి నిష్కారణముగ నిన్నుఁ బాసి రాముఁ డేవిధముగ విరహాంబుధిఁ దరింపఁగలఁడు? ఏ విధముగ జీవింఁపఁగలడు? అపవాద మాత్రమునకు వెఱచి రామవిభుఁ



డెంతసాహసమున కొడిగట్టెను గంటివా? తల్లీ నన్నీ యడవిపాలు చేసి నేనెట్లు పోదునమ్మా? నాకు కాళ్లెట్లాడునమ్మా? మనస్సెట్లొప్పును? పోక తప్పదు గదా? ఇచట నీ గతి యేమి? నీ కెవ్వరు దిక్కు? తల్లీ!

అనినఁ బిడుగులకంటెఁ గడు బెడిదంబులగు నుడువులు శ్రవణపుటంబులఁ బడిన నప్పుడమికన్నె మొదలంట నఱకిన యరఁటివలె నేలవ్రాలి సోలిపడియుండి కొంతవడికిఁ దెప్పఱిల్లి లేచి యేఱులై పాఱు కన్నీరు దుడుచుకొనుచు లక్ష్మణుం జూచి యిట్లనియె.

అన్నా! లక్ష్మణా! విధి కేవల దుఃఖము లనుభవింపఁ జేయ నే నాకీ దేహము కల్పించియుండ నేమి యేడ్చి యేమి ప్రయోజనము?

ఉ. **ఎట్టి యఘోరపాపముల నే నొనరించితి నొక్కొ; పూర్వమం**
**దెట్టి మహాత్మురాలిఁ బతి నే నెడఁ బాపితి నొక్కొ; కాదయే**
**నిట్టులు నిర్నిమిత్తముగ నే యఘమైన నెఱుంగ నిట్టి న**
**న్నట్టడవిన్ విడంగ నరనాథుఁడు పంచునె! దోసమెంచునే!**

ఉ. **స్వామి రఘూత్తమాంఘ్రిపరిచర్య యొనర్చు ముదానఁ బూర్వ ము**
**గ్రామిత దుఃఖ సంతతుల నమ్మెయి నోర్చితి నాశ్రమంబులం**
**దేమని నిర్జనాటవుల నిప్పుడు నే వసియింతు నొంటిగా?**
**నేమని నాదు దుఃఖముల నేరికి నే వచియింతు లక్ష్మణా?**

ఉ. **ఏటికిఁ బుణ్యశీలుఁడు నరేంద్రుఁడు రామవిభుండు నిన్వనీ**
**వాటికిఁ బంచె నిందు నటువంటి యకృత్యము యేమి చేసితో**
**బోటి యటంచు నన్ను మునిపుంగవు లాడఁగ నేమి పల్కుచుౝ**
**బాడి దొఱంగి నా విభునిపై నెటు చెప్పుదు నిర్దయత్వముౝ.**

చం. **పతి మతి నెంచెనేమొ తనుఁ బాసి యశోక వనంబులోపలౝ**
**బ్రదుకదె పెక్కునాళ్ళనుచుఁ గ్రమ్మఱఁ దాఁ జనుదెంచి శత్రునిౝ**
**హతునిఁగఁ జేయు నేలు నను నాశగదా బ్రతికించె నాఁటి కా**
**గతి నిఁక నేమియాస గొని కాయము నిల్పుదుఁ దెల్పు లక్ష్మణా!**

చం. **ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమంది యిప్పుడే**
**కఱకుమనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁ గాక య**
**త్తెఱఁ గొకసారిన న్బిలిచి తెల్పి మనోవ్యథ తీర్చి నిన్ను నే**
**మఱనని పంపఁడయ్యె నభిమానము కూర్మియు నెందుఁ బోయెనో?**

కం. ఆ కరుణ యా ప్రసన్నత
యా కూరిమి యా ప్రియోక్తి యాగారవముం
గాకుత్థుఁడు మఱచెఁ గదా
యాకస్మికముగ జనించు నపవాదమునన్.

శా. ఆకర్ణాయత నేత్రమై మణిమయోద్యత్కుండల ద్వంద్వశో
భా కీర్ణాంచిత గండమై, సురదనంబై, సుందర భ్రూయుతం
బై, కమ్రస్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీరాముమో
మీ కాయంబునఁ జూచు భాగ్యమిఁక లేదేమో సుమిత్రాత్మజా!

సీ. అవని నయోనిజనై పుట్టి మిథిలేంద్రు
వీట నే నుండిన విధము వినరొ?
యంగ రాగములిచ్చి యనసూయ మొదలైన
సతు లెంచుకొన్నది చాల వినరొ?
యాలంకలోఁ దొల్లి త్రైలోక్యము నుతింప
వహ్ని నేఁ జొచ్చిన వార్తవినరొ?
యీ సీత నిర్దోష యేలుకొమ్మని రాము
బ్రహ్మాదు లపుడన్న పలుకు వినరొ?

ఆ. వినియుఁ గనియుఁ బ్రజలు నను నింద సేసిన
యంతమాత్రమునకె యధిపుఁ డులికి
యింత తెగువ సేయ నిచ్చగించుట నా య
భాగ్యమింతె యొకరిఁ బల్కనేల?

లక్ష్మణా! నా దుఃఖము లంకావాసముతో సరిపోయెనని తలంచితినిగాని బ్రతికినంతకాలము నన్ను బాధించునని తలఁపనైతిని. బాల్యమందుఁ గొన్ని నాళ్ళేమి సుఖపడితినోగాని యది మొదలు విడువని దుఃఖములే నన్ను వెంటనంటియున్నవి. అప్పుడు నా పతికి నా మీఁదఁ గరుణ కల్గి తనతోడ నుంచుకొని యుండెనుగాన నా కా కష్టములు కష్టములని తోఁపనే లేదు. ఇప్పుడు కట్టుకొన్న మగనికే కరుణ తప్పి నట్టడవులలో నిట్టు త్రోయవలయునని బుద్ధి పుట్టినపుడిఁక నేనెవ్వరి నిమిత్తమై బ్రతుకవలయును? పతిసేవయే యిహపర సాధకమని, పతిసేవయే నాకు బరమగతియని, పతిసేవయే నాకు దేవపూజయని, పతిసేవయే నాకుఁ బరమకర్తవ్యమని, బతినామమే నాకుఁ బరమకర్తవ్యమని, బతినామమే నాకుఁ బరమ మంత్రమని, పతి సాంగత్యమే



సాయుజ్యమని యెంచి చరించుచుండిన నాకుఁ బతివియోగము సంభవించినచో నేనెవ్వరికొఱకై దేహము ధరింపవలయును? ఈ దేహముతో నాకిఁకఁ బనియేమి? ఇటువంటి పిడుగువార్త వినియుఁ బ్రాణము పోకున్నదిగదా. గుండె బ్రీలకున్నది గదా. అది ఱాయో యినుమో? కాదు కాదు లక్ష్మణా! నామీఁద నాపతికిఁ బ్రీతి లేకపోలేదు. లోకాపవాదమునకు వెఱచి తన కీర్తి కాంక్షించియే నన్నిట్టు లడవి పాలు చేసెనని నీవు చెప్పినమాట నమ్మితిని. అచ్చటఁ బ్రీతియే లేకుండిన నిచ్చట నాకేనాడో ప్రాణములుపోయియే యుండును. అటులగుటచే నేను బలాత్కారముగఁ బ్రాణములు పాయుటకుఁ దగదని తోఁచుచున్నది. ఎన్ని దినములని ఈ దేహమున నేనిట్లు బాధపడుచుందును. దీనిని వదలుకొనుటయే మేలుగాని సౌమిత్రీ! నే నిప్పుడు దేహము వదలితినా నా భర్త వంశమింతతో నిలిచిపోవుచున్నది. ఆయన వంశమును రక్షించుటకై నేను బ్రతికి యుండవలసి యున్నది. భార్యాగ్రహణమునకు ముఖ్య ఫలము సంతానము. అట్టి సంతానమును ధర్మవిధమున భార్య పడసి భర్త ఋణము నుండి పాయుచున్నది. వెన్న పడు కాలమున బాన వ్రక్కలు చేసినట్టు నేనిప్పుడు దేహము పాయరాదు. అదియునుగాక నే దేహమును బాసితినా యపకీర్తియు వచ్చును. నా దుఃఖము నే ననుభవింపవలయును గాని నా మగని కపకీర్తియు వంశహానియు గూర్పరాదు. కావున లక్ష్మణా! తన యాజ్ఞ శిరసావహించి దేహమును ధరించి యుండెదనని నా పతితోఁ జెప్పుము. అన్నా నీవిఁక బోయిరమ్ము; నీకు శుభ మగుఁగాక నన్ను మఱవకుము. అన్నా లక్ష్మణా! యివి నా కడపటి వాక్యములు. ఇఁక మీతో నేను మాటలాడుట కల్ల. వీనిని మనవారి కిట్లెఱిగింపుము. నా మాఱుగఁ నీవు శ్రీరామునకు మ్రొక్కి మీ క్షేమము సీత విచారించెనని చెప్పుము. అట్టులే యత్తగార్ల కందఱకు మ్రొక్కి వారి క్షేమమును విచారించితినని చెప్పుము. మఱియు,

సీ. ధరణీశ్వరునితోడ ధర్మమార్గంబున
దృష్టిపాయక ప్రవర్తిల్లుమనుము
జానకి నిర్మల స్వాంతయంచును దత్త్వ
మంత నీ యెఱిఁగిన యదియ యనుము
నీ హిత కాంక్షిణి నీ భక్తురాల నే
సతి నంచు నీ మది స్పష్టమనుము
అపవాదమునకు భయంపడు నీ చేత
ననద యట్టులు త్యక్తనైతి ననుము

ఆ. నీవ పరమగతివి కావున నాకు నీ
యపయశంబుఁ బాప నర్హమనుము
నాదు వాక్యములుగ నాయనా మీయన్న
తోడ నిన్ని కరుణతోడ ననుము.

ఉ. పౌరుల నెల్లవారిఁ దన భ్రాతల రీతిని జక్కఁ బ్రోచుచున్
సారపుధర్మమార్గమున సంతత ముర్విభరించు ఱేఁడు ధా
త్రీరమణా! యనుత్తమ గతిన్ భజియించుచు ధర్మమున్ సదా
భూరి సుకీర్తియుం బడయఁ బోలునటంచును విన్నవింపుమీ.

కం. స్వశరీరము దుఃఖంబునఁ
గృశియించెడి ననచు నేను భేదముపడి, బా
లిశులగు పౌరుల భృశక
ర్కశవాక్కులఁ దఁలచితలఁచి కడు దుఃఖింతున్.

ఉ. పౌరుల రిత్తనిందలకుఁ బాల్పడకుండెడునట్లు ధారణీ
భారముఁ బూనుమంచనుము, భార్యకుఁ బ్రాణవిభుండె దైవతం
బారఁగఁ జుట్టమున్ గురువునౌటను బ్రాణముకంటె మిన్నగా
సారసనేత్ర భర్త కెలసంబును దీర్చుటె యుక్త మెప్పుడున్.

అని యిట్లు నా సంగ్రహా వాక్యములు వినిపింపుము.

ఇఁక మీ యన్నకు సౌఖ్యము లేదు. అన్న కారణముగా మీకును సుఖము లేదు. నా కారణముగ నా చెల్లెంద్రకు సంతోషము కలుగదు. ఆహా యెట్టి నిర్భాగ్యపుఁ బుట్టువు పుట్టితిని. సౌమిత్రీ నే నెట్టి గర్భ చిహ్నమును ధరించిన దాననో నా కెట్టికష్టము ప్రాప్తించునో చూడుము. నాయనా! రాజాజ్ఞ నెఱవేర్చి యిఁక నీ వూరికిఁ బొమ్ము.

అనిన నామె వాక్యములను విని కడుపులో దహించుచున్న శోకాగ్నిచే నొక్క మాటయుఁ బలుక లేక కాఱెడి కంటినీటితో నామెకుఁ బ్రదక్షిణ మాచరించి పాదముల కెదుట వ్రాలి నమస్కరించి లేచి తల్లీ యిదివఱకు నీ పాదములను దప్ప నిన్నుఁ జూచిన వాఁడను గాను. నన్నేల నీ గర్భమును జూడుమనెదవని యామె యనుజ్ఞ పడసి మరలి పోయి తిరిగి తిరిగి చూచుచు గంగఁజేరి పడవపై నావలియొడ్డు చేరి దుఃఖము సహింపలేక రథముపైఁ బడెను.



అమ్మణ్ణి : అప్పుడు రాముఁడు చెప్పఁబోయిన సిగ్గుచేఁ దాను రాముని నోరుమూసెనే సీతాదేవి తన గర్భమును జూడుమని యిప్పుడు లక్ష్మణు నేల యడిగెను?

రుక్మిణి : మఱెదునకు లేదు. సాక్ష్యము కొఱకు. ఇదివఱకు వచ్చినట్టి యపవాదమే యింకను వచ్చునేమో. తాను రాముని విడుచునప్పటికే నిందుచూలని యాయనకు దెలిసి యుండిన బాగని యామె తలంపు.

అమ్మణ్ణి : అవును. లంకలోని చర్యకు లక్ష్మణుఁడు సాక్షిగా నుండి యేమి చేయఁ గలిగినాఁడు? గ్రహచారము చాలక వచ్చినపుడు మనశక్తి సామర్థ్యములు పనిరావు. మనము చేయు ముందాలోచనలు పనికిరావు.

తండ్రి : లక్ష్మణుఁడు విడిచిపోఁగా నయ్యడవిలో నామె దుఃఖించిన విధము నేనేమని వర్ణింపఁగలను. అశోక వనములో సీతాదేవి దుఃఖమును వర్ణించిన వాల్మీకి మహర్షియు నీ శోకమును వర్ణింపఁ జాలినవాఁడు కాఁడన నేనెంత వాఁడను. అది యిట్టిదని చెప్పుటకే యసాధ్యము.

సీతాదేవి కొంతవఱకు మరలిపోవుచున్న లక్ష్మణుఁ జూచుచుఁ దరువాత నతని రథమును జూచుచు నదియు మఱుఁగైన నొంటి చిక్కినదానివలెనై కావలసినంత బలఁగముండియు దిక్కులేనిదై పతి గలిగియు ననాథయై హాయని యేడ్చుచు నేలబడి పొరలుచుఁ బౌరులు క్రూరులని దూఱుచు, నా గ్రహచారమున కొకరి నననేలయని సమాధానపడుచు, నెఱిఁగి యెఱిఁగి మగఁడెంతకుఁ దెగించెనని వగచుచు, మ్రుక్కున వ్రేలిడుకొనుచు, దల యూఁచుచు, నిట్టూర్పులు విడుచుచు, తల మోఃదికొనుచు, నొక్కరైనఁ జెప్పువారె లేరైరిగా యని విచారపడుచు, నా కోరికయె నాకు గండకత్తెర యాయెఁగదా యనుకొనుచు, వినాశకాలమునకు గాకున్న నా కట్టిబుద్ధి యేల పుట్టునని తన్ను నిందించుకొనుచు, నత్తలకుఁ జెప్పినవారైన వారించి యుందురేమో యనుచు, అత్తలకుఁ జెల్లెంద్రకైనఁ జెప్పక యిట్టురా సాహసించిన తెంపరికత్తె కిట్లుగా కెట్టులగునని నిరుత్సాహపడుచు,

సీ. ఒడిమీఁద నిడుకొని యురముపైఁ జేర్చుట
చేరిక కది కడసారి యేమొ
చెక్కుచెమ్మటఁ జేల చెఱఁగునఁ దుడుచుట
చెలిమికి నది తుదిచీటి యేమొ

**పుక్కిటి తావికప్పుర వీడె మిచ్చుట**
**యనురాగమున కది యవధి యేమొ**
**కోరినపని కియ్యకొనుట కరుణా ప్ర**
**బంధమ్మునకు ఫలగ్రంథ మేమొ**

తే. **మోముమోమునఁ గదియించి ముద్దుగొనుట**
**యదియె నూహంపుఁబనికిఁ దీఱుదల యేమొ**
**యెలనగవు దేరఁ జూచి లోపలి కనుచుట**
**మేలు చిన్నెల కది పొలమేర యేమొ.**

అని పతి తన్ను నుద్యాన విహారంబులను, జలక్రీడలను, సరస సల్లాపంబులను, నర్మ భాషణంబులను, నాదరించిన విధముఁ దలఁచుచు వెక్కి వెక్కి యేడ్చుచు,

సీ. **వెక్కసంబునఁ దల్లి విషముఁ బెట్టెద నన్నఁ**
**గరుణతో నన్యులు గావఁగలరె?**
**అక్కఱకై తండ్రి యమ్ముకోఁ దలఁచిన**
**వలదని పరులు మాన్పంగఁగలరె?**
**దయలేక భూపతి దండింపఁ దలఁచిన**
**ప్రజలు చేకొని యడ్డపడఁగఁగలరె?**
**ఇచ్చిన దైవంబె యీడేర నీకున్నఁ**
**గెరలివైద్యులు బ్రదికింపఁగలరె?**

తే. **తల్లి పగయైనఁ దండ్రిని దాయవచ్చుఁ**
**దండ్రి పగయైన భూపతి దాయవచ్చు**
**క్షితిపుఁ డట్లైన దైవంబుఁ జేరవచ్చు**
**దైవ మట్లైన నెవ్వరి దాయవచ్చు?**

అని నానావిధముల నెలుగెత్తి యేడ్చిన నందు సమిత్కుశ ఫలాహరణార్థము సంచారము చేయుచున్న వాల్మీకి శిష్యులామెనుఁ జూచి సంతాపించి పరువునఁ బాఱి మహర్షిం జేరి నమస్కరించి యిట్లనిరి.

అయ్యా యే మహానుభావుని యిల్లాలో మేమెఱుంగము కాని చూచుటకు శ్రీమహాలక్ష్మివలె నున్నది. అంతకు మున్నామెను మేమెన్నఁడుఁ గన్నవారము గాము. పుణ్యక్షయముచే నాకాశము నుండిపడిన దేవకాంతవలె నున్నది. జాహ్నవీ



నదియొడ్డున నేటికో దిక్కులేని దానివలె నొంటిగ విలపించు చున్నది. మునీంద్రా! ఆమె దుఃఖమున కర్హురాలుగాదు, అట్లయ్యు నామె దుఃఖపడఁ గారణమేమో? మీ యాశ్రమము పొంత నీయాయింతి యున్నది. ఆమెకు మీరే శరణమనిన వారి వాక్యముల నాలకించి యోగదృష్టిచేఁ జూచి యొక నిమిషమైన నిలువక పాదుకలైనఁ దొడుగదుకొనక శిష్యుల నర్ఘ్యంబు దెమ్మని చెప్పి రిత్తకాళ్ళఁ బరువున నామె యొద్దకు వచ్చెను. వెంటనే శిష్యులను బూజాద్రవ్యములఁ గొనివచ్చిరి. అప్పుడు సీతాదేవికి నర్ఘ్యమిచ్చి వాల్మీకి యిట్లనియె.

తల్లీ! నీవు దశరథేశ్వరు కోడలవు. జనక మహారాజు కూతురవు. శ్రీరాము భార్యవు. పతివ్రతా తిలకమా! నేను వాల్మీకిని స్వాగత మొసఁగుచున్నవాఁడను. నీ విచ్చటికి వచ్చుటకు హేతువు సర్వము నేను యోగదృష్టిచేఁ జూచితిని. నీ యందు దోష మేమాత్రము మూఁటికి ముమ్మాటికి లేదు. సత్యము. మూఁడు లోకములయందు జరగెడునవి జరఁగగలవి జరిగినవి కూడ తపశ్చక్షువులచేఁ జూడఁ గలను. నీవేమియు భయపడకుము. నీవు దుఃఖింపకుము. నా యాశ్రమమందు నిలువుము.

శా. **అమ్మా! నమ్ముము నన్ను, నార్తి విడుమీ యర్ఘ్యంబుఁ గైకొమ్ము సొం**
**తమ్మా గేహమునందు నున్నయటు లానందింపుమీ తల్లి ని**
**త్యమ్మున్ నిన్నరయఁ మదాశ్రమము ప్రాంతంబందు నున్నారు నే**
**మమ్ముం గల్గు తపస్వినుల్ సుతవలెన్ మన్నించి రక్షింపఁగఁ.**

అనిన సీతాదేవి యా మునీంద్రు వాక్యముల విని శిరమునఁ గరములు మోడ్చి సవినయముగ నాయన వెంటఁ బోయెను. ఇది మొదలు కడపటి ప్రమాణవాక్యములు చెప్పువఱకు సీతాదేవి మౌనవ్రతము ధరించియుండెను.

వాల్మీకి మహర్షియు సీతాదేవిని దోడ్కొని తపస్వినుల్ను పల్లెకుం బోవ నమ్మహాభాగ లెదు రరుదెంచి మున్నీంద్రా! స్వాగతము. ఎన్నాళ్ళకో మీరిం దరుదెంచితిరి. మా యందఱ మ్రొక్కులు గైకొని దయయుంచి మీ యాగమన కారణంబుఁ దెలుపుడనిన నమహ్మర్షి వారికి సీతాదేవిం జూపి యిట్లనియె పుణ్యకాంతలారా! ఈమె సీతాదేవి. రాముని భార్య. దశరథు కోడలు. జనకుని కూతురు. మహాపతివ్రత. యిట్టి యీమె నిష్కారణముగఁ బతిచేత విడువఁబడెను. ఈమె నాకుఁ బుత్రికవలె రక్షింప యోగ్యురాలు. మీరును అచ్చపు నెయ్యమున నీమెను సర్వవిధముల నరసి కాపాడుఁడు. ఇదియె మీరు

నా కొసంగవలసిన వరమని పలుమాఱు నొక్కినొక్కి చెప్పి యామెను వారల కప్పగించెను.

లక్ష్మణుఁడును సీతాదేవి యాశ్రమమునుఁ జేరువఱకుఁ జూచుచుండి కంటికిఁ గడవెఁడుగా నేడ్చుచు నయోధ్యకుఁ బయనించెను.

తరువాతఁ గొన్నిదినములకు శ్రావణమాసమున లవణుఁడను రాక్షసుని జంప రామునిచే నియుక్తుఁడై శత్రుఘ్నుఁడు మధురకుఁ బోవుచు మార్గమధ్యమున వాల్మీకి యాశ్రమమున నిలిచెను. ఏ రాత్రి శత్రుఘ్నుఁడు వాల్మీకి పర్ణశాలయందు నిలిచెనో యా రాత్రియందే తపసి బాలకులు వచ్చి మునీంద్రా! రాముని భార్య యిరువురు మగబిడ్డల రమదలఁ గనియె. భూతాదిగ్రహములు సోకకుండఁ రక్షింపరండని తాపస స్త్రీలు మీకుఁ జెప్పుమనిరి యని చెప్పిరి. శత్రుఘ్నుఁడా వాక్యములు విని యదృష్టమనుకొనెను. వాల్మీకియు వెంటనే పోయి పిడికెఁడు దర్భ మంత్రించి ముందు పుట్టిన వానిని దర్భ మొదళ్ళచేతను తరువాతఁ బుట్టినవానిని దర్భకొనల చేతను మార్జనము చేయవలసినదని ఋషి పత్నులకుఁ జెప్పెను. వారట్లు గావించిరి. చేసిన క్రియను బట్టి పెద్దవని పేరు కుశుఁడనియు రెండవవాని పేరు లవుఁడనియు వాల్మీకి యప్పుడే పేర్లు పెట్టెను. శత్రుఘ్నుఁడు మఱునాఁటి యుదయముననే పయనమై పోయెను. ఆ కుశలవు లిరువురు వాల్మీకి రక్షితులై ఋషి స్త్రీ పోషితులై క్రమక్రమముగఁ బెరుఁగుచుండిరి.

అప్పుడు వాల్మీకి తనలోఁ దా నిట్లు తలపోసెను. అయ్యో యెటువంటి మహాపతివ్రతకు నిష్కారణముగ నెట్టి నిందయు గష్టము కలిగెను. సచ్ఛీలమునకిది ఫలమైనచో నెవ్వరింక శీలము ననుష్ఠింతురు? ఈమెకుఁ గలిగిన యపకీర్తిని బాపి సత్కీర్తిని లోకమున స్థిరముగ నిలుపవలయును. సత్యము మఱుగుపడనీయరాదు గదా. అదియునుగాక యీమె లోకమునకు రాక్షసబాధ నివారింపఁ జేయుటకును స్త్రీ ధర్మమును లోకమున కుపదేశించుటకును బుట్టిన ప్రేమస్వరూపిణి శ్రీమహాలక్ష్మి. ఇట్టి యీమె చరిత్రము లోకమునకుఁ దెలియకుండిన నది యెట్లు తరింపఁగలదు? ఈమె నామోచ్చారణమే సర్వపాపహరము కదా. ఎట్లు ఈమె చరిత్రమును లోకమున బ్రకటింతును? కావ్యముగ వ్రాయుదునా? కావ్యాలాపము నిషిద్ధముగదా. రామచరిత్రమును విడిచి సీతాచరిత్ర పల్కు టెట్లు? వేదము నందుఁ జెప్పబడినది. యిమ్మహాపురుష చరిత్రమా? లేక మఱియెుండు రాముఁడు గలఁడా? ఈయన లోకము



నుద్ధరింపఁ బుట్టిన యవతారమూర్తియా? లేక యింతకంటెను గుణోత్తరుఁడు వేఱొకఁడు గలడా? ఈయన ప్రాకృత పురుషుఁడేని యీయన విషయమై నేను కావ్య మెట్లు రచియించి వాగ్వ్యయము చేసికొందును అని యాలోచించు సమయయందమున బ్రహ్మ పనుపున నారదుఁ డాయన యొద్దకు వచ్చెను. వచ్చిన నారదుఁ గాంచి వాల్మీకి తగిన విధిఁ బూజించి తత్త్వ మారయం గోరి నమస్కరించి యిట్లు ప్రశ్నించెను. అయ్యా! యీ కాలమున నీలోకమున గుణవంతు డెవడు? వీర్యవంతుఁ డెవడు? ధర్మజ్ఞుఁ డెవఁడు? కృతజ్ఞుఁ డెవడు? సత్యవాక్యుఁ డెవఁడు? దృఢవ్రతుఁ డెవఁడు? సచ్చరిత్రము కలవాఁ డెవఁడు? సర్వభూత హితుఁ డెవఁడు? విద్వాంసుఁ డెవఁడు? జితక్రోధుఁ డెవఁడు? కాంతి యుతుఁ డెవఁడు? సమర్థుఁడు ప్రియదర్శనుండు నెవఁడు? ఆత్మ వంతుఁ డెవఁడు? అసూయ లేనివాఁ డెవఁడు? రణరంగమున నెవ్వఁడు రోషించిన దేవతా సమూహము గూడ భయపడును? అని పదునాఱు ప్రశ్నలే వేసి యిన్ని గుణములు కలవాడొక్కఁ డుండిన దెలుపుమని యడిగెను. పున్నమినాఁటి రాత్రి పదునాఱుకళలు గల వాఁడీ లోకమున నెవ్వఁడని యడిగిన చంద్రుని కంటె మఱియొకఁడు లేకుండినచంద్రుఁడే యని యెట్లు ప్రత్యుత్తరము పుట్టునో యట్లే యిన్ని గుణములు కలవాఁడు రాముని కొంటె గొప్పవాఁడు లేకుండిన రాముఁడనియే ప్రత్యుత్తము పుట్టవలయును. అప్పుఁడు నా సందేహము తీఱునని వాల్మీకి యోజించెను.

త్రిలోకజ్ఞుఁడు త్రికాలజ్ఞుఁడైన నారదుఁ డాయన ప్రశ్నము లందలి సారమును సారస్యమును గ్రహించి రామునికంటె గొప్పవాఁడు లేమిని నీ ప్రశ్నముల యందలి గుణములు కలవాఁడు రామచంద్రుఁడే యని చెప్పి రామచరిత్ర మంతయు గాయత్రిని సూచించుచు నుపదేశించి పోయెను.

రుక్మిణి : వాల్మీకికి రామచరిత్రము తెలిసియుండెనే, తెలిసిన దాని నుపదేశించుట యేమిటిది?

తండ్రి : మహామంత్రములు నీవు పుస్తకములలోఁ జూచియో యొకరనుచుండఁగుఁ వినియో నేర్చుకొన్నంత మాత్రము చేత నుపయోగపడవు. ఒక్కొక్కసారి తెలిసి తెలియక పఠించినఁ గీడును గలుగును. కావున ఆ మంత్రసిద్ధి నొందిన పెద్దవారి వలన నుపదేశము కావలయును. వీథివెంట బోవునపు డొకని కొక మంచి పట్టాకత్తి దొరకెననుకో ఇఁక మన కేమి కొఱత? దీనితో శత్రువుల

నందఱ సంహారము జేయవచ్చుననిఁ వాఁడు తెలిసి తెలియక యిటు నటు త్రిప్పఁగానే యా విద్య సమర్మముగ గ్రహించినవాఁడగునా? అది యక్కఱ కుపయోగించునా? మఱేమన ఒంటింపు తప్పిన దేహమునిండ గాయములగును. కావున నే విద్యకైన గురువు కావలయును.

ఈ ప్రకార ముపదేశము నొంది సంతుఁష్టుడై నే నెట్టు లీ చరిత్రము రచింపవలయునా యని యాలోచించుచు భరద్వాజుఁడను శిష్యుని తోడ తమసానదికి స్నానమునకై పోయెను.

ఆ సమయమున నొక బోయవాఁడు క్రౌంచపక్షులు పోతు పెంటి కలయుచుండఁగా నందు మగపక్షిని బాణము వేసి వధించెను. ఆఁడు పక్షి యేడ్చుచుండెను. వాఁడు చేసిన యన్యాయకార్యమును జూచి వాల్మీకి కోపించి,

**తే.** **“తెలియు మానిషాదుండ ప్రతిష్ఠ నీక**
**ప్రాప్తమయ్యెడు శాశ్వత హాయనములఁ**
**గ్రౌంచమిథునంబు నందు నొక్కండు నీవు**
**కామమోహితముం జంపుకారణమున.**

అని శపించెను. తరువాతఁ దాను స్నానము చేసి తాను బోయవాని శపించిన విధము నాలోచింపఁగా శాపవాక్యములు సమానములైన వర్ణములు గలిగి నాలుగు పాదములతోఁ బద్యరూపముగ నుండెను. అర్థ మాలోచించినను శాపపరముగా నొక యర్థము, తా నాలోచించుచుండిన రామపరముగా నొక యర్థము స్ఫురించెను. అంతకుముందు వేదములలోఁ దప్ప లోక సామాన్య విషయముగా శ్లోకము లేమిం జేసియుఁ దాను జెప్పినదానికి రెండర్థము లుండుటయుఁ జూచి యాశ్చర్యపడి శిష్యున కా విధముం దెలిపి యేమిది వింతయని తన పర్ణశాలకు వచ్చి యా విషయమై యాలోచించు చుండెను.

రుక్మిణి : నీవు చెప్పిన విశేషములు సంస్కృత శ్లోకములకే కలవేమో?

తండ్రి : మీఁదఁ జెప్పిన పద్యమందుఁ గలవు.

తరువాత నట్లాలోచించుచుండు వాల్మీకి యొద్దకు బ్రహ్మ దేవుఁడు వచ్చి మునీంద్రా! నీవు చెప్పిన శ్లోకము విషయమై నీ వాశ్చర్య పడవలసిన పనిలేదున. అది శ్లోకమే. నా పనుపున సరస్వతీదేవి నీ వాక్కున నిలిచి యట్లు పలికెను.



ఇటువంటి శ్లోకములచేతనే నీవు రామచరిత్ర మంతయుఁ గావ్యముగా రచియింపుము. ఆ చరిత్రయందలి యన్ని విషయములు రహస్యములైనవి కానివి కూడ నీకుఁ దోఁచుచుండును. నీవాక్కున నసత్యము రాదు. దానిచే నీకు మహాపుణ్యము కీర్తి గలిగి యీ భూమి సముద్రములు గిరులు గలంతకాలము రామచరిత్రము లోకమున నుండు నంతకాలము నీవు నాలోకమున వసించి ముక్తి నొందఁగలవు అని యాజ్ఞాపించి పోయెను.

వాల్మీకియుఁ దపోదృష్టిచే రామచరిత్రమంతయుఁ నెఱిఁగి యిరువది నాల్గువేల శ్లోకములు ఏడు కాండములు గలట్టుగ రావణ వధము నధికరించి శ్రీమద్రామాయణము సీతా మహాచరిత్రమంతయు జరగినది జరగఁబోవునది కూడ రచియించి యిది లోకమున వ్యాపించు టెట్లు? సీతాదేవి మహిమ లోకమునకుఁ దెలియుటెట్లు? అట్లు తెలియకున్న నే నింత చేసి ప్రయోజనమేమి? ఎవరివలన నిది లోకమున వ్యాపింపఁగలదు? అని యాలోచించి రూపమునందుఁ, బ్రమాణమందు, యోగ్యతయందు, బుద్ధికుశలతయందు, గావిద్యయందు సమానులు నసమానాఉలును దనకు శిష్యులు నైన కుశలవులే దీనికిఁ దగిన వారని యాలోచించి వారికా రామాయణ మంతయు వాగ్విధేయముగా నేర్పెను.

ఇప్పటికి కుశలవులకుఁ బండ్రెండు సంవత్సరముల వయస్సు.

రుక్మిణి : అప్పా! కుశలవులకు రాముఁడు తమ తండ్రి యని సీతాదేవి తల్లియని తెలియునా?

తండ్రి : రాముఁడు తమ తండ్రియని తెలియదు. వాల్మీకి యట్టి యేర్పాటు చేసెను. సీత మౌనవ్రతము ధరించుట చేతను వాల్మీకి కట్టుఁబాటు చేతను దల్లి యెవరైనదియు తెలియదు.

అమ్మణ్ణి : పాలు త్రాగుటచేత తల్లియని తెలియదా?

తండ్రి : పాలుత్రాగు లేఁత వయస్సులో గుర్తింపఁగలరా? కొంచెము ఇంగితము కలుగఁగానే వాల్మీకి అక్కడ నుండి వారిని దొలఁగించి యుండును.

రుక్మిణి : దాదిచేతఁ బా లిప్పింపఁగూడదా?

తండ్రి : తాము బిడ్డలకుఁ బాలిచ్చిన సొగసు చెడునని తమ పొదుగుల నిండ బాలుండియు మందులచే నెండఁగట్టి శూద్రల తురకల దాదుల పాలిప్పించు మహాభాగ్య స్త్రీలిప్పుడు మనదేశమునఁ బుట్టినారు. చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందెలు గదా పుట్టును. ఎవతె పాలు బిడ్డ త్రాగునో దాని గుణములు లభించునని యెఱుగక నీచకులజల చేతఁ బాలిప్పించిన దానివలన నెన్ని కీడులు గలుగునో యాలోచించువారెవరు? మగవారో, తమ భార్యలను బిడ్డలను దేహ దేవతలను జేసి దురాచారములు నేర్పు చున్నారేగాని వాస్తవమైన దోషములను గనిపెట్టి చక్కదిద్దు తెలివితేటలు లేనివారగుచున్నారు. కాలబలము. ఇప్పుడీ విచారమేల? పోనిమ్ము. వారికిఁ దెలిసిన దంతయుఁ దామొక ఋషిపత్ని కుమారుల మని వాల్మీకి శిష్యులమని, పూర్వము కుమారుఁడు కలుగఁగానే తపసునం దెక్కువ యాసక్తిగలవారు సంసారములు వదలుకొని తపస్సునకుఁ బోవుచుండిరి. తా మట్టివారి బిడ్డలుగా వారు తలఁచినఁ దలచి యుండవచ్చును.

రాముఁడు : పండ్రెండు సంవత్సరములకే అంత పెద్ద రామాయణ మెట్లు వారు ముఖస్థముచేసినారబ్బా?

తండ్రి : రామాయణమే కాదు. ఇంకను శాస్త్రములు సంగీతము కూడ నేర్చిరి.

రాముడు : అదెట్లు నేర్చిరి?

తండ్రి : ఎట్లనఁగా, శ్రద్ధ కొలఁది. విద్యా వారు, విద్య నేర్వవలయునని యాసక్తి గలిగి నేర్చినవారు.

రాముఁడు : మేము విద్య రాఁగూడని చదువుచున్నామా?

తండ్రి : మీరు చదువునది విద్యకై కాదు. మీకు విద్య చెప్పువరాఉ మీకు విద్య రావయునని చెప్పువారు కారు. తమ జీవనార్థము చెప్పువారు. ఎవఁడైన నెక్కువగఁ జెప్పినను అవి పరీక్షలో రావని బాలురందురు. మీరు నేర్చుకొను విద్య కూలి విద్య. మీ తల్లిదండ్రులు మీకు చదువు నేర్పుట మిమ్ముఁ గూలివాండ్రుగఁ జేయుకోర్కినే. మీరు చదువుట కూలి చేసి బ్రతుకుటకే. కావున మీకెట్టి చదువెంత రావలయునో



యట్టి చదువంతే వచ్చును. అల్పోద్దేశముతో నేర్చుకొను చదువు అల్పవిద్యయే. మీకు శ్రద్ధ గలదేని యొకరి ననవేల?

రాముఁడు : మేమేమి చేయుదుము? పెద్ద వారేది చదువుమనిన నది చదువుదుము.

తండ్రి : రామాయణములోఁ బిడుకల కొట్లాట యన్నట్టులు నడుమ నడుమ నివి యేల? తరువాత వినుఁడు.

ఈ ప్రకారము కుశలవులు రామాయణ మంతయు స్వరలయ గ్రామయుక్తముగఁ బాడుటను నేర్చుకొనిరి. ఆ సమయమున శ్రీ రాముఁ డశ్వమేధ యాగ మొనర్చుచు ఋషీశ్వరులనందఱఁ బిలిపించెను. శిష్యులతోడ వాల్మీకి మహర్షియు నచటికి బోయి తను కనువైనచోట దిగి కుశలవులతో నిట్లనియె.

నాయనాలారా! మీరు నేర్చిన విద్య ప్రకాశింపఁ జేయు సమయము వచ్చినది. మీరు ప్రతిదినము నాహ్నికములైన వెంటనే వీణెలు కేల గ్రహించి బ్రాహ్మణులందు చోటలును, మౌని వాడలందును, రాజమార్గములందును, రాజుల యిండ్లయందును, రామచంద్రుని యింటి యొద్దను, యజ్ఞ వాటమునందును, వీథులయందును, వీనులవిందుగ రామాయణ మెల్ల బాడుఁడు. అందు ముఖ్యముగ ఋత్విజు లుండుచోటఁ దప్పక గాన మొనర్పుఁడు. పురి వెలుపలి ప్రదేశములఁ బుట్టిన ఫలముల మెసవిన నారోగ్యము గలుగుటయేగాక కంఠము ఊపెక్కదు. అలసట దోఁపదు. కావున పర్వతములందు బుట్టిన ఫలముల మెసవి రామాయణమును బాడుఁడు. రామ భూవరుఁడు మిమ్ముఁ బిలిపించి మీ రెవ్వరి కుమారులని యడిగిన వాల్మీకి శిష్యులనమని జంకు కొంకు లేక వచింపుఁడు. పాడుఁడని కోరిన దినమున కిరువది సర్గముల చొప్పునఁ బాడుఁడు. ధనాశ కొంచెమైనను నొందకుఁడు. లోభముదగదు. ఆశ్రమంబులఁ దపస్సు చేయుచు ఫలమూలముల నుదరము నించుకొను వారికి ధనమేల? మొదటినుండి మీరు పాడవలయును. రాముఁడు పిలిపించెనా, రాజులతో మాకేమి పని యని తిరస్కరింపకుఁడు. అందఱకు రాజు తండ్రివంటి వాఁడు. గావున మీరును రామునిపట్ల తండ్రికిఁ జూపఁదగు గౌరవముఁ జూపవలయును. నేను జెప్పిన ప్రమాణములు లోనైన వేదియు మఱవక ఱేపతినుండి ఈమరు పాడుట కుపక్రమింపవలయును అనిన వారును

మహానందముతో నా రేయి గడపి యుదమమున లేచి సంధ్యవార్చి, యగ్నుల వేల్చి, ముని యనుజ్ఞ పడసి చేతుల వీణెలెత్తుకొని వీథుల వెంట బయలు దేఱిరి.

సీ. కొండెగా నౌదలఁ గురులను ముడివైచి
వీఁపుపై నొకకొన్ని వ్రేల విడిచి
మున్నమ జాబిల్లి బురిడించు మోమున
భవ్యచందన రేఖ పదిలపఱిచి
మొనయించి దాపలి మూఁపుమీఁదఁ బ్రవాల
మఱకేలఁ గాయల నమర నిలిపి
తరుణాంగుళంబులఁ దంత్రుల మీటుచు
మెడనొంటి జందెంబు మెఱఁగు లీనఁ

గీ. గటితలంబునఁ జిన్ని వల్కలముఁ జుట్టి
రాగ మలరార మంజుల రాగమొప్పఁ
గాల తాల లయాదుల క్రమ మెఱింగి
పాడి రవ్వేళ నట వాడవాడయందు.

వారి చక్కఁదనమునకు, రాగము తియ్యఁదనమునకు, స్వరము సొంపునకు, కథ యింపునకు నర్థము పెంపునకు విన్న వారు సొక్కి సోలుచుండిరి. ఇట్లు వారు పాడుచుండ రాముఁడు విని వారిని సభకుఁ బిలిపించి మీరెవ్వరని వారి నడిగెను. మేము వాల్మీకి శిష్యులమని వారు చెప్పిరి. మఱికొంత విని రాముఁడు లక్ష్మణునితోఁ బదునెనిమిది వేల స్వర్ణములు వీరికిమ్మని చెప్పెను. భరత లక్ష్మణులును వెంటనే తెచ్చి మీరిరువురు తీసికొండని వారికి వేర్వేఱ నిచ్చిరి. దానిని జూచి యాశ్చర్యపడి రామునిఁగని

చ. వనములలో వసించుచును బక్వఫలంబులు వేరు వెల్లఁకుల్
దినుచును ముక్కుఁ బట్టుకొని తేఁకువ నెప్పుడు దైవచింతనఁ
దినములు త్రోయు మాకు నృపతీ! కనకంబు లివేల? యెందు
నేపనియగు మాకు వీనిఁగొని పాతఱ వెట్టిన భూమి లోపలన్ !

అని యా కనకరాశి కొనకుండిన వారిని జూచి రాముఁడును సభవారు విస్మయపడిరి. అందు రాముఁడు వారితో నిట్లనియె.



మీరు పఠించు కావ్యమునకుఁ గర్త యెవరు? దానికి మూలమేది? దేనిఁగూర్చి యది పలుకఁబడినది. తెలుపుఁడనిన వారిట్లనిరి.

భగవంతుఁడగు వాల్మీకి మహర్షి కృతికర్తలు. వారీ యజ్ఞవాటికి సమీపదేశమందే యున్నవారు. రాజా! కావ్య విషయము త్వచ్చరిత్రము. ఇది యిరువది నాలుగు వేల గ్రంథములు, నూఱు పాఖ్యానములు గలది. ఏనూఱు సర్గములు ఆఱు కాండంబులుగను మఱి యుత్తరకాండమును గలిగి శోభిల్లునట్లు మా గురువు వచించెను. ఇందు నీ శుభాశుభ చరిత్రమెల్ల వర్ణితము. వినం గోరెద వేని నీకు విరామము దొరకినపుడు వినిపించెద మని చెప్పిన రామచంద్రుఁడును బ్రతిదినము మధ్యాహ్నము మీఁద సభ చేసి వినుచుండెను.

ఆ రామాయణము వినుటవలననే యా గానము సేయు బాలకు లిరువురు సీతాసుతులని గ్రహించి రాముఁడు దూతలను బిలిచి మీరు వాల్మీకి యొద్ద కేగి "సీత పవిత్రచరిత్ర యని విగతకల్మష యని మీ యభిప్రాయ మేని మీ యనుజ్ఞ నొంది ఱేపే సీత శపథ మేదైనఁ జేయునా యని రాజుగారు మీ యభిప్రాయమును సీత యభిప్రాయమును దెలిసికొని రమ్మ"నినారు అని చెప్పుఁడని సభవారు వినుచుండఁ జెప్పెను. వారును వాల్మీకి యొద్దకుఁ బోయి నమస్కరించి రామవాక్యములు చెప్పిన వాల్మీకియు పతివ్రతలకు బ్రాణవిభుఁడే దైవము. సీత భర్త యాజ్ఞ ప్రకారము నడచుకొనఁ గలదని చెప్పుఁడు" అని ప్రత్యుత్తర మంపెను.

వెంటనే శ్రీరాముఁడును సభ్యులను జూచి రాజులారా! శిష్యసమేతులైన మునీంద్రులారా! మనస్సులో సందేహము గల లోకులారా! ఱేపు మీరందఱుఁ దప్పక సభకు రావలయును. లోకమున కెల్ల దెలియునట్లు సీతాదేవి ఱేపు శపథమొనర్చును అని చెప్పిన నందఱును రామా! యింతటి కార్యము చేయుటకు నీకే తగుఁగాని మఱియొకనికి సాధ్యమగునది కాదు అని మెచ్చుకొనిరి.

మఱునాఁటి యుదయమున శ్రీరాముఁడు యజ్ఞవాటంబుఁ జేరి వసిష్ఠుని వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, విశ్వామిత్రుని, దుర్వాసుని, గర్గుని, జ్యవనుని, పర్వతనారదులను, భార్గవుశక్తిని, వామనుని, భరద్వాజ గౌతమ మార్కండేయులను, పులస్త్యుని మఱియుఁ దక్కిన యనేక మహర్షులను బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులను బిలిపించెను. సీతా శపథముఁ జూడ నానా దేశములనుండి జ్ఞాన నిష్ఠులు, కర్మనిష్ఠులు యోగనిష్ఠులు నరుదెంచిరి. అందఱు

